# చతుర

సంపుటి : 9 జూలై 1986 సంచిక : 6

## ఈ నెల సమగ్ర నవల

తన వృత్తికి సంబంధించినంత వరకూ అమోఘమైన జ్ఞాపకశక్తి గల లాయర్ రావుగారికి, మిగిలిన విషయాల్లో మతిమరుపు విపరీతం!

ఆయన్ని పరీక్షించడానికి ఆయన భార్య "మీకు మగపిల్లలెందరు?" అని ప్రశ్నవేయగా వచ్చిన జవాబు ''ఆరుగురు'' అని.

''ఆరుగురు కాదు అయిదుగురే'' అంది భార్య రాజమ్మగారు.

''మాలతితో కలిపి ఆరనిచెప్పాను''అని సమర్థించుకున్నారాయన.

''మాలతి ఆడపిల్ల కదా! సరే, మగ పిల్లల పేర్లు చెప్పండి!"

"మాధవ, కేశవ..." అంటూ ప్రారంభించారు రావుగారు.

''కేశవుడి తర్వాత మాధవుడు'' అంటూ, "కేశవ, మాధవ, రాజీవ, సుందరం, శివం''అని తమ పిల్లలపేర్లు పరిచయం చేశారు రాజమ్మగారు.

''అయ్యో! అనంతుడి పేరు మర్చిపోయేవు కదే!"

"కడుపున పుట్టిన పిల్లలెవరో తెలీదు మీకు. అనంతుడు మీ కొడుకా?''

''కాదా?''రావుగారికి అంతా గజిబిజిగా వుంది.

"కేశవుడి కొడుకుకదా!'' అన్నారు రాజమ్మగారు కోపంగా.

''కొడుకేమిటి, మనవడేమిటి అంతా ఒకటే'' అని డబాయించబోయారాయన. రిటైరైన రావుగారు కాలక్షేపం కోసం కల్పించుకున్న వ్యాపకాలు, వాటి పర్యవసానాలనుప్రసిద్ధ కన్నడ రచయిత్రి

## త్రివేణి-

శ్రీఖని హాస్యధోరణిలో వెలువరించిన రచన

# చిగురు

పాఠకులను ఆకట్టుకునే రీతిలో తెలుగు నవలే అనిపించేలా

## ఉమా-కల్యాణి

సమర్థవంతంగా అనువదించిన కన్నడ నవల 'చిగురు' ఈనెల 'చతుర' సమగ్ర నవల!

# సూపర్ రిన్‌తో తళతళలాడే
# ఆ తెల్లదనం






**సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు**

మరే ఇతర డిటర్జంట్ పొడి లేదా బార్ కంటే తెలుపు.

హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# మీ "చతుర సమీక్ష"

ఇటీవల విశేషంగా పెరిగిన పాఠకాదరణను పురస్కరించుకుని 'చతుర'ను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది మీ పత్రిక 'చతుర'. ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవల బాగోగులను చర్చించే శీర్షిక పేరు **"చతుర సమీక్ష"**.

సాధారణంగా పత్రికలలో సాహిత్యానుభవంగల విమర్శకులచే వివిధ రచయిత(త్రు)ల పుస్తకాలను సమీక్షింపజేయటం రివాజు. కాని 'చతుర'లో ఈ శీర్షికవల్ల ఆ అవకాశం పాఠకులకే లభిస్తుంది. పాఠకులు చేయవలసిందల్లా 'చతుర'లో ప్రచురించే నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆ నవల నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులను గురించి రాయవచ్చు!

ఇక ఈ శీర్షికలో పాల్గొనేవాళ్ళు గమనించవలసిన ముఖ్యాంశా లేమంటే: 1. "చతుర సమీక్ష"కు పంపే మీ రచన అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపు మాత్రమే రాయాలి; 2. ఆయా సమీక్షలు మాకు ప్రతినెలా 15వతేదీలోపు అందాలి; 3. మీసమీక్షకు తప్పనిసరిగా ఇందులో ఇస్తున్న కూపన్‌ను జతపరచాలి; 4. కవరుపై "చతుర సమీక్ష"కు అని పేర్కొనాలి.

మాకు అందిన పాఠకుల సమీక్షలలో ఉత్తమమైనవిగా మేము ఎంపికచేసిన మూడింటిని ప్రచురించి రూ. 100, 75, 50 చొప్పున నగదు బహుమతులు పంపగలం. జూన్ నెల నవలపై పాఠకుల "చతుర సమీక్ష"లు ఆగస్ట్ సంచికలోనూ, జూలై నవలపై రాసినవి సెప్టెంబరు సంచికలోనూ- ఆ ప్రకారం వరుసగా ప్రచురింపబడతాయని పాఠకులు గమనించాలి.

ఇక విరివిగా పాల్గొని ఈ శీర్షికను సద్వినియోగం చేసుకునే వంతు పాఠకులదే!

కూపన్

'చతుర' నవల పేరు:........................

సమీక్షకుని పేరు:........................

చిరునామా: ........................

........................

........................



# వింత ప్రపంచం

## ఉపాధి కల్పన

మధురైకి చెందిన 22 ఏళ్ళ గణేశన్ బి.కాం పట్టభద్రుడు. అతను ఏనుగును కొనుక్కునేందుకు లోను కోసం బ్యాంకుకి దరఖాస్తు పెట్టుకున్నాడు. మధురైలోని సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియావారి తల్లకులమ్ శాఖనుంచి చిన్నతరహా పరిశ్రమల పథకంకింద అతనికి 20వేల రూపాయల లోను మంజూరయింది.

గణేశన్‌కి లోను ఇచ్చేందుకు బ్యాంకు అధికారులు మొదట్లో వెనుకాడారు. కాని గణేశన్ అదేపనిగా విజ్ఞప్తులు చేసేసరికి వారు దానిగురించి పునరాలోచించారు. గణేశన్‌తండ్రి రాజారామ్ వారి ఖాతాదారే. అతనికిగల రెండు ఏనుగులద్వారా మంచి ఆదాయమే కళ్ళజూస్తున్నాడు. అద్దెకు తిప్పే ఏనుగును కొనుక్కునేందుకు లోను మంజూరు చేయరాదనే నిబంధనలేవీ బ్యాంకుకి లేవు. శుభకార్యాలకి పాత్రలూ, కుర్చీలూ, బల్లలూ అద్దెకివ్వడంలాంటిదే ఇది కూడా! ఇవన్నీ ఆలోచించి చివరికి బ్యాంకు వారు గణేశన్ విన్నపాన్ని మన్నించారు.

లోను ఇచ్చేముందు బ్యాంకువారు అటవీశాఖనుంచి ఏనుగు వయసు, దాని యజమాని గురించి నిర్ధారించే సర్టిఫికెట్ దాఖలు చేయమని గణేశన్‌ని కోరారు. తర్వాత పశువుల డాక్టర్‌తో ఏనుగును పూర్తిగా పరీక్షింపజేశారు. అది సంపూర్ణా రోగ్యంతో వున్నట్టు వైద్యుడు ధ్రువపరిచాకే బ్యాంకువాళ్లు లోను మంజూరు చేశారు. గణేశన్‌కి ఏనుగు గురించి పూర్తిగా తెలుసా, అది అదుపుతప్పి ప్రవర్తిస్తే స్వాధీనం చేసుకోగలరా అనే సంగతులు కూడా నిర్ధారించుకున్నారు. గణేశన్ రాజపాల్యం శివాసిదగ్గర నుంచి 30వేల రూపాయలకి ఏనుగును కొన్నాడు. అందులో బ్యాంకునుంచి పొందిన లోను 20వేలు కాగా, అతని తండ్రి మరో 10 వేల రూపాయలిచ్చి సాయపడ్డాడు. ఏనుగును పోషించడానికి రోజుకింత కూలీ ఇచ్చేపద్ధతిలో ఓమావటిని నియమించాడు. ఏనుగు మేతకి రోజుకి 60నుంచి 70 రూపాయలదాకా ఖర్చవుతుంది. అందులో పొద్దున్న, సాయంత్రం కొనే గడ్డికే 40 రూపాయలవుతుంది.

స్థానికంగా జరిగే శుభకార్యాలకి ఏనుగును కిరాయికిస్తే 8 గంటల షిఫ్టుకి 200 రూపాయలు తీసుకుంటాడుగణేశన్. తెలిసినవారికి '50 రూపాయలకే ఇస్తాడు. మరో వూళ్లో జరిగే శుభకార్యాలకైతే రవాణా, ఇతర ఖర్చులుపోను రోజుకి 200 నుంచి 300 రూపాయలదాకా తీసుకుంటాడు. సినిమా షూటింగులకి షిఫ్టుకి 1500 రూపాయల అద్దె. ఇవికాక ప్రముఖులకి, మంత్రులకి ఏనుగుతో పూలమాలలు వేయించి సత్కరించే సందర్భాలకు కూడా తన ఏనుగును అద్దెకిస్తాడు గణేశన్.

గణేశన్ ఏనుగును కొని స్వయం ఉపాధిని చేపట్టేందుకు స్ఫూర్తినిచ్చింది అతనితండ్రే. రాజారామ్‌కి గత 30 ఏళ్ళ నుంచీ ఏనుగు వల్లనే జీవనోపాధి లభి





స్తోంది. అతను మొదట్లో చిన్న గుమస్తా వుద్యోగంచేశాడు. తర్వాత ఓ దేవాలయం తాలూకు ఏనుగుకి సంరక్షకుడిగా 400 రూపాయలు లభించే వుద్యోగంలో చేరాడు. ఆ జీతం కుటుంబం గడవడానికి సరిపోయేది కాదు. ఓసారి ఏనుగుకి తిక్క రేగి రాజారామ్‌పై దాడిచేయడంతో అతనికి ఎముకలు విరిగి ఓ నెలపాటు ఆస్పత్రిలో వుండాల్సి రావడమేకాక వుద్యోగం కూడా పోయింది. తర్వాత అయిదేళ్ళపాటు సరైన వుద్యోగం లేక అతను చాలా బాధపడ్డాడు. అప్పుడే అతనికి ఏనుగును అద్దెలకు తిప్పేఆలోచన వచ్చి, డబ్బుకూడబెట్టి ఏనుగునుకొన్నాడు. దానిపై మంచి ఆదాయం రావడంతో మరో ఏనుగును కూడా కొనుక్కోగలిగాడు. వాటిపై వచ్చిన ఆదాయంతో ఆయన రెండంతస్తుల భవనాన్ని కట్టించుకున్నాడు కూడా.

ఇదివరలో పొల్లాచి, తెప్పకాడులలో ఏనుగులను వేలంవేసి అమ్ముతుండేవారు. కాని ఇపుడు అటవీశాఖ ఆ వేలంపాటల్ని ఆపుచేయించింది. అందువల్ల గణేశన్ కేరళకు చెందిన ఏనుగును కొన్నాడు.

తెల్లటి దంతంతో, దంతాలు, చెవులు బాగా పెద్దవిగావున్న ఏనుగు మేలుజాతికి చెందినదని, కాని తన ఏనుగు మామూలు జాతిదేనని, అది చెప్పినట్లు వింటుందని, చుట్టుపక్కల శబ్దాలు ఎక్కువైతే ఒక్కొక్కప్పుడు తిక్కగా ప్రవర్తిస్తుందని, ఒక్క దెబ్బ వేస్తే తిరిగి దారిలోకొస్తుందని వివరించాడు గణేశన్.

## కవల విచిత్రాలు

భౌతికంగా ఒకరినొకరు పోలివుండే కవలలు అలవాట్లు, ప్రవర్తనలో కూడా అదే పోలిక కలిగివుండటం అమితాశ్చర్యకరంగా వుంటుంది. పోలికలున్న కవలల్లో అమెరికాలోని ఓహియోకు చెందిన కవలల పేరుసైతం ఒక్కటే!



ఇద్దరినీ వేరు వేరు కుటుంబాలవాళ్ళు చిన్నపుడే దత్తతకు తీసుకుని 'జేమ్స్' అని పేరుపెట్టారు. ఇద్దరు 'జేమ్స్'లూ 40 ఏళ్ళ వయసులో వుండగా ఓ బ్రిటీషు మనస్తత్వవేత్త వారిలో గల పోలికలను గమనించి ఆశ్చర్యపోయాడు. ఒకరి కొకరు సంబంధంలేని రెండు కుటుంబాలలో పెరిగినా ఇద్దరూ వృత్తిగా 'మెకానికల్ డ్రాయింగ్'నే స్వీకరించారు. చెక్కలతో బొమ్మలు చేయడం ఇద్దరికీ హాబీయే! ఆ కవలల పేర్లలాగే వారి మొదటి భార్య పేర్లూ, కొడుకు పేర్లూ కలిశాయి. భార్య పేరు 'లిండా', అయితే కొడుకు పేరు అలెక్స్. ఆ ఇద్దరి రెండో భార్యల పేరూ 'బెట్టీ' అవడమేకాక, వారి పెంపుడు కుక్కల పేరు 'టాయ్' కావడం మరో విచిత్రం!

'జేమ్స్'లకి మల్లేనే అమెరికాలోని 'మెయినే'లో కవల ఆడపిల్లలు వేరయి, ఒకరికొకరు తెలియకుండా పెంచబడ్డారు. 26 ఏళ్ళ తర్వాత మొదటిసారి కలిసినపుడు ఇద్దరి పేర్లూ 'క్రిస్టీన్'కావడం, ఇద్దరూ 'కాస్మెటిక్ స్పెషలిస్టు' వృత్తినే చేపట్టడమూ తెలిసి ఆశ్చర్యపడ్డారు. బ్రిటన్‌లో మరో కవల సోదరీమణులు విడివిడిగా పెరిగి 35 ఏళ్ళ తర్వాత కలుసుకున్నారు. వారి పేర్లు ఒకటి కాకపోయినా గమత్‌గా, ఒకరి కొడుకు పేరు రిచార్డ్ ఆండ్రూ అయితే, మరొకరు కొడుక్కి ఆండ్రూరిచార్డ్ అని పేరు పెట్టారు.

రోమ్‌లోని మెండెల్ ఇన్‌స్టిట్యూట్‌కి చెందిన ప్రొఫెసర్ లూయిగీజెడ్డా 1953 నుంచీ కవలలపై పరిశోధన సాగిస్తూ ఇప్పటికి 15వేల మందిని పరిశీలించాడు.



జాన్, ఆర్థర్ అనే కవలలు పైలెట్లుగా వుద్యోగంచేసి రిటైరయి, ఒకరు బ్రిస్టల్ లోనూ, మరొకరు విండ్‌సార్‌లోనూ నివసిస్తున్నారు. వాళ్లు 66ఏళ్ళ వయసులో 1975 మే 22నాటి సాయంత్రం ఏకకాలంలో ఇద్దరూ భరించలేనంత వంటినొప్పులకి గురయ్యారు. వారిని ఆసుపత్రికి తీసుకెళ్ళినా ప్రయోజనంలేకపోయింది. ఇద్దరూ ఒకే క్షణంలో ప్రాణాలు కోల్పోయారు!

ఇల్లినాయిస్‌కి చెందిన లూయిస్‌కీల్ తన కవల సోదరుడైన డోనాల్డ్‌కీల్‌కి ఫోన్ చేసినప్పుడల్లా ఫోన్ ఎంగేజ్ అయిన శబ్దమే వస్తుండేది. ఎందుకంటే - అదే క్షణంలో డోనాల్డ్‌కీల్‌కికూడా తన సోదరుడితో మాట్లాడాలన్పించి, ఫోన్ చేస్తుండేవాడుగనక!

లాస్‌ఏంజిలిస్‌లో సంపూర్ణారోగ్యవంతురాలైన ఓ మహిళకు ఓ రోజు హఠాత్తుగా తన చుట్టూ మంటలు చెలరేగినట్టు, అతి తీవ్రమైన నొప్పికి గురయింది. ఆమెను పరీక్ష చేసిన డాక్టర్లకి ఆమె ఆరోగ్యంలో తేడా ఏమీ కనబడలేదు. కొన్ని గంటల తర్వాత ఆ నొప్పి మటుమాయమైందిగానీ ఆమె మానసికమైన షాక్‌కి లోనయింది. ఆమెలో అనుకోని మార్పు కలిగిన సమయంలోనే సరిగ్గా, కేనరీ దీవులలో జెట్ విమానం కూలి, ఆ ప్రమాదంలో ఆమె కవల సోదరి మరణించినట్టు, మూడు రోజుల తర్వాత తెలిసింది.

మామూలుగా స్త్రీ అండంలో ఒక కణం, ఒక వీర్యకణంతో ఫలదీకరణం చెందటంతో ఏర్పడే పిండమే పెరిగి శిశువుగా రూపుదిద్దుకుంటుంది. అలా కాకుండా అండంలో రెండు కణాలు రెండు వీర్యకణాలతో ఫలదీకరణంచెందితే రెండు పిండాలు ఏర్పడి కవలలుపుడతారు. కాని, వాళ్లు ఒకరినొకరు పోలి వుండకపోవచ్చు!

ఒక్కొక్కప్పుడు గర్భంలో పిండం ఏర్పడ్డాక అది రెండుగా విడిపోతుంది. అలా జరిగినపుడుపుట్టే కవలలే పోలికలు కలిగివుంటారు. అండంలో ఒకే కణం, ఒకే వీర్యకణం ఫలదీకరణంచెంది ఏర్పడిన పిండం కాబట్టి కవలల మధ్య ఆ పోలిక వస్తుంది. భౌతికంగా, మానసికంగా వారి మధ్య పోలికలు ఎంతగా వుంటాయనేది, పిండం ఎన్ని రోజుల తర్వాత రెండుగా విడిపోయింది అనే దానిపై ఆధారపడి వుంటుంది.

గర్భంలో పిండం ఏర్పడిన 10రోజుల లోగా రెండుగా విడిపోతే పుట్టే కవలల మధ్య పోలికలు వుండకపోవచ్చు. ఆ విడిపోవటం 13రోజుల తర్వాత సంభవిస్తే బాగా పోలికలున్న కవలలు పుడతారు.

పోలికలున్న కవలలు వేర్వేరు పరిసరాల్లో పెరిగినా వారి ఐ.క్యూ. ఒకేలా వుంటుందని, స్వీడన్‌లోని ఓ మెడికల్ జెనెటిక్స్ సంఘ పరిశోధనలో తేలింది. అంతేకాక వాళ్లు ఒకే రంగంలో నిపుణులుగా పేరు తెచ్చుకునే అవకాశమూవుంది. పరీక్షల్లో ఇచ్చిన ప్రశ్నలకి కవలలు జవాబులిచ్చిన తీరు పరిశీలించగా, వారి వివేచనా జ్ఞానం, భావప్రకటనా విధానం, దస్తూరిలో, అదిరాసింది ఒక్కరేనేమో అన్పించేంత దగ్గరి పోలికలున్నట్టు తెలిసింది.

కవలల్లో ఒకరికి హీమోఫీలియా, డయాబెటిస్ మెలిటస్, ఆసమా, ఎపిలెప్సి లాంటి రోగాలుండే రెండోవారిలో కూడా ఆ వ్యాధి లక్షణాలు కనబడిన నిదర్శనాలున్నాయి. ఆయా రోగాలు వంశపారంపర్యమైనవి కావడమే దీనికి కారణం!

# నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.




మీ చేతుల వెచ్చని, సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి–ఇవే మీ కుటుంబానికి కావలసినవి. అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే, అయొడెక్స్‌లో గాయపడిన ధాతువులను నయంచేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరిఉన్నాయి.

## అయొడెక్స్ రోజుకు రెండు సార్లు రెండింతలు గుణకారి

నొప్పి తగ్గే వరకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండు సార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు. ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువులకైన గాయం.

కనుక మీ ఆప్తులు ఎవరైనా బెణుకులు, కండరాల పట్లు, కీళ్లపట్లు, లేదా ఒళ్లు నొప్పులతో బాధపడటం జరిగితే అయొడెక్స్ మర్దించండి. రోజుకు రెండు సార్లు. తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

**అయొడెక్స్® – నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్.**

**SKOF** – ఎస్‌కేఎఫ్ ఉత్పాదన.

ELL-1508

"అయ్యా...అయ్యా!" అంటూ అతను ఆ ఇనపగేటుని దడదడ లాడించాడు.

లోపల్నుంచి జవాబేమీ రాలేదు.

"సర్...సర్"

వరండాని ఆనుకునివున్న హాల్లో పడక్కుర్చీలో పడుకుని రావుగారు ఆరోజు పేపర్ తిరగేస్తున్నారు. ఆయన అప్పుడే కాఫీ తాగి, స్నానం-సంధ్య ముగించుకుని పేపర్ చదవడంలో నిమగ్నమయ్యారు.

"అయ్యా" అన్న పిలుపుకి ఆయ నొకసారి కనుబొమలు చిట్లించి మళ్ళీ పేపర్ పఠనంలో మునిగిపోయారు.

"సర్"

'సర్'కి వున్న విలువ 'అయ్య'కి లేదల్లేవుంది. రావుగారు ఆ వెంటనే లేచి వరండాలోకి వచ్చారు.

"ఎవరు?"

"నేను సర్"

"సరె..సరే, ఎవరు కావాలి? లాయరా డాక్టరా? మేష్టారా? లాయర్‌గారు ఆఫీసు కెళ్ళారు. ఈవేళప్పుడు ఆయన ఇంట్లో వుండరు"

"కాదు" అని అతను మొదలెట్టాడు.

"డాక్టరా? ఆయన ఇప్పుడింట్లో వుండరు. ఆస్పత్రిలో వుంటారు. ఏమ యింది నీకు? ఏమిటి అనారోగ్యం? అయినా డాక్టర్‌గారు ఇంట్లో ఎవర్నీ చూడరు నన్ను తప్ప. అయినా నేనాయనకి చూపించుకోనసుకో"

"అది కాదయ్యా..."

"అలా చెప్పు మరి, మేష్టారా కావల్సింది? అదేం మేష్టర్‌గిరీయోగానీ,ఎప్పుడు చూసినా ఒకమంద కుర్రసజ్జుని వెంటేసుకుని తిరుగుతూవుంటాడు.పిలుస్తానుండు" అంటూనే'రాజీవా...రాజీవా..' అని రావు గారు గొంతు పెంచి పిలిచారు.

ఊరందరికీ తెల్లారినా రాజీవుడికి మాత్రం ఇంకా తెల్లవారలేదు. రాత్రి పదకొండు వరకూ విద్యార్థులకి ప్రైవేట్లు చెప్పి అలసిపోయుంటాడు. అందుకే పొద్దున్న తొమ్మిది గంటలయినా మంచం దిగలేదు.

"రాజీవా...రాజీవా"

"ఒద్దుసార్...నేను" బయటనుంచున్న పెద్దమనిషి మొదలుపెట్టాడు.

"లేపుతానుండు. ముసలాణ్ణి నేనే పొద్దున్న ఆరుగంటలకల్లా లేచి కూర్చుంటాను. కుర్రాళ్ళు తొమ్మిది గంటలైనా ఇలా ముసుగుతన్ని పడుకోడం ఏమిటి? ఈ బద్ధకాలు నాకు నచ్చవు" అంటూ రావుగారుఇంకోసారి 'రాజీవా' అన్నారు.

అపుడు రావుగారి ధర్మపత్ని రాజమ్మగారు ప్రత్యక్షమయ్యారు. చూసినవాళ్ళకి భక్తి, గౌరవం పుట్టించేలాంటి వ్యక్తిత్వం రాజమ్మగారిది. పొట్టి పొడుగూ కాని విగ్రహం, కొంచెం స్థూలశరీరం, తేటగా వున్న శరీరవర్ణం, పసిపిల్లల మొహంలా గుండ్రంగా ముగ్ధత్వం వుట్టిపడే మొహం. పసుపు రాసుకోడంవల్ల పచ్చగా మెరిసే కపోలాలు, నుదుట విశాలమైన కుంకుమ బింబం, తలనిండా గౌరీపూజ చేసుకుని ధరించిన పూలు, ఒంటినిండా కప్పుకున్న కొంగు, రెండు చేతులకీ గలగల్లాడుతూ గాజులు, కాళ్ళకి అందెలు, బంగారుపట్టెడ ఇవన్నీ ధరించిన రాజమ్మ చూసినవాళ్ళ కళ్ళకి పూర్ణ చంద్రబింబంలా భాసిస్తుంది.

"ఏవండీ పిలిచారా?"

ఆమె చేతిలో లేత బీన్స్ నిండిన బుట్ట వుంది.

"ఏం చేస్తున్నావు?"

"బీన్స్ పీచులు తీస్తున్నాను"

"నీ పేరేమిటి?"




రావుగారి ప్రశ్న విని ఆశ్చర్యంగా తలెత్తి ఆయన మొహంలోకి చూసిందామె.

అరవయ్యేళ్ళకి అరులు మరులు అంటారుగాని రావుగార్కి అరవైకూడా దాటి చాలాకాలమే అయింది. ఆవిడ కొంచెం ఆదుర్దాగా 'ఏమన్నారు?' అంది.

"నీ పేరేమిటి అన్నాను"

"ఇవేం కుర్రచేష్టలూ అంట? కట్టుకున్న పెళ్ళాన్నే పేరు అడుగుతారే!?"

"అడక్కూడదా?"

"ఒద్దన్నదెవరు, అడగండి! కాని నాకు లోపల మోపెడుపనివుంది"

"సార్..." బయట ఆ మనిషి మళ్ళీ పిలవటంతో రావుగారు ఈ లోకంలో కొచ్చారు.

"నువ్వింకా ఇక్కడే వున్నావా? నేను మర్చేపోయాను" అని భార్యకేసి తిరిగి "నేను పిల్చింది రాజీవా అని నువ్వు రాజీవుడివి కాదుకదా!" అన్నారు.

"బాగుంది, వాడింకా నిద్రపోతున్నాడు పాపం. వాడినెందుకు లేపడం? రాత్రి పన్నెండు గంటలదాకా పాఠాలు చెప్పి అలసిపోయొచ్చాడు."

రావుగారికిక ఓపిక చచ్చిపోయింది.

"ఎవరో వాడిని వెతుక్కుంటూ వచ్చారు. లేకపోతే నీకొడుకుతో నాకేం పని?" అన్నారు.

రాజమ్మ వీధివాకిలివేపు చూసివెళ్ళి "ఎవరు బాబూ?" అంటూ గేటుతీశారు.

రెండు నిమిషాల్లో ఆ వ్యక్తి లోపలికొచ్చి వరండా కుడివేపు మూలకివెళ్ళాడు.

"ఎవరతను? అద్దెమెసవాళ్ళకీతలుపు" అనే లోపున రాజమ్మ అతి శాంతంగా...

"అతను మీటర్‌రీడింగ్ చూడ్డానికొచ్చాడు" అని గంభీర స్వరంతో చెప్పి లోపలికెళ్ళిపోయారు.

ఇన్ని మాటలూ దండగయిపోయాయి, పైగా భార్య ఎదురుగా ఓటమి. రావుగారి కోపం మీటర్ వాడిమీదకి మళ్ళింది.

"ఏవయ్యా మీటర్‌రీడింగ్ చూడడానికొచ్చానని ముందే చెప్పలేవూ?" అన్నారు చిరాగ్గా.

"మీరు నాకు మాట్లాడ్డానికి అవకాశమిస్తే కదా సార్!"

తన పరిస్థితి ఇరుకున పడేలా వుందనుకుని లోపలికెళ్ళి మళ్ళీ పేపర్ తీసుకున్నారు. కాని పేపర్ పఠనం సుఖంగా సాగలేదు. ఆ మీటర్‌వాడి ఎదురుగా భార్య చేతిలో ఓడిపోవడం చాలా అవమానకరంగా అనిపించింది. పేపర్ కిందపడేసి ఇంట్లోకెళ్ళారు. వంటగదిలో కొబ్బరి కోరుతున్న కమల ఒక క్షణం పని ఆపేసింది. ఆయన అప్పుడప్పుడు ఇలా హఠాత్తుగా వంటింట్లోకి దాడిచెయ్యడం కోడళ్ళకి ఇబ్బందిగా ఉంటుంది. మామగారు ఇంటికి పెద్ద. ఇంట్లో ఎక్కడైనా అడుగుపెట్టే అధికారం ఆయనకు వుంటుంది నిజమే. కాని పెద్దవాళ్ళు వచ్చినపుడల్లా చేసేచేసే పని మానేసి లేచి నుంచుని ఎంతసేపైనా వుండిపోడం అంటే కష్టంకదా! ఒక్కోసారి మావగారు అత్తగారితో గంటలకొద్దీ ఏవన్నా చర్చిస్తూ వంటగదిలోనే నుంచునేవారు. ఆయనవున్నంతసేపు రుబ్బడమో, వేపడమో ఆపేసి, అలాగే నుంచోడమంటే చాలా కష్టంగా వుండేది.

రావుగారిది ఉమ్మడి సంసారం.

పెద్దవాడు కేశవ. అతడికి వకీలవడం బొత్తిగా ఇష్టంలేదు. రావుగారు వకీలు వృత్తిలోనే పేరు, డబ్బూ బాగాగడించారు. మీరు పేరు సంపాదించారు నిజమే. కాని ఇప్పుడు పోటీ ఎక్కువ. వీధికి పదిమంది

లాయర్లు తయారయ్యారు. నాకీవృత్తి ఇష్టంలేదు" అని తండ్రితో వాదించాడు అప్పట్లో.

"పదివేల రూపాయల విలువచేసే లా పుస్తకాలు పడున్నాయి ఇంట్లో. అన్నీ దండగయిపోతాయి. నా పార్టీలే బోలెడు మందున్నారు! నేనున్నాను గదా, ఏ విధంగానూ నీ ప్రాక్టీసు తగ్గదు" అని రావుగారు కొడుక్కి ధైర్యం చెప్పారు.

కేశవ అయిష్టంగానే వకీలువృత్తిని చేపట్టాడు, ఆఫీసుకొచ్చే పార్టీలందరూ పెద్దరావుగార్ని అడుగుతూనే వచ్చేవారు. అప్పుడీ కేశవరావుకి తిక్కరేగిపోయేది. కానిపార్టీల్లో చిన్నలాయరూ ఫరవాలేదని పేరు సంపాదించాక కేశవుడికోసం వచ్చే పార్టీలూ ఎక్కువే అయ్యారు.

వృత్తికి సంబంధించినంతవరకూ రావుగారి జ్ఞాపకశక్తి అమోఘం. మిగతా విషయాల్లో మాత్రం మతిమరుపువిపరీతం.

రావుగారికి తోటపనంటే ఇష్టం. ఓసారి ఆయన తోటలో ఉండగా ఒక పార్టీ వచ్చాడు. అవీ ఇవీ మాట్లాడుతుంటే ఏదో సందర్భంపడి అతడడిగాడు.

"అయ్యా! తమరికి పిల్లలెందరు?" అని.

రావుగారు తడబడ్డారు. తనకి పిల్లలు వున్న సంగతి ఆయనకి తెలుసుగాని, ఎంత మంది? పార్టీ ఎదురుగా పిల్లలెందరన్న విషయంలో తన అజ్ఞానాన్ని బయటపెట్టు కుంటే ఎలా?

రావుగారు ఒక్కక్షణంకూడా ఆలస్యం చెయ్యకుండా చటుక్కున 'ఎనిమిది' అనేశారు. అక్కడికి కొంచెం దూరంలో కొత్తిమీర కోసుకుంటున్న పెద్దకోడలు సుశీల ఆశ్చర్యపోయి మామగార్ని చూసింది. కోసుకొస్తున్న నవ్వుని బల వంతాన అదిమిపట్టి మామగారి మాటల్ని వినసాగింది.

ఆ పార్టీ ఆయన్ని వదిలిపెట్టలేదు. "ఆడపిల్లలెందరు? మగపిల్లలెందరు?" అని అడిగాడు.

"ఏడుగురు మగపిల్లలు, ఒక్క ఆడ పిల్ల"

అబ్బ! ఆడపిల్ల ఒక్కతేనన్న విషయం గుర్తుంది నయమే. అనుకుంది కోడలు.

"మగపిల్లలకి పేర్లేం పెట్టారు?"

"మాధవ, కేశవ, సుందరం, శివం, అనంతం..."

మిగతాపేర్లు రావుగారికి తోచలేదు.

సుశీల ఇక నవ్వాపుకోలేక లోపలికి పరుగుపెట్టింది. అనంతం ఆమె కొడుకు పేరు మరి! రావుగారేమో మనవడినీ తమ పిల్లల లిస్టులో చేర్చేశారు.

"మంచిది స్వామీ, పిల్లలు ఎవరెవరు ఏమేం చేస్తున్నారు?"

రావుగారు ఇరుకున పడ్డారు.

"పెద్దవాడు డాక్టరు, ఒకడు లాయరు, ఒకడు ఇంజనీరు, ఒకడు మేష్టరు, ఒకడు చదువుకుంటున్నాడు, ఇద్దరు ఏ పనీ లేకుండా గాడిదల్లా తిరుగుతున్నారు."

"సంతోషం బాబూ, మీ సంసారాన్ని చూస్తే చాలా ఆనందంగా వుంది" అన్నాడు మనస్ఫూర్తిగా.

"ఏమి సంతోషమో మునియప్పా, ఆరుగురు మగపిల్లల్ని చదివించి పైకి తేవడం అంటే సామాన్యమా?

"ఆరుకాదు, ఏడుగురు" అని దిద్దాడు మునియప్ప.

రావుగారు కళ్ళెర్రజేసి "నాకెంత మంది పిల్లలో నువ్వు చెప్పాలా?" అన్నారు.

"పోనీలెండయ్యా, పెద్దాయన డాక్టరు ఎక్కడున్నారు"

రావుగారీసారి నిజంగా చిక్కుల్లో పడ్డారు. అన్నట్టు పెద్దవాడు లాయరా? డాక్టరా? అందరికంటే చిన్నది కూతురే నన్న సంగతి ఖచ్చితంగా తెలుసు. మిగతావాళ్ళ గురించి ఏమి అడిగినా తడబాటు తప్పదు.

"అది సరేగాని మునియప్పా ఏ ఆధారమూ లేకుండా మాత్రం అప్పు ఎవరికీ ఇవ్వకు. 'ఆన్ డిమాండ్' పత్రం రాయించుకున్నా ఆధారం వుంచుకోడం ఎప్పుడూ మంచిది" అంటూ మెల్లగా మాట మార్చారు.

మరి కాసేపట్లో రావుగారు మునియప్పని పంపేసి చేతుల్ని కడుక్కుందామని నీళ్ళ గదిలోకి వెళ్ళారు.

సంసారం మొత్తం అక్కడ కొలువు తీరి వుండేసరికి ఆయన స్తంభించి పోయారు. ఆ కుటుంబ సభ్యులు కూడా రావుగారు వస్తారని బొత్తిగా అనుకో లేదు.

ఒక క్షణం రావుగారి నోటమాట రాలేదు. కుటుంబ సభ్యులు ఆయన్నీ, ఆయన వారినీ చూస్తూ నుంచుండి పోయారు. కోడళ్ల కొంగులు అడ్డు పెట్టుకుని ముసిముసిగా నవ్వు ఆపుకోలేక చస్తున్నారు.

సందర్భం వూహించడం ఆ లాయరు గారికేం కష్టంకాదు. తనూ మునియప్ప నీళ్ళగదికి దగ్గర్లోనే నుంచుని మాట్లాడుకున్నారు. ఆ మాటలు వినడానికే వీళ్ళంతా అక్కడ చేరారని ఆయన గ్రహించారు.

ఆయన మొహం కోపంతో ఎర్రబడింది. తమ మాటల్ని వాళ్ళిలా పొంచి విన్నారని అర్థమైంది.

"ఇదేమిటి? అంతా ఇక్కడ చేరారు! ఏం చేస్తున్నారిక్కడ?" కోపంగా అడిగారాయన.

కోడళ్ళు అక్కడినుంచి మెల్లగా జారుకుందామా అంటే రావుగారు దారికి అడ్డంగా నుంచున్నారాయె.

కోడళ్ళు ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. తప్పు అసలు సుశీలది కదా! ఆవిడ అకస్మాత్తుగా 'హా!' అంది.

"ఏమయిందేమయింది?" రావుగారు కంగారు పడ్డారు.

"ఏంలేదు, కాలికేదో పాకి నట్టయింది"

రావుగారు కంగారుగా "రాజీవా... మాధవా..." అని కొడుకుల పేర్లు పిలుస్తూ బయటకి గబగబ తప్పుకున్నారు.

ఆ తర్వాతగారేమనుకుంటారోనన్న మొహమాటం కూడా లేకుండా కోడళ్ళు పడి పడి నవ్వసాగారు. ఈ హడావుడిలో ఎవరి దారినవాళ్లు సర్దుకున్నారు.

రాజీవ, అనంతం, మునియప్ప కట్టెపేళ్ల పుచ్చుకుని నీళ్ళ గదిలోకి ప్రవేశించారు. రావుగారు అందరి వెనుకగా నుంచుని హడావుడి మొదలెట్టారు.

"ఆగండర్రా, అది పామో, తేలో చూసుకోకుండా మూరకండి. చెప్పులేసుకుని వెళ్ళండి"

రావుగారి గొడవనెవరూ పట్టించుకోలేదు. అక్కడెక్కడా లేని పాముని, తేలుని, వెతికివెతికి విఫలురయ్యారువాళ్ళు.

"ఇక్కడేం లేదు తాతా" అన్నాడు అనంతుడు. అయినా రావుగారికి నమ్మకం లేదు.

ఈ సంఘటన జరిగినరాత్రి రావుగారు

భార్యని నిలదీశారు.

"సాయంత్రం మీరంతా నీళ్ళ గదిలో ఎందుకు చేరారు"

"పాలుతాగి మాట్లాడకుండా పడుకోండి.నాకూ నిద్రొస్తోంది" అన్నారావిడ.

"రానీలే, అసలు సంగతి చెప్పు"

"సిగ్గుచేటు, మీకు ఎంతమంది పిల్లలు చెప్పండి" రాజమ్మ ప్రశ్నించింది.

భార్యదగ్గర భయమేముంది?

"ఎనిమిది కావచ్చు"

"సరే, ఎవరెవరు చెప్పండి?"

"మాధవ, కేశవ ...." అంటూ మొదలెట్టబోయారు రావుగారు. రాజమ్మగారు అడ్డుపడ్డారు.

"కేశవుడయ్యాక, మాధవుడు"

"ఆగు మొదట పిల్లలపేర్లన్నీ చెప్తాను. తరువాత ఎవరి తరువాతెవరు పుట్టారో చూద్దాం" అంటూ రావుగారు వేళ్ళు మడిచి లెక్క పెట్టసాగారు.

"కేశవ, మాధవ, రాజీవ, సుందరం, శివం, అనంతం...."

రాజమ్మ ఉబికివస్తున్న నవ్వునాపుకుంటూ,

"మిగతా ఇద్దరిపేర్లు?" అనడిగారు.

"మాలతి..." కూతురుపేరు ఆయన మర్చిపోలేదు.

"సరే, ఇంకొకడిది?"

రావుగారు ఆలోచించి తల బద్దలు కొట్టుకున్నారు. గబుక్కున ఏదో మెరిసినట్టయి 'మాధవ' అన్నారు.

"ఎన్నిసార్లు చెబుతారు మాధవుడి పేరు?"

"ఓడిపోయాలే" అన్నారాయన.

"మీ వరసచూస్తుంటే ఉరేసుకోవాలనిపిస్తోంది"

"అదేమిటి రాజీ, ఏమయిందిప్పుడు?"

"కడుపున పుట్టిన పిల్లలెందరో తెలీదు మీకు. అనంతుడు మీ కొడుకా?"

"కాదా?" రావుగారికి అంతా గజిబిజిగా వుంది.

"కేశవుడి కొడుకు కదా" రాజమ్మగారు కోపంగా అన్నారు.

"కొడుకేమిటి, మనవడేమిటి అంతా ఒకటే" అని సర్దుకోవాలనిచూశారాయన.

"తెలివి తేటలు ఒలకబొయ్యకండి. అదలా వుంచి ఎనిమిదో పేరు చెప్పండి" రాజమ్మగారు వదలేదు.

రావుగారు బ్రహ్మ ప్రయత్నం చేసి చివరికి ఓడిపోయానని ఒప్పుకున్నారు.

"సర్లే, నువ్వు చెప్పు వాడిపేరు"

"ఉంటేకదా చెప్పడానికి"

రావుగారు మరోకొడుకుని పెంచిపెద్ద చేసే భారం తప్పింది కదా అని నిట్టూర్చారు.

"సరే, మీకెందరు మగపిల్లలు?"

"ఆరు"

"ఆరుకాదు, అయిదు"

"అదే, మాలతినీ కలిపి ఆరుచెప్పాను"

"మాలతి ఆడపిల్లకదా, మగ పిల్లల పేర్లు..."

"మాధవ" అంటూ మొదలెట్టారు.

"కేశవ, మాధవ, రాజీవ, సుందరం, శివం" అని పిల్లలపేర్లు పరిచయం చేశారు రాజమ్మగారు.

"అయ్యో అనంతుడి పేరు మర్చిపోయావుకదే"

రాజమ్మగారు కుప్పకూలారు "ఇక పడుకోండి నాకుకడుపులోతిప్పుతోంది."

"సరే, మందేమన్నా వేసుకుందువుగానీ" అని "శివూ మీ అమ్మకి కడుపులో తిప్పుతోందిట మందేమన్నాచూడు బాబు" అంటూ కేకవేశాడు.



"మాధవుడండీ డాక్టరు" అన్నారు నీరసంగా రాజమ్మగారు.

మర్నాడావిడకి నిజంగానే జ్వరం వచ్చింది. ఆవిడ ఎంతసేపటికీ పక్కమీంచి లేవకపోయేసరికి ఆయనకి బెంగమొదలైంది.

"ఏమైంది రాజీ...

"జ్వరం వచ్చినట్టుందండి"

"లేవద్దులే పడుకో.. కాఫీ తెచ్చిస్తాను" అంటూ లేచారాయన.

"మీకు దండం పెడతాను. వంటింటి జోలికెళ్ళకండి. కోడళ్ళు అన్నీ చూసుకుంటారు"

అయినా రావుగారు వంటింట్లో దూరారు.

'ఇది కోడళ్ళని నెత్తికెక్కించుకుంది. ఆరు గంటలయినా ఒకళ్ళూ లేవలేదు' అనుకుంటూ చుట్టూ చూశారు. కుంపటి బయటకి లాగి బొగ్గుల డబ్బా వెతికారు. డబ్బావున్నా అందులో బొగ్గుల్లేవు.

"బొగ్గులెక్కడుంటాయే రాజీ"

"నీళ్ళ గదిలో గోనెసంచిలో"

ఆయన బొగ్గుల్ని డబ్బాలోవేసి తెచ్చి ఒళ్ళంతా మసి చేసుకున్నారు.

"కుంపటెలా వెలిగించాలే రాజీ?" అంటూ మళ్ళీ వచ్చారు.

"పిడకమీద కొంచెం కిరసనాయిలు పోసి వెలిగించి కుంపట్లో పెట్టండి"

మొత్తానికి కుంపటి వెలిగించి కాఫీకి నీళ్ళు పెట్టారు.

"కాఫీ డికాషన్ పడబోసే గుడ్డ ఎక్కడుందే రాజీ" అంటూ గదిలో అడుగు పెట్టిన రావుగారు కొయ్యబారి నుంచుండి పోయారు.

రాజమ్మగారు కూర్చుని వేడివేడి పొగలు గక్కే కాఫీని హాయిగా తాగుతున్నారు. రాజమ్మ పక్కన ఇంకో గ్లాసులో కాఫీ పట్టుకుని నుంచుంది కమల.

రావుగారు వెర్రినవ్వొకటి నవ్వారు.

కమల తలవంచుకుని పక్కనే వున్న స్టూలుమీద కాఫీ పెట్టేసి వెళ్ళిపోయింది.

రావుగారు కాఫీ గ్లాసుని చేతిలోకి తీసుకుని "ఎవరు కలిపారు కాఫీ?" అనడిగారు.

"కమల"

"ఎక్కడ కాచింది?"

"వాళ్ళ గదిలో"

"ఎలా?"

"అందరూ ఎలా చేస్తారో అలాగే"

"కాదు...పొయ్యెక్కడిదీ అంట?"

"మాధవుడి సిరెంజిలూ అవీ ఉడికించడానికి గదిలోనే ఒక హీటర్ పెట్టుకున్నాడు. మీ బాధ చూసి కమల హీటర్ మీద కాఫీ కలుపుకొచ్చింది"

"మరి, గదిలో మాధవుడూ, వాడి పెళ్ళాం నిద్రపోవడం లేదా? అయినా ఈ కమల వాళ్ళగదిలోకి ఎలా వెళ్ళింది? వెళ్ళి కాఫీ ఎలా కలుపు కొచ్చిందేః"

"మాధవుడి భార్యే కమలేనన్న సంగతి మీరెలా మర్చిపోయారు" అని రాజమ్మ వెనక్కి వాలింది.

అంతలో మాధవుడొచ్చాడు. అతడి చారల లాల్చీ, పైజామా చూసి ఆయన మొహం చిట్లించుకున్నారు.

''అమ్మకి జ్వరంట కదా'' అని అడిగాడు రావుగార్ని.

''ఊఁ''

''కమల చెప్పింది'' అంటూనే మాధవుడు తల్లి నుదుటి మీద చెయ్యివేసి "ఇప్పుడు జ్వరమేమీ లేదు" అన్నాడు.

''నీకేం తెలుస్తుందిరా. థర్మామీటర్ పెట్టి చూడు''

''అక్కర్లేదు నాన్నా! కొంచెం విశ్రాంతి తీసుకుంటే చాలు'' అన్నాడు మాధవుడు.

తెల్లారే లోపున అమ్మకి జ్వరమన్న సంగతి ఇంటిల్లిపాదికీ తెలిసిపోయింది. కేశవుడు, మాధవ, రాజీవ, శివుడు, మాలతి అందరూ అక్కడ చేరారు. కాఫీ సంతర్పణ అక్కడే పూర్తయింది. అంతా ఆవిడ యోగక్షేమాలు విచారించి వాళ్ళ వాళ్ళ పనులకి వెళ్ళిపోయారు.

రావుగారికి చిరాకేసింది. తనకి ఒంట్లో బాగోకపోతే ఒక్కళ్ళకీ పట్టదు. "ఏమిటీ ఎవరికి అనారోగ్యం? నాన్నగారికా? సరేలే" అని ఎవరిమానాన వాళ్ళు పోతారు తనంటే ఎవరికీ లెక్కలేదు అని ఆయన అలిగేవారు. ఆయనకి భయంకరరోగంలా కనిపించే 'జలుబు'ని పట్టుకుని మాధవుడు "జలుబేకదా" అని నిర్లక్ష్యంగా అనేస్తే ఆయనకి మహాబాధగా వుంటుంది.

రావుగారిది వజ్రకాయం! ఎలాంటి రోగాన్నయినా ఆమడదూరంలో నిలబెట్టేసేది. వందేళ్ళు తపస్సు చేసినా అలాంటి దృఢ శరీరాన్ని వరంగా పొందడం కష్టమే. చిన్నప్పట్నుంచీ ఆయనంతే. ఫ్లూ వచ్చి




ఇంట్లో వాళ్ళంతా పడుకున్నా ఆయన్ని మాత్రం ముట్టుకుందుకు భయపడేది.

అలాంటి ఆయన వృద్ధులయాక ఆరోగ్యం గురించి పూరికే ఆందోళన పడేవారు. ఏమాత్రం నలతగా అన్పించినా తనకేదో జబ్బు దాపరించిందని కంగారు పడి కొడుకుచేత పరీక్ష చేయించుకునేవారు. అయితే మాధవుడు తండ్రిని పరీక్షించి, నాలుగేళ్ళ పిల్లలుకూడా కళ్ళజోళ్లు పెట్టుకొంటున్న ఈరోజుల్లో, ముసలితనం వల్ల వచ్చే బాధలకూడా ఇంత బెంగెట్టుకున్నారే. ముసలితనం జబ్బు కాదండీ, దానికి మందేమీ వుండదు. బాల్యం, యవ్వనం, వార్థక్యం ఇవన్నీ మనిషిజీవిత దశలు. ఏదీ జబ్బుకాదు." అనేవాడుతప్ప మందులు ఇచ్చేవాడు కాదు. దాంతో రావుగారు కొడుకు దగ్గర మందు పుచ్చుకోనని భీష్మ ప్రతిజ్ఞ చేశారు.తనరోగాల్ని నిర్లక్ష్యం చేశాడంటే వాడికెంత పొగరుండాలి?

మాధవుడికీ ఇది మంచిదేననిపించింది. ఉన్నవీ లేనివీ అన్ని రోగాల్నీ వర్ణించి వేళాపాళా లేకుండా మందులకోసం పీడించేవారు. రోజుకో రోగం, ఘడియకో మందు.

"ఆకలిగా లేదు" అదీ ఒక జబ్బే.

"భోజనానికి సరిగ్గా అరగంట ముందు కారం పెట్టిన వేరుసెనగ్గింజలు అంటే ఆకలెలా అవుతుంది?" అనేవాడు మాధవుడు

"ఆకలి పుట్టడానికి మందిమ్మ"ని హింసించేవారు. మాధవుడేవో రంగునీళ్ళిచ్చేవాడు. అది తాగి మరో పావుగంటకి ఆకలేస్తోందని భోజనానికి బయల్దేరేవారు.

ఓసారి పేషెంటెవరికో సీరియస్‌గా వుందని కబురొస్తే మాధవుడు క్లినిక్ నుంచి తిన్నగా పేషెంట్ ఇంటికి బయల్దేరాడు.

అంతలో అనంతుడు ఒగరుస్తూ సైకిల్ మీద వచ్చాడు.

"ఏరా అనంతూ"

"వెంటనేరమ్మని తాతకబురుచేశారు" అని చెప్పి అనంతుడు వెళ్ళిపోయాడు. మాధవుడి మనసు ఊగిసలాడింది. చివరికి తండ్రిమీద ప్రేమ జయించింది.

ఇంట్లో రావుగారు హాయిగా పడక్కుర్చీలో పడుకున్నారు. ఆయనకేదో ఒంట్లో బాగోక మూలుగుతూ మంచంలోపడుకుని వుండుంటారని వూహించిన మాధవుడి అంచనా తప్పయింది.

మాధవుడు కనుబొమలు ముడివేసి "ఏంటి నాన్నగారూ?" అడిగాడు.

"కొంచెం చలిచలిగా అనిపించింది" అని ఆయన చెప్పేలోపున మాధవుడూ చరచర వెళ్ళిపోయాడు.

రాత్రి ఇంట్లో మాధవుడురగడచేశాడు. "నేను వెళ్ళడం ఒక్కడుగు లేటయ్యుంటే పేషెంట్ చచ్చిపోయుండేవాడు. మీకు రోగం అంటే ఒక ఆట. అతనికి ప్రాణ సంకటం. ఇకనుంచి నేను క్లినిక్‌లో వుండగా ఎవరూ నన్ను పిలవకూడదు. పిల్చినా నేను రాను" అనిచెప్పేశాడు.

తండ్రి తన దగ్గిర మందు తీసుకోనని శపథం చేసినట్టుతెలిశాక హాయిగా నిట్టూర్చాడు. ఇన్నాళ్ళు ఆయన కన్నుగప్పి తిరిగేవాడు, ఇప్పుడు ధైర్యంగా ఆయన ముందు తిరగసాగాడు.

కాని గుర్రాన్ని చూస్తే కాలునొప్పి అన్నట్టుగా డాక్టర్‌ని చూసేసరికి ఆయనకి రోగాలన్నీ గుర్తొస్తాయి.

మాధవుడు రగడ చేసిన మర్నాడు రావుగారు పెరట్లో వున్న కోడల్ని చూసి ఆమె ఎదురుగా ఒక గంటసేపు తిట్టిపోశారు.



"అటకెక్కే దాకానే కదా నిచ్చెనకావల్సింది. అటకెక్కి నిచ్చెన్నితన్నే సేరకం ఇది. నేను రోగంతో మూలిగి చస్తున్నాను వీడికేమో నాకంటే ఆ పేషంటే ఎక్కువయ్యాడు. నేనే చదివించకపోతే వీడేం డాక్టరయ్యేవాడు మట్టిగడ్డ." ఇలా ఆపకుండా తిట్టసాగారు.

కోడలు మామగారి తిట్లన్నింటినీ చిలవలు పలవలుగా చేసి మొగుడికి చెప్పాలన్నదే ఆయన కోరిక.

"చూడమ్మా, మీఆయనకి కొవ్వెక్కువయింది. తనే మహా డాక్టర్నని విర్రవీగుతూ తిరుగుతున్నాడు. నువ్వయినా అతనికి చెప్పు. తండ్రిమాట వినకపోయినా పెళ్లాం మాటయినా వింటాడేమో చూద్దాం.

బదులుగా కోడలు నోటికి చెంగు అడ్డుపెట్టుకుని ముసిముసిగా నవ్వింది. అక్కడే నవ్వుకొంటూ నుంచున్న రాజమ్మ మెల్లగా అంది.

"అది రాజీవ భార్య విమల"

రావుగారి ప్రతాపానికి చన్నీళ్ళు చల్లినట్లయింది. అయినా బింకం సడలనీకుండా

"సరే ఎవరికి తెలుస్తుంది అంతాఒకేలా చీరలు రవికలు తొడుగుతారు. ఒకేలా జడేసుకుంటారు. నాకళ్ళకి అందరాత వాళ్ళు ఒకలాగే కనిపిస్తారు." అన్నారు.

"బాగుందండీ, ఒకేరకం చీరలు కట్టుకున్నా మోహాలొకేలా వుండవుకదా"

"నాకళ్ళు కొంచెం మసగ్గా వున్నాయే. ఆసంగతి నీకొడుక్కి చెబితే బొత్తిగాలక్ష్యపెట్టలేదు. నేను రేపు గుడ్డివాణ్ణయిపోతే వీళ్ళంతా చెయ్యిపట్టుకుని నడిపిస్తారా?" నాకు కళ్ళ సంగతే పెద్ద బెంగైపోయింది.

ఇంకిక్కడ వుంటే బాగుండదనిపించి అత్తగారు, కోడలు ఇద్దరూ లోపలికెళ్ళిపోయారు.

ప్రతిజ్ఞ చేశాక రావుగారు హోమియోపతిని ఆశ్రయించి ఇంగ్లీష్ మందుల్నితిట్టిపొయ్యసాగారు. అదీ మాధవుడింట్లో వుండగా!




రావుగారు భార్యని వెతుక్కుని వంటింట్లోకి వెళ్లారు.

కొబ్బరి కోరుతున్న కమల లేచి నుంచోకపోయినప్పటికీ కూర్చునే వుండాలంటే ఆమెకి ఇబ్బందిగా అనిపించింది. పచ్చడి రుబ్బుతున్న సుశీలా అలాగే అవస్థపడింది.

రాజమ్మగారే ఏదో సందర్భంలో కోడళ్ళకి చెప్పారు.

"ఆయన ఎప్పుడంటే అప్పుడు వంటింట్లోకి నన్ను వెతుక్కుంటూవస్తారు. అప్పుడు మీరు చేసేపని వదిలిపెట్టి నుంచోవద్దు. నిన్న విమల అలాగేనుంచుని మూకుడులో చేస్తున్న వంటని మాడబెట్టేసింది. మీ మానాన మీరు ఇంక దేన్నీ పట్టించుకోకుండా మీ పనులు చేసుకుపొండి."

అందుకే రావుగారొచ్చినా కోడళ్ళు లేచి నుంచోకుండా ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చున్నారు.

"రాజీ,నిన్న రాత్రిమాడాక్టరొచ్చారు"

"సరే, ఏమంటాడాయన?"

"కళ్ళు మసకలుగా వుందంటే మందు

చెప్పారాయన. చేప తలకాయతెచ్చి దాన్ని సన్నికల్లు మీద అరగదీసి కంటికి పట్టించుకుంటే కళ్ళమసకలు తగ్గుతాయట. ఇవన్నీ ఇంగ్లీష్ డాక్టర్లకేం తెలుస్తాయి వాళ్ళ బొంద." అంటూ రావుగారు కమలకేసి చూశారు.

అబ్బో! మాధవుడి భార్య కమల అన్న సంగతి గుర్తుందే! అని రాజమ్మగారికి సంతృప్తి కలిగింది.

కాని చేపతలకాయ అన్న మాట వినగానే ఆమె తుళ్ళిపడింది.

"ఏమన్నారు?" అని నమ్మలేనట్టుగా అడిగింది.

"చేప తల అన్నాను."

"ఏం చేప?"

"నీళ్ళల్లో ఈదే చేప. దాని తలని కత్తిరించి రుద్ది..."

"లక్షణంగా వుంది. బ్రాహ్మణ జన్మ ఎత్తికూడా చేపతలను తిందామనుకుంటే అర్థం ఏమిటి? రామ రామ, నేను ఈ అమంగళాన్ని వినలేను తండ్రీ" అన్నారు సంప్రదాయానికి బద్ధులయిన రాజమ్మ.

"చేప తలకాయ తిననే బాబూ, దాన్ని సన్నికల్లు మీద రుద్ది ఆ అంజనం కళ్ళకి రాసుకుంటే కళ్ళ మసకలు తగ్గుతాయట.

"ఆ పాపిష్టిపని చేసేకంటే కళ్ళు మసగ్గావుంటే నష్టంఏమిటి? ఇప్పుడునాకూ చత్వారముంది. అయితేనేం? ఉంటే వుంది, నేనేమన్నా కుట్లు కుట్టాలా? లేసులల్లాలా? అన్నం వుడికిందా, దొరుకాగిందా అని చూడ్డానికి, ఉప్పు, కారం, చింతపండు సరిగ్గా వెయ్యడానికి చాలినంత కనపడితే సరి. మీరేమన్నా క్షురవాడిననుకుంటున్నారా? ఈ కాలంలో పసిపిల్లలే కళ్ళజోళ్లు పెట్టుకోవల్సొస్తోంది. వాళ్ళకంటే ముసలాళ్ళమయినా మనమే నయం"

"నీ లెక్చర్ నాకక్కర్లేదు. నేను రేపు 'చేపతలకాయ తెప్పించుకుని వైద్యం మొదలెడతాను" రావుగారు పట్టుదలగా అన్నారు.

"చేప తలకాయే తెచ్చుకుంటారో మొసలితోకే తెచ్చుకుంటారో మమ్మల్ని మాత్రం అంజనం చేసిపెట్టమని అడక్కండి" అని ఖచ్చితంగాచెప్పేశారావిడ.

"అక్కర్లేదులే. కోడళ్ళచేత చేయించుకుంటాను" రావుగారు ఓడిపోదల్చుకోలేదు.

"కోడళ్ళెవరూ దాన్ని ముట్టుకోరు. గౌరీపూజచేసే చేతుల్తో చేపని ముట్టుకుంటారా? నేను రేప్పొద్దున్న వాళ్ళ చేత్తో గంగోదకమైనా గొంతులో పోయించుకోవాలా వద్దా?''

రాజమ్మగారు ఎదురు సవాల్ చేశారు.

మర్నాడే రావుగారు చేపతలకాయ కోసం ప్రయత్నం మొదలెట్టారు. కనపడ్డవాళ్ళనల్లా 'చేపతలకాయ సంపాదించగలరా' అని అడిగారు. ఆయన పురాణం విన్నవాళ్ళంతా ఆయనకి మతి సరిగ్గాలేదని అనుకున్నారు. కొందరు ఎదురుగా సానుభూతి చూపించి, వెనకాల నవ్వుకున్నారు.

ఆయన చేప తలకాయకోసం తన తలకాయని అన్నివిధాలాపాడు చేసుకున్నారు. మొత్తానికి పదిహేను రోజుల తరువాత ఆయన విశ్వప్రయత్నంచేసి ఓ చేప తలకాయని ఇంట్లోకి ఘనంగాఆహ్వానించారు. రావుగారి పార్టీ ఒకడు బెస్తవాళ్ళని పట్టుకుని చేపతలకాయొకటి సంపాదించి ఆయనకి కానుకగా ఇచ్చాడు. రావుగారికి నిధి దొరికినట్టు అయింది. అది తెచ్చిన రాత్రే అంజనం తయారుచేసి కళ్లకి పట్టించుకోవాలని నిర్ణయించుకున్నారు.

రావుగారు కుతూహలంగా ఆ చిన్న

కాగితం పొట్లాన్ని విప్పారు. దానిలో పల్చని ఆలిచిప్ప పరిమాణంలో చేప తల కాయవుంది. రావుగారికి చాలా నిరాశ కలిగింది. ఆయనేదో అందమైన, అద్భుత మైన వస్తువుని చూస్తానని ఇన్నాళ్ళూ కలలుగంటే బొత్తిగా అంత చిన్న ఆల్చిప్పముక్కలా వున్న ఆ పదార్థం నిరాశ పుట్టించింది.

అయినా మళ్ళీ ఉత్సాహంతో ఠీవిగా లోపలికి వెళ్ళి 'సానరాయి' కావాలి అన్నారు.

"దాన్ని ముట్టుకున్న చేత్తో వంటింట్లో వేవీ ముట్టుకోకండి. దేవుడికి గంధం అరగదీసే సాన మీకు చేపతలకాయ రుద్దడానికి కావల్సొచ్చిందా నడవంతర తలకి" అని విసుక్కుందావిడ.

మొగుణ్ని చూస్తే దీనికి బొత్తిగా భయభక్తులులేవా! మొదట్నుంచి చొరవగా నెత్తికెక్కనిచ్చిన తప్పు తనదే. పతియే ప్రత్యక్షదైవం అనుకుని సేవ చేసుకోకుండా ఇలా మాటకి మాట పెంచడం పతివ్రతా లక్షణమేనా? అనుకుని,

"ఒద్దులే ... మరో సాన తెప్పించు కుంటాలే" అనేశారు.

"ఒకటి కాకపోతే పది తెప్పించు కోండి. మా సానజోలికి రావద్దు" అని చెప్పేసి రాజమ్మ అక్కణ్నుంచి వెళ్ళి పోయింది.

ఆ మర్నాడు ఓ చిన్న తెల్ల పాలరాతి సాన ఇంట్లోకి అడుగుపెట్టింది. దోసిలి పట్టి స్వీకరించి స్వాగతం పలికారు దానికి.

ఇంట్లోవాళ్ళంతా అక్కడ చేరారు.

గ్లాసులో నీళ్ళు పెట్టుకుని రావుగారు చేపతలని ఆ సానరాతిమీద అరగదీయడం మొదలెట్టారు. వాసనేమీ లేకపోయినా రాజమ్మగారు కొంగుతో ముక్కు మూసుకుని "ఛీ! పాడువాసన" అని మొహం చిట్లించారు.

రావుగారు పట్టుదతూ నేవున్నారు. ఒక్కొక్కరే మెల్లగా అక్కణ్నుంచి లేచి వెళ్ళిపోయారు. అటు రాజమ్మగారు దోసెలు వేసేస్తున్నారు. అందరూ దోసెలు తినడం పూర్తయినా రావుగారి అరగతీత మాత్రం పూర్తికాలేదు. లోపల్నుంచి మెంతిదోసె వాసన ఘుమ ఘుమలాడించేస్తోంది. ఆయననోట్లోంచి నీరూరుతోంది.

అక్కడే తిరుగుతున్న మనవణ్ణడిగారు "ఏం టిఫెన్‌రా"

"మెంతిదోసె" అన్నాడు వాడు.

రావుగారింక ఆపుకోలేక వంటింట్లోకి వెళ్లారు.

"కళ్ళకి అంజనం రాసుకోడం అయిందా?" రాజమ్మ భర్తనడిగారు.

"ఇంకాలేదు. దోసె తినేసి వెళ్తాను."

"అలాగే చెయ్యండి. నూరడానికి జబ్బల్లో బలం కావాలికద. దోసెతింటే కొంచెం ఓపికొస్తుంది" అన్నారు రాజమ్మ గారు.

రాజమ్మగారి పక్కనే పీటేసు కూర్చున్నారు రావుగారు. పెనంమీదనుంచి పలుచగా, లేత ఎరుపురంగులో కాలిన దోసెని లేసి రాజమ్మగారు ప్లేట్లోపెట్టి ఇచ్చారు. కోడలు వెన్న, పచ్చడి వడ్డించింది. రావుగారు ఎన్ని దోసెల్ని లాగించారో ఆయనకే తెలియలేదు.

రాజమ్మగారుదోసెలకి పెట్టింది పేరు. వాళ్ళ సంసారానికి నాలుగుసేర్ల బియ్యాన్ని రుబ్బేది ఆవిడ. పదును, పాళ్ళు ఆవిడకి తెలిసినట్టు మరెవరికీ తెలీదు. ఒకసారి సుశీలమ్మ ఆవిడలాగే పాళ్లు కలపాలని ప్రయత్నించింది. రావు





గారు మొదటిముక్క తిని చూస్తూనే రాజీ చేతి దోసెలాలేదని చెప్పేశారు.

రావుగారు సంతృప్తిగా దోసెలు తిని, గ్లాసెడు కాఫీతాగి తృప్తిగా బయటకొచ్చారు. ఎదురుగా చేపతల, సాన ఆయన్నాహ్వానించాయి. ఆయనకేమో కడుపు భారంగా వుంది. "అనంతూ" అని పిలిచారు మనవణ్ని.

"ఏం తాతా?"

"ఇది కొంచెం అరగదీస్తావా? నాకు చెయ్యి లాగుతోంది"

తాతగారి మాట కాదనలేక అనంతుడు అరగదియ్యడం మొదలెట్టాడు. చివరికి అంజనం వచ్చిందో లేదోగాని అరగ దీస్తున్న ఆ నీళ్ళలాంటి పదార్థాన్ని రావు గారు కళ్ళకి పూసుకున్నారు. మర్నాడు, "ఆ! ఇవాళ కొంచెం కళ్లు బాగా కనిపిస్తు న్నాయి" అని చెప్పుకున్నారందరికీ.

దోసెలు తిన్ననాడు రాత్రి పడక కుర్చీలో వాలారు.

"తాతా భోజనానికి రమ్మంటున్నారు" అన్నాడు చంద్రు.

"ఆకల్లేదురా" అన్నారు రావుగారు.

రెండు నిమిషాల తరువాత రాజమ్మ బయటకి వచ్చినప్పుడు చాపల్యం ఆపుకో లేక భార్యనడిగారు.

"ఏమిటివాళ వంట?"

"భోంచెయ్యనన్నారు కదా"

"ఏం వంటారో కూడా అడక్కూ డదా?"

"నిక్షేపంలా అడగచ్చు. దోసకాయ పచ్చిపులుసు"

రావుగారి నోట్లో నీళ్లూరాయి.

"ఇప్పుడే ఆకల్లేదు. ఇంకో ఘడియ ఆగి భోంచేస్తాను" అన్న రావుగారు మరో ఐదు నిమిషాలకల్లా లేచివెళ్ళి భోంచేసి వచ్చారు.

రాత్రి పడుకుందా మనుకునేవేళకి రావుగారి డాక్టరుగారు దయచేశారు.

రావుగారు తమ రోగాలకి వైద్యం చేయటానికి ప్రత్యేకంగా ఒక డాక్టరుని నియమించుకున్నారు.

"చేప తలకాయ ఎంతవరకు పని చేసింది రావుగారూ?" అంటూ ఆయన వరండాలో కాలుపెట్టారు.

"ఏడు దోసెలు తిని, రెండు గ్లాసుల కాఫీలు తాగేటంత పనిచేసింది" అన్నారు రావుగారు.

ఇద్దరూ నవ్వారు.

"బలే తంటా వచ్చిపడిందిలెండి. నాకు జబ్బులు లాక్కుపోయాయి. ఆఖరికి మా అనంతు కూడా అరగదీశాడు. నా పేరు పెట్టినందుకు వాడే ఎప్పుడయినా నా సహాయానికొచ్చేది."

"చేప తలని అరగదీసి ఆ గంధం వాడండి. రోజూ పొద్దున్నే లేచి కాఫీ కూడా తాక్కుండా ఒక క్యారెట్ తినండి. క్యారెట్ కంటికి చాలా మంచిది."

"అలాగా?"

"ఊఁ. మీకింత పెద్ద పెరడుంది. మీ రూమ్‌దగ్గరగా తులసిమొక్కలు వేయించు కోకూడదూ? తులసి మీదుగా వీచేగాలి ఆరోగ్యానికి చాలా మంచిది"

అంతే, మర్నాడు క్యారెట్ ఇంటికొచ్చే వరకూ కాఫీ ముట్టుకోనని కూర్చున్నారు.

"అయ్యో ఖర్మ! సాయంత్రం బజారు నుంచితెప్పిద్దాం. రేపట్నుంచి మహారాజుగా క్యారెట్ తిని కాఫీ తాగుదురుగాని" అని రాజమ్మ రభస చేశాక రావుగారు విషం తాగినట్టు తాగారు ఆ కాఫీని. మర్నాటి నుంచి క్యారెట్ సేవనం మొదలయింది. ఒక్కోసారి క్యారెట్ దొరుకుతుంది,



ఒక్కోసారి దొరకదు. దొరకని రోజుల్లో నాకంటి గతేంకాను, అని రావుగారు క్యారెట్ ఇంట్లోనే పెంచాలని నిర్ణయించుకున్నారు.

ఇంతవరకూ వాళ్ళ ఇంట్లో తోటమాలి లేడు. వకీలు వృత్తిలోంచి రిటైరయ్యాక ఆయనకి పొద్దుపోవడం పెద్దసమస్య అయి కూర్చుంది. నాలుగు రోజులు పూజ, మంత్రం, తంత్రం అంటూ కాలక్షేపం చేసారు. ఐదవరోజు విసుగెత్తింది. రావుగారి దయ తోటమీదకి ప్రసరించింది.

ఇంత పెద్ద పెరడుంది. నెలకి బోలెడంత డబ్బు కూరలకి ఖర్చు పెడుతున్నాం. మేమే కూరగాయల్ని ఎందుకు పండించకూడదు? అన్న ఆలోచన రావుగారి తలలో ప్రవేశించింది.

రావుగారు గునపం పుచ్చుకుని తవ్వకం మొదలుపెట్టారు. రాజమ్మ, పిల్లలు రావుగార్ని వేడుకున్నారు.

"వద్దండీ, మీకు పెద్ద వయసొచ్చింది. కావాలంటే డబ్బిచ్చి ఎవరిచేతయినా తవ్విద్దాం. మీరు పైపెత్తనం చూసుకోండి" అని.

రావుగారి చెవికి మాటలెక్కలేదు.

"వాడికెందుకు డబ్బు దండగ. చేతికి ఖరద అంటితే నోటికి పెరుగు అందుతుందన్న సామెత వినలేదా? ఇవాళ కష్టపడ్డా రేపు ఫలం దక్కుతుంది" అని ఉపన్యాసమిచ్చి వాళ్ళ నోళ్లు మూయించారు.

రెండు రోజులు గునపం పట్టుకుని ఏకబిగిన నేల తవ్వడంతో ఒక వారం రోజులు పడకెయ్యక తప్పలేదు. రాజమ్మగారికి ఆయన నొప్పులకి కాపడాలు పెట్టడంతో సరిపోయింది.

నాలుగు రోజులు విశ్రాంతి తీసుకుని రావుగారు మళ్ళీతోటపని మొదలుపెట్టారు. ఏడెనిమిది రూపాయల విత్తనాలుతెచ్చి తోటంతా చల్లారు. అందులో క్యారెట్, ఆకు కూరలు ఎక్కువ.

విత్తనాలుచల్లాక రెండురోజులు శ్రద్ధగా నీళ్లు పోశారు. తరువాత క్రమంగా శ్రద్ధ తగ్గింది. పది పన్నెండుగురు పిల్లలు వున్న ఇల్లు. ఎవరోఒకరుగేటుతీసి లోపలికి వచ్చేస్తారు. లేదా బయటకి వెళ్ళిపోతారు. ఆవో, మేకో ఏదో ఒకటి వచ్చి చిగురు పట్టే మొక్కల్నితిని పాడుచేస్తాయి. ఇక ఆయన బాధ చెప్పనలవి కాదు.

ఆరోజునుంచి ఆయనకి గేటుకాపలా ఉద్యోగం అయిపోయింది. పొగరుబోతు పశువుల్ని కాపలా కాయొచ్చుగాని పిచికల్నేంచెయ్యడం? మొలకలొచ్చినఆకు కూర విత్తనాల్ని తిని నాశనం చేశాయవి. పిల్లలు బంతి ఆడి పాదుల్నితొక్కి నాశనం చేశారు.

రావుగారు అగ్నిహోత్రుడయ్యారు.

ఒకనాడు సాయంకాలం ఆయన చేతి కొక కుర్రాడు దొరికాడు. బీన్సు మొక్కల దగ్గర ఆ కుర్రాడేదో తింటూ నుంచున్నాడు. మొక్కల్ని పరిశీలనగా చూస్తున్నాడు. ఈయనేమో వాడు లేతబీన్స్కోసి తింటున్నాడనే నమ్మకంతో పరిగెత్తుకొచ్చారు.

"ఏమిటాతినేది?" అని గర్జించారు.

కుర్రాడు బిక్కచచ్చిపోయి ఏంలేదు అనేశాడు.

"దొంగ,బీన్సు తింటున్నావా?" అని రావుగారు వీపుమీద ఒకటుచ్చుకున్నారు. కుర్రాడు అరవడానికి ఏడవడానికి కూడా భయపడి మౌనంగా బిగుసుకుపోయాడు.

అంతలోపున కరివేపాకుకోసుకుందుకి పెరట్లోకి వచ్చిన రాజమ్మగారు ఈ దృశ్యం చూసి ఒక నిమిషం మతిపోయిన దానిలా నుంచున్నారు. తరువాత తేరుకుని గబగబ వచ్చి కుర్రాణ్ణి రావుగారి బారి నుంచి తప్పించారు.

"మీకేమన్నా మతిపోయిందా? ఏమిటీ అన్యాయం?"

"అన్యాయమేమిటి వాడు బీన్సు పీక్కు తినేస్తుంటే."

"లేదండిబాబూ, నేను వాడికి రవ్వలడ్డు ఇచ్చాను. తింటూ ఇక్కడ నుంచున్నట్టున్నాడు. అది తప్పే"

"నీ మనవడేం చేసినా నీకు ఒప్పే"

"నా మనవడా!"

"నీ వల్లే సతీష్ పాడయిపోతున్నది"

"వాడు సతీష్కాదు మహానుభావా"

అన్నారావిడ మెల్లగా

"ఆఁ!!"

"విమల స్నేహితురాలు జలజ వచ్చింది. ఆ అమ్మాయి కొడుకు వీడు. ఒక్కడికే ఏంతోస్తుందని తోటలోకి వెళ్ళి తిరిగిరమ్మని రవ్వలడ్డు చేతికిచ్చి నేనే పంపించాను"

రావుగారి నోటమాట రాలేదు.

"అన్యాయంగా పరాయి పిల్లాణ్ని

కొట్టారు. బిజి వింటేఏమనుకుంటుంది?" అంటూ ఆవిడ ఆ పిల్లాడి చెయ్యిపట్టుకుని లోపలికి తీసుకెళ్ళింది.

తోటపనికి బాగానే ఖర్చయింది. మట్టి, ఎరువులు, విత్తనాలు, నీళ్ళు దేనికీ లోటు చెయ్యలేదు.

ఆయనకి దొరికిన ఫలం మాత్రం బహుస్వల్పం. ఆ ఫలాన్ని చూసుకుని ఆయన చప్పబడిపోయారు. అప్పట్నుంచి తోటపని విషయంలో తాను శ్రమించడం మానేసి, అంతా మాలికి అప్పచెప్పి తను పైపైన మంచి చెడ్డలు చూసుకోసాగారు. మాలి ఆయనకి కావల్సిన క్యారెట్ పెంచి ఆయన విశ్వాసాన్ని సంపాదించాడు. రావుగారి రూమ్‌చుట్టూ తులసిమొక్కలు పెంచి ఆయన వంటిమీదకు వీచేగాలి తులసి స్పర్శ పొందాకే వచ్చేలా ఏర్పాటు చేశాడు.

రావుగారికి ప్రియమయిన కూరలు, ఆయన ఆరోగ్యంకోసం ఆయనకికావల్సిన వస్తువులు అన్నీ ఏర్పాటు చేస్తూ మాలి రావుగారి అంతరంగ కార్యదర్శి అయిపోయాడు.

రోజూపొద్దున్నే తాజాగాకోసి, నీళ్ళల్లో కడిగిన క్యారెట్‌ని మహాభక్తిగా శబరి రాముడి కర్పించినంత శ్రద్ధగా రావుగారికి అందించేవాడు. రావుగారూ మాలికి ఉదారంగా టిఫిన్, కాఫీ పెట్టించేవారు. రావుగారికి కావల్సిన నశ్యాన్ని ఎప్పటికప్పుడు దుకాణంనుంచి తెచ్చిపెట్టేవాడు.

నశ్యంతోబాటు తాంబూలం దొరికిందంటే రావుగారికి ఎక్కడలేని సంతోషం కలుగుతుంది. కడుపునిండా భోంచేసి ఆయన పడక్కుర్చీలో కూర్చునేవేళకి రాజమ్మగారు తమలపాకులతో నిండిన పళ్ళెం, వక్క, సున్నం, ఆకుల్ని తుడవడానికి శుభ్రమైన చిన్నబట్ట అన్నీ తీసుకొచ్చి ఆయనముందు కూర్చునేవారు.

రాజమ్మ బంగారు రేకుల్లాంటి లేత తమలపాకుల్ని తీసి మెత్తటి బట్ట మీద చక్కగా తుడిచి, మితంగా సున్నం రాసి వక్క చేర్చి రావుగారికిచ్చేవారు. రావుగారు మడిచి ఇచ్చిన ఆకుల్ని ఒక్కొక్కటిగా సేవించేవారు.

"వంటెలా వుందండీ?" రాజమ్మ అడిగేవారు.

"అద్భుతంగా వుంది. ఉల్లిపాయ సాంబారులో కొద్దిగా దాల్చిన చెక్క వేసావు కదా?" రావుగారు అడిగేవారు.

"అవును, ఆకులెన్నయ్యాయి?"

"ఎన్నయితే నీకెందుకు చెప్పు!"

"ఆకు- వక్క నములుతూ కూర్చుంటే మీకింకేధ్యాసా వుండదు. నాకవతల పనుంది... నేవెళ్ళాలి"

"ఇంకో నాలుగాకులు ఇచ్చేసివెళ్ళు" రావుగారు కొసిరేవారు. తాంబూలం వేసుకున్నంత సేపూ ఆయనకి ప్రపంచంతో సంబంధం వుండేది కాదు. ఆయన తాంబూలం సేవించే కార్యక్రమం మొదలైతే పిల్లలకి అల్లరి చెయ్యడానికి కావల్సినంత టైమ్ దొరికిందన్నమాటే.

"తాతయ్య తాంబూలం వేసుకుంటున్నారు పదండర్రా" అని కుర్రాళ్ళు ఇంటి కప్పు ఎగరగొట్టేట్టంతఅల్లరి చేసేవారు.

"మావగారు ఆకు-వక్క ప్రోగ్రాం మొదలెట్టారు రేడియో గట్టిగా ట్యూన్ చెయ్యి" అని విమల కమలకి చెప్పేది.

ముసలాళ్ళందరికి గడబిడ గిట్టనట్లే రావుగారికి కొంచెం చప్పుడయినా గిట్టేది కాదు. రాజమ్మ ఆయనకి ఆకులు మడిచిచ్చేపని అంటే ఏ మాత్రమూ విసు

క్కునే వారుకాదు. రావుగారికి మాత్రం తాంబూలం మీది మమకారం రోజురోజుకీ పెరిగేదేగాని తగ్గేదికాదు. తాంబూలం వేసివేసి ఆయన నోరు బెరడుకట్టి పోయింది. అందువల్ల వంటల్లో ఎంత కారం వేసినా ఒకముద్ద నోట్లో పెట్టుకుని, "కారమేలేదు..చప్పగా వుంది" అని గొడవ చేసేవారు.

నశ్యం వేసుకుని ముక్కు, తాంబూలం వేసుకుని నాలికా సున్నితత్వాన్ని కోల్పోయాయి.

ఆయన్ని దృష్టిలో వుంచుకుని వంట చేస్తే మనవలు ఆ వంట తినలేక పోయేవారు.

ఒక్క ముద్దనోట్లో పెట్టుకోగానే పిల్లలకి ఎక్కిళ్ళు మొదలయ్యేవి. ఈ కారపు శిక్షని తప్పించుకోడానికిపిల్లలంతా అనంతుడి నాయకత్వాన సమావేశం జరిపి ఒక మార్గాన్ని కనిపెట్టారు. మర్నాడు పిల్లలంతా తాతగారి పంక్తిలోనే భోజనానికి కూర్చున్నారు. ఒక ముద్ద తిని పిల్లలంతా "నెయ్యి కావాలి, నెయ్యి" అని అరవడం మొదలెట్టారు.

సుశీలమ్మ నేతిగిన్నె పుచ్చుకుని వచ్చింది.

ఒకటి, రెండు, మూడు, నాలుగు... ఊహుం ... ఎన్ని గరిటల నెయ్యి వడ్డించినా చాలకుండాపోయింది.

వెన్న ఖరీదు మండిపోతుంటే నెయ్యి ఇలా వంపుకోడమా? కుర్రాళ్ళు నెయ్యి వేయించుకునే వరసచూసి రావుగారికిముద్ద గొంతు దిగలేదు. రాత్రికూడా మళ్ళీ అదే దృశ్యం రావుగారి కంటపడింది.

నాలుగైదు రోజులు ఇలా ఆజ్యం ఆహుతయ్యేసరికి రావుగారికి మతి పోయింది. ఇకమీదట వంటల్లో కారాలు బాగా తగ్గించాలని వంటింటి అధికారులికి నివేదించారు.

"మీరేమో ఎంత కారం వేసినా చాలదంటారుగా" అనిఅడిగారు రాజమ్మగారు.

"నేను విడిగా పచ్చిమిరపకాయ ముక్కలు పక్కన పెట్టుకొని నాకు కావల్సిన కారం కలుపుకుని తింటానుగాని, నేతినిలా వంపుకోడం నేను చూడలేను" అని జవాబిచ్చారు రావుగారు.

మర్నాటినుంచీ ఆ ఇంట్లో కారాల బాధ తప్పింది.

తమకేజబ్బూ లేకపోయినా ఒక వైద్యుణ్ణి తన సేవకి నియమించుకుని, భక్తుడు దేవతార్చన పెట్టెని కాపాడుకున్నట్టుగా తన ఆరోగ్యాన్ని, దేహాన్ని కాపాడుకుంటున్న రావుగారి దేహంలోకి ఎక్కడ్నుంచొచ్చి ప్రవేశించిందో డయాబిటిస్ వచ్చి ప్రవేశించింది.

రావుగారి ప్రత్యేక వైద్యుడొచ్చి ఆయనకి డయాబిటిస్ వచ్చిందని చెప్పిన రోజున రావుగారి గుండె బద్దలైంది.

"ఏం చెయ్యడం డాక్టరుగారూ? అయితే ఇంక నాగతి ఏమిటి?" అని రావుగారు దీనంగా అడిగారు.

"నేనున్నాను బెంగపెట్టుకోకండి"అని డాక్టరుగారు రావుగారికి అభయమిచ్చారు.

మర్నాడు పరీక్షచేశాక రావుగారికి ఒక పర్సెంట్ షుగర్ వుందని తెలిసింది.

"ఒక వారం టైమివ్వండి. నేను మందు తయారుచేసి, మీ డయాబిటిస్‌ని మూడు నెలల్లోగా నయం చేస్తాను" అని వైద్యుడు అభయమిచ్చాడు.

రావుగారు చలిజ్వరంవచ్చిన మనిషిలా ముసుగు బిగదన్ని పడుకున్నారు. రాత్రి మాధవుడింటికిరాగానే రాజమ్మగారు అతడికివార్త చెప్పింది.

మాధవుడు తిన్నగా రావుగారి రూమ్‌కి వెళ్ళాడు.

"ఏం నాన్నగారూ, ఎలా వున్నారు?" అని ఆయన్ని పలుకరించాడు. ఆయన కప్పుకున్న ముసుగుని అతి కష్టం మీద తీసి దీనాతి దీనంగా మూలుగుతూ...

"ఇంకా బతికున్నాను నాయనా" అని అన్నారు.

"ఏమిటి సంగతి"

"డయాబిటిస్" అన్నారు.

"అంతేనా?" అన్నాడు మాధవుడు తేలిగ్గా నవ్వుతూ.

రావుగారు నుదురు చిట్లించి కొడుకు వేపు చూశారు.

"పండుటాకులు రాలిపోతుంటే చిగురు టాకులు నవ్వుతాయట" అన్నారు రావుగారు చేదుగా.

"పండుటాకులు మళ్ళీ చిగురించడం మొదలెడితే చిగురుటాకుల గతేమిటి నాన్నగారూ?" అన్నాడు మాధవుడు తమాషాగా.

"నీకంతా హాస్యం"

"హాస్యం కాదు నాన్నగారు. ఇదేం మహజబ్బని మీరు ముసుగు తన్ని పడుకున్నారు? సాధారణంగా నలభై, యాభై యేళ్ళురాగానే మగవాళ్ళకి ఈ కంప్లెయింట్ రానే వస్తుంది. డెభైయేళ్లు వచ్చినా మీకు జబ్బేమీ రాకూడదంటే ఎలా? ఇలా కొండవిరిగి మీదపడ్డట్టు దిగులుగా పడుకోడం బాగుందా అని"

"నాకు రోగం వచ్చిందోచ్! అని నవ్వుతూ తిరగాలా?"

"నవ్వనూవద్దు, ఏడవనూవద్దు. వయసుమళ్ళినా రోగాలు రాకూడదంటే మా డాక్టర్ల జీవనం ఎలా చెప్పండి? ఇరవైయైదేళ్ళకల్లా ఈ రోగం వచ్చిన వాళ్ళని చూపించమంటారా?"

"ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు?"

"ఏమీ చెయ్యొద్దు. మందులు తీసుకోండి, పథ్యం చెయ్యండి. దేవుడిమీద భారంవేసి హాయిగా వుండండి. ఇలాటి వన్నీ అంతలా పట్టించుకుంటే ఎలా? కావాలంటే నేనే మందిస్తాను"

రావుగారు కొడుక్కో నమస్కారం పెట్టి, "నీ మందు నాకేమీ అక్కర్లేదు.. మా డాక్టరున్నాడు... మందిస్తాడు" అన్నారు.

"సరే...మీ ఇష్టం. ఇంత మాత్రానికి ఏదో మునిగి పోయినట్టుగా మంచం ఎక్కడంలో అర్థం లేదు" అనేసి మాధవుడు వెళ్ళిపోయాడు.

రాత్రి రావుగారు రాజమ్మగారి దగ్గర తన దుఃఖాన్ని వెళ్ళబోసుకున్నారు.

"నేనంటే మాధవుడికి బొత్తిగా పడదు. నేను పోతే చాలని కాచుక్కూర్చున్నాడు"

రాజమ్మ రెండు చేతుల్తోనూ చెవులు మూసుకుని చెప్పారు –

"అమంగళం పలక్కండి. వాడు అంత అనరానిమాట ఏమన్నాడు?"

రావుగారు తనకీ, కొడుక్కీ జరిగిన సంభాషణని భార్యకి చెప్పారు.

"ఇంతే కదా? నేనేదో అనుకుని భయపడ్డాను. వాడు చెప్పేది నిజమే. ప్రపంచం మునిగిపోయినట్టు మీరు ఈ మంచం పట్టుకువేళ్ళాడమేమిటి? సామెత వినలేదా? 'పాడగా పాడగా రాగంట, మూలిగీ మూలిగీ రోగంట''' అని ఆవిడ భర్తని సమాధానపరిచారు.

మర్నాటినుంచీ రావుగారు తమ ఇంటికి వచ్చి వెళ్ళే వాళ్ళందరికీ తమ రోగాన్ని వన్నెచిన్నెలు పెట్టి వివరించి

హడావుడి పడ్డారు. పొద్దుట్నుంచీ దయాబిటిస్ చరిత్ర వినివిని ఇంటిల్లిపాదీ విసిగిపోయారు.

మర్నాడు పొద్దున్న రావుగారి స్నేహితుడొకాయన వచ్చారు. రావుగారు ఆయన్తో -

"నా సంగతి తెలిసిందా?'' అని అడిగారు.

"ఏమిటేమిటి?" అని అడిగారాయన గాభరాగా.

"డయాబిటిస్" రావుగారు శత్రువు నెదుర్కొంటున్న వీరయోధుడు సింహనాదం చేసే పద్ధతిలో చెప్పారు.

''అం..తే...నా...?"

"అంత చాలదా? ఈ వయసులో ఇలాంటి రోగాలు వస్తే తట్టుకోవడం ఎలాగయ్యా?"

''ఈ వయసువాళ్ళకే అదొచ్చేది. నువ్వింకా నయం. నీ తల్లిదండ్రులు పుణ్యాత్ములు... ఇలాంటి వజ్రకాయాన్ని కని పోయింది"

''ప్చ్...ఏం వజ్రకాయమో! రేపట్నుంచి వరి అన్నం తినడానికి లేదు. పంచదార, తీపి వస్తువులు అన్నీ వది లెయ్యక తప్పదు. గేదెపాలు, పెరుగు ముట్టకూడదట. ఇదీ ఓ బతుకేనా?"

"డెబ్భైయ్యేళ్ళపాటు ఏకబిగిన తిన్నావు చాలదూ? ఈకాలంవాళ్లు మన ఆయుష్షులో సగం, ఆరోగ్యంలో సగం దక్కినా చాలని కోరుకుంటున్నారు. ఈ వయసులో రామాక్రిష్ణా అనుకోడం మానేసి, ఆరోగ్యం బాగోలేదని, ఇదీ అదీ తినడానికి లేదని బెంగపెట్టుక్కూర్చోడం ఏంబాగు. ఈ వయసులో మనం ఇంకా ఏం బాగుంటాం చెప్పండి?

"ఏమో బాబూ...నీలా నేను సరిపెట్టుకోలేదు"

"సరిపెట్టుకోవాలి. లే ముందు. మంచం వదిలెయ్యి. భగవద్గీత, రామాయణం, భారతం - ఇలాంటి పుస్తకాల్ని పట్టుకో ఇకమీదట మనం ముందరి దారి చూసుకోవాలి"

స్నేహితుడినుంచి సానుభూతి దొరక్కపోవడంతో రావుగారికి కొంచెం చిరాకేసింది.

"ముందరి దారికిప్పట్నుంచీఏర్పాట్లా?" రావుగారు చిరుకోపంతో అడిగారు.

''నువ్వింకా కుర్రాడిననుకుంటున్నావా? నీకూ డెభ్బైయేళ్ళ వయసుంది. ఎప్పుడో పాతికేళ్ళ వయసులో ఉద్యోగం చేసి సంపాదిస్తాడని ఆరేళ్ళ వయసులో అక్షరాభ్యాసం చెయ్యటం లేదూ"

రావుగారికి మిత్రుడి మాటలు బొత్తిగా రుచించలేదు. తను బతికుండటమే మిత్రుడికి కన్నెర్రగావుందని భావించారు. 'ఆరోగ్యంతో తొణికిసలాడే తన దేహంలోకి ఎప్పటికీ వార్థక్యపు ఛాయలు రావని రావుగారి నమ్మకం. అయినా క్రమంగా వార్థక్యపు ఛాయలు వారిలో ప్రవేశించసాగాయి. కానీ, మూడు నెలల పసిపాపడికిదక్కే నిద్ర, పదహారేళ్ళ వయసులో వుండాల్సిన ఆకలి, ఇరవైనాలుగేళ్ళవయసులో బతుకులో ఒనగూడే ఆసక్తి-ఇవన్నీ తనకి ఉండకపోతే అది చాలా అన్యాయమని ఆయనఅభిప్రాయం.

నిజానికి భార్యా పిల్లల బలవంతం మీదనే ఆయన రిటైరయ్యారు. రిటైరయ్యాక పొద్దుపోవడమెలా? ఖాళీ టైములో మనవలకి చదువు చెప్పాలని నిర్ణయించుకొన్నాడు. అది ఎన్నాళ్ళు సాగుతుందో చూద్దామని ఇంట్లోవాళ్ళు కుతూహలంగా గమనించసాగారు.






3

...రావుగారువాకింగ్‌కి బ్రహ్మాండంగా సన్నాహాలు చేశారు. తెల్లటి పంచె గోచీపోసి కట్టారు. దానిమీద తోపురంగు పొడుగు కోటు. కోటు జేబులో గడియారం. దానికి బంగారు గొలుసు అందంగా కనపడేలా ఏర్పాటు. రెండువేళ్ళ వెడల్పున జరీ వున్న తలపాగా...

రావుగారు పొద్దున్నే మనవల్ని పిల్చి కూర్చోపెట్టి "సాయంకాలం మీరు స్కూలునుంచొచ్చాక ఆటలకి వెళ్ళి ఏడు గంటల్లోపున ఇంట్లో వుండాలి. ఇవాల్టి నుంచి మీకు నేను చదువు చెప్తాను" అని ప్రకటించారు.

"సరే...తాతా" పిల్లలంతా ముక్తకంఠంతో తమ అంగీకారాన్ని తెలిపారు.

సాయంత్రం ఏడుగంటలకల్లా పిల్లలు హాల్లో జంబుఖానామీద సిద్ధంగా కూర్చున్నారు. మొదటిరోజు పిల్లలు పాఠం నేర్చుకోవాలన్న ఆసక్తితోనే కూర్చున్నారు.

"ఏక్లాసువాళ్ళు ఎవరెవరో విడివిడిగా కూర్చోండి. ఒకే క్లాసు చదివేవాళ్ళు ఒకేచోటకూర్చోండి" అన్నారు రావుగారు.

కేశవుడి పిల్లలు నలుగురు, రాజీవ పిల్లలు అయిదుగురు, మాధవుడి పిల్లలు ముగ్గురు- అంతా చేరి కుతూహలంగా తాతకేసి చూస్తున్నారు. అనంతుడు కాలేజీ కుర్రాడు కావడంవల్ల రావుగారిచేత పాఠం చెప్పించుకునే పుణ్యం అతనికి దక్కలేదు.

ఒక కుర్రాడికి లెక్కలు చెప్పే ఉద్దేశంతో రావుగారు పలక అందుకున్నారు. కాని ఆయన లెక్కలెలా చెయ్యాలో మర్చిపోయారు. మర్చిపోయిన లెక్కల్ని గుర్తుతెచ్చుకుంటూ ఆ లెక్కల చిక్కుల్ని విడిపించి భిన్నాలతో కుస్తీపట్టే ప్రయత్నం మొదలెట్టారు.

కోట్ల లావాదేవీలని దారికి తేవడంలో ఆయన ఎంత గొప్పవాడయినా ఈ లెక్కలు ఆయనకో పెద్ద తలనొప్పి అయి కూర్చున్నాయి. బలపంతోరాసి, చెరిపి కింద మీదపడ్డాక ఆయనకింక ఓపిక చచ్చిపోయింది.

"ఒరేయ్ శంభూ, నీకేమన్నా బుద్ధుందా? ఇంత చిన్న బలపం పట్టుకు వేళ్ళాడకపోతే పెద్దది తెచ్చుకోరాదు. దీన్ని పట్టుకోడమే కష్టంగా వుంది" అని శంభుమీద విసుక్కున్నారు.

"నేను పట్టుకోగలను తాతయ్యా" అన్నాడు వాడు కీచు గొంతుతో.

"వెళ్ళి కొంచెం పొడుగాటి బలపం తెచ్చుకో అలాగే పలక తుడవడానికి ఒక గుడ్డముక్క నీళ్ళల్లో తడిపి తీసుకురా" అని రావుగారు వాడిని ఆజ్ఞాపించారు.

"నీళ్ళొద్దు తాతా! నేను అలాగే తుడవగలను" అన్నాడు వాడు.

"ఎలాగరా?"

శంభు పలక చేతిలోకి తీసుకుని నోటితో ఆవిరిని దానిమీదకి వూదాడు. పలక మీద పరుచుకున్న ఆవిరిని చేత్తో తుడిచాడు. పలక శుభ్రంగా అయిపోయింది.

"ఛీ ఎడ్డివెధవా! వెళ్ళి తడిగుడ్డతే"

శంభు బిక్కమొహం వేసుకుని లోపలకెళ్ళాడు.

"అమ్మా! నాకొక పెద్ద బలపం, ఒక తడిగుడ్డముక్క కావాలి" అంటూ తల్లి దగ్గరకెళ్ళాడు.

బెండకాయ ముక్కలు తరుగుతున్న



కమల, "పోరా...నాకుచెయ్యి ఖాళీలేదు" అని కసురుకుంది.

"ఇయ్యమ్మా, తాతయ్యతెమ్మన్నారు"

"నిన్న పెద్ద బలపం ఇచ్చాను కదా, ఏమయిందది?"

అదేమయిందో ఎలా చెప్తాడు? నిన్న దాన్ని చిన్నచిన్న ముక్కలుగాచేసి స్నేహితులకి పంచి చింతకాయలు, నెమలి ఈకలు సంపాదించాడు.

"అది విరిగిపోయిందమ్మా"

"గదిలో బీరువాలో వుంది. ఒక బలపం తీసుకో! అంతకంటే ఎక్కువ తీసుకుంటే వూరుకోను" అంది తల్లి. రూమ్‌లోకి పరుగెత్తి ఒక బలపం, తల్లిదొక సిల్క్ రుమాలు తీసుకున్నాడు.

శంభు ఆ రుమాలు తడిపి తీసుకెళ్ళే లోపున టైమ్ వేస్టవకూడదని రావుగారు రెండవక్లాసు పిల్లలకి డిక్టేషన్ మొదలెట్టారు.

"ఒక వూరిలో ఒక రాజు వుండెను. అతడి పేరు ఉత్తానపాదుడు...అయిందిరా"

సతీష్ ఒక...ఊ...రి...లో అంటూ వర్ణక్రమం చెప్పుకుంటూ రాస్తున్నాడు.

KVRao



మంజుల "ఒక ఊరు అయ్యాకేమిటి తాతయ్యా?" అనడిగింది.

"ప్చ్! ఎంతసేపు రాస్తార్రా, ఇంత మెల్లగా రాస్తే అయినట్టే. త్వరగా రాయండి, అతడికి ఇద్దరు భార్యలు"

"తాతా తడిగుడ్డ" అంటూ శంభు వచ్చాడు.

"ఒరేయ్ శంభూ వీళ్ళచేత డిక్టేషన్ రాయించు. ఈలోగా ఈ లెక్క చేస్తాను" అంటూ ఆయన పలకలోకితలదూర్చారు

సతీష్, మంజుల, శంభు, ముగ్గురు తగువులాటదాకా వచ్చారు. నర్సరీ చదువుకునే బాబూ చాపమీదే పడుకుని నిద్రపోయాడు. రావుగారి లెక్క హను మంతుడి తోకలా పెరిగిపోతోంది.

"రేయ్ శంభూ...నా ముక్కుపొడుం తెచ్చిపెట్టరా" అంటూ రావుగారు శంభూని తన రూమ్‌కి తరిమారు. నశ్యం వేసుకుంటే తల చురుగ్గా పనిచేస్తుందని రావుగారి నమ్మకం. ఓ పట్టు పీల్చి మళ్ళీ లెక్క చేతుల్లోకి తీసుకున్నారు.

"భోజనానికి లేవరా?" అని రాజమ్మ పిలిచాకా ఆయనీలోకంలోకి వచ్చారు.

"టైమెంత?''

"తొమ్మిది కొట్టింది"

రావుగారు చుట్టూ చూశారు. చాపమీద పడుకుని నిద్రపోతున్న బాబు తప్పిస్తే ఇంక పిల్లలెవరూ అక్కడ లేరు.

"పిల్లలంతా ఏరి?"

"భోంచేస్తున్నారు పాపం! బాబుగాడి కేమో ఏడుగంటలకల్లా భోంచేసి పడు కోడం అలవాటు. ఈవేళ అన్నం తిన కుండానే పడుకున్నాడు" అంటూ రాజమ్మగారు బాబుని మెల్లగా ముద్దు లాడుతూ లేపడానికి ప్రయత్నించారు.

బాబు కదలను కూడా లేదు.

"విమలా! బాబు నిద్రపోయాడు. ఓ గ్లాసుడు పాలయినా తాగించు" అని రాజమ్మ బాబు తల్లితోచెప్పి, భర్తవేపు తిరిగి!

"రేపట్నుంచి మీరు బాబుని పాఠానికి కూర్చోపెట్టుకోకండి. వాడు ఏడుగంటల కల్లా తిని పడుకుంటాడు. వాడింకా చిన్న పిల్లాడుకదా" అన్నారు.

రావుగారు ఎదురు మాట్లాడే పరిస్థితి కాదు.

"మీరు రండి, వంటచల్లారిపోతోంది" అంటూ రాజమ్మ వంటింటివేపు నడిచారు. రావుగారు వెంట వెళ్ళారు.

రావుగారి బలహీనతేమిటన్నది శంభుకి ఒక్కరోజులో తెలిసిపోయింది. మర్నాడు పాఠానికి కూర్చోగానే శంభు,

"తాతయ్యా, హోంవర్కుకి ఈ లెక్క ఇచ్చారు. నాకు చేతకావటంలేదు. కొంచెం చేసిపెట్టరూ ?" అని రావుగారి చేతికి లెక్కనప్పజెప్పేసి బయటకి పరిగెత్తాడు. రావుగారికి లెక్కలంటే ఎక్కడలేని తలనొప్పేను. రాత్రి రాజమ్మ రావుగార్ని భోజనానికి లేపేవరకూ ఆయనకి లెక్క తెగనేలేదు.

వారం రోజుల్లోపల రావుగారికి ఓపిక నశించిపోయింది. ఆయనకి లెక్కలు రావు. మిగతా విషయాలేమన్నా చెప్దా మంటే వాళ్ళకి ఒకసారిచెప్తే తలకెక్కదు నాలుగుసార్లు చెప్పిందే చెప్పాలంటే ఆయనకి విసుగు.

ఈ విధంగా వారంరోజుల్లోపలే రావు గారి మేష్టర్‌గిరీ పూర్తయింది. బాబుగాడి అదృష్టాన్నిచూసి కుళ్ళుకుంటున్న పిల్ల లందరికీ పంజరంనుంచి విడుదల పొందిన పక్షులకి దొరికినంత ఆనందం దొరికింది.

ఆ తర్వాత రావుగారి దండయాత్ర

వంటింటిమీద జరిగింది. పొద్దుపోని రావుగారు వంటింట్లో ఆడవాళ్ళకి సహాయం చేద్దామని బయలుదేరారు.

"ఏమిటిలా వచ్చారు? కాఫీ కావాలా?" అనడిగారు రాజమ్మ.

"ఏమన్నా కావల్సొస్తేతప్ప వంటింట్లోకి రాకూడదా?"

"మహారాజులాగా రండి" అంటూ రాజమ్మగారు మళ్ళీ తన పనిలో మునిగిపోయారు.

"ఛ! ఛ...బొగ్గులు చేత్తో ముట్టుకుంటారా ఎవరయినా?" అంటూ రావుగారు ఒకడుగు ముందుకేసి "పటకారు ఎక్కడ?" అని వెతికారు. కోడళ్ళు చేసే పని వదిలేసి మామగారి వ్యవహారాన్ని చోద్యంగా చూస్తూ నుంచున్నారు.

కమల పట్టకారుని రావుగారి చేతికి ఇచ్చింది.

రావుగారు బొగ్గుల డబ్బాలోంచి ఒక్కొక్క బొగ్గుతీసి కుంపట్లో నింపసాగారు.

సమానంగా వుండే బొగ్గుల్ని నింపితే కుంపటి బాగా అంటుకుంటుంది అని రావుగారు ఒక్కొక్క బొగ్గుతీసి దాని రంగు, ఆకారం, పరిమాణం అన్నీ పరిశీలనగా చూసి కుంపట్లో వెయ్యసాగారు.

"ఇలా బొగ్గుల్ని ఒక్కొక్కటీ వేస్తూ కూర్చుంటే పిల్లల స్కూలు టైముకి వంటయినట్టే" విసుక్కున్నారు రాజమ్మగారు.

రావుగారు భార్యమాట వినిపించుకోలేదు.

"ఆ కమలమ్మా...ఇప్పుడు కుంపటి వెలిగించు. ఇవాళ వంటేమిటి రాజీ"

"దోసకాయ కోసంబరి, వంకాయ సాంబారు."

"ఏదీ కత్తిపీట కూరగాయలు ఇలా పెట్టండి. నేను కూరలు తరిగి పెడతాను."

రాజమ్మకు్కూడా తమాషాగా వుంది. ఆవిడ కోడలికి సైగచేశారు.

రావుగారు కత్తిపీటముందు కూర్చున్నారు. ఆయన ఆరడుగుల దేహాన్ని మడిచి కత్తిపీటముందు కూర్చోవాలంటే కష్టమే అయింది.

రావుగారు దోసకాయని పట్టుకుని పొడుగ్గా చీల్చారు.

"ముందు దోసకాయకిచేదుతియ్యండి" అన్నారు రాజమ్మగారు అధికారికంగా.

"చేదు? అదెక్కడుంటుంది? అసలెలా తీస్తారు?"

"ఆ చివరా, ఈ చివరా వుంటుంది" రాజమ్మ వేలితో సూచించి,

"ఇలా పొడుగ్గా చీల్చికూర్చుంటేఎలా? ముందు చేదుతియ్యాలి, తరువాత తొక్కతియ్యాలి" అన్నారు.

రాజమ్మ ఇలా అడుగడుక్కీ వ్యాఖ్యానిస్తుంటే రావుగారికి చిర్రెత్తుకొచ్చింది.

"నాకన్నీ తెలుసుగాని నువ్వూరుకో" అన్నారు రావుగారు అరచేతి మందాన చెక్కుతీస్తూ.

"కండంతా తొక్కతోపాటే పోతే ఇంక మనకి మిగిలేదేముంది మన్ను."

రావుగారు మాట్లాడకుండా తమ పని చేసుకుపోసాగారు, "కత్తిపీట పదునుగా లేదు" అని వ్యాఖ్యానించారు.

'కోసంబరి'కి నిమ్మకాయ సైజులో పెద్ద పెద్ద ముక్కల్ని తరిగి "ఒక గిన్నె ఇయ్యి సుశీలమ్మా" అని అడిగి ఒకో దోసకాయనీ పడేసి ముక్కలకిందచేసి గిన్నెలో వేశారు.

"ఇంక...వంకాయలెక్కడ?"

సుశీలమ్మ ఒక గిన్నెలో కొంచెం



నీళ్లు పోసి తెచ్చి రావుగారి ముందు పెట్టింది. ఆయన ఆ నీళ్ళల్లో చెయ్యి ముంచి శుభ్రంగా కడుక్కున్నారు. సుశీలమ్మ ఆ నీళ్ళని పారబోసి కొత్త నీళ్లుతెచ్చి పెట్టింది.

''నీళ్లు పారబోసి పెట్టమ్మా''

''వంకాయ తరిగి గాలికొదిలేస్తే నల్ల బడిపోయి కసరొస్తుంది''

"అలాగా?" రావుగారు ఓటమినొప్పు కున్నారు. కూరలు తరిగాక ....

"సాంబారు చేసే గిన్నెది?''అడిగారు.

విమల చూపించిన గిన్నె చూసి మొహం చిట్లించి, "దీనికి కళాయిలేదు. ఇలాంటి గిన్నెల్లో వంటచేస్తే ఆరోగ్యాలు ఏంకాను?" అన్నారు.

తరువాత వంటింట్లో గిన్నెలన్నీ పరీక్షించి, ఇది బాగోలేదు, దానికి కళాయి లేదు అంటూ వ్యాఖ్యానాలు మొదలు పెట్టారు.

"అన్నం మీద మూత సరిగ్గా పెట్ట లేదు"

"చారుపొడి, చింతపండు, ఉప్పు అన్నీ చేత్తో ముట్టుకుంటారేమిటి?"

''పొయ్యిలో ఇన్నేసి పుల్లలెందుకు కాస్త పొదుపుగా వాడలేరూ?"

ఆరోజు ఆదివారం కావడంవల్ల స్కూలుకి వెళ్ళే హడావుడిలేదు. వంటయ్యాక అందరూ తీరిగ్గా భోజనానికి కూర్చున్నారు.

కోసంబరి నోట్లో పెట్టుకుంటూ రావు గారు విసుక్కున్నారు.

''ఇలా ఇంతింత ముక్కలు తరిగి పడేస్తే తినడం ఎలా?"

నీళ్లు వడ్డిస్తున్న రాజమ్మ మృదువుగా, "మీరే తరిగింది" అన్నారు.

నిజమే. రావుగారు మర్చిపోయారు. వెంటనే ఆయన మాట మార్చేశారు.

సాయంత్రం ఆడవాళ్ళకి సాయం చేద్దామని ఆయన మళ్ళీ వంటింట్లోకి వెళ్ళారు. అక్కడెవ్వరూ లేరు. మరు భూమిలా వుందావంటిల్లు. రావుగారు రాజమ్మ దగ్గరకొచ్చి,

"వంట చెయ్యరా?" అని అడిగారు.

"మీరున్నారుగా! నాకసలే తల నొప్పిగా వుంది'' అందావిడ.

"సుశీలమ్మ ఎక్కడ?''

''సినిమాకెళ్ళింది''

"కమల''

"స్నేహితురాలింటికి వెళ్ళింది"

"విమల?"

"బాబిగాడికి ఒంట్లో బాగోలేదు. అది వాడి పక్క వదిలి ఇవతలికి వచ్చేటట్లు లేదు"

''మాలతి?"

''మాలతికేం తెలుస్తుంది? మగపిల్లా డిలా పెరుగుతోంది. కావాలంటే దాన్నే మీ సహాయానికి పంపిస్తాను''

మాలతి చేత పని చేయించడమా? పూలన్నింటిలో సుకుమారమయిన జాజి పూవులా పెంచుకుంటున్నారు మాలతిని. అయిదుగురు మగపిల్లల తరువాత పుట్టిన ఆడపిల్ల. తల్లిదండ్రులే కాక అన్నగార్లూ ఆ పిల్లని అపు రూపంగా, అపేక్షగా చూసుకుంటారు. ఆ ఇంట్లో మాలతిదే పైచెయ్యి. ఆమె మాట ఎవరూ కాదనరు. ఆ అమ్మాయేదన్నా కోరుకుంటే మరుక్షణంలో వచ్చి ఒళ్ళో వాలుతుంది. అందరికంటే ఎక్కువ ముద్దు మురిపాలతో పెరుగుతోంది మాలతి.

మాలతి పేరు చెప్పగానే రావుగారు మృదువుగా-

"పాపం! దానికేం తెలుస్తుంది? నేనే చేస్తాలే" అంటూ వంటింటి వేపు వెళ్లారు.

రావుగారు నిమిషనిమిషానికీ, ''అదెలా? ఇదెలా? అదెక్కడ? ఇదెక్కడ?" అంటూ వచ్చి భార్యని హింసించసాగారు.

"నన్ను అది, ఇది అని అడక్కుండా మీకు తోచినట్టు చెయ్యండి'' అనేశారు రాజమ్మ.

వంట ఏంచెయ్యడమా అని ఆలోచిస్తూ రావుగారు కూరలబుట్ట తీసి చూశారు. లోపల్నుంచి చటుక్కున రెండు ఎలకలు ఎగిరి బయటకొచ్చాయి. రావుగారు ఉలిక్కిపడి వెనక్కి జరిగారు. ఉల్లిపాయ పచ్చడి, అన్నం, చారు చేద్దామని నిర్ణయించుకుని, ఉల్లిపాయలు తీసుకున్నారు. కన్నీళ్ళతో ఆ ఉల్లిపాయలు తరగడం తప్పలేదు.

"ఛత్! ఉల్లిపాయలతో ఇంత గోల వుందని తెలిస్తే ఇవి ముట్టుకునేవాణ్ణేకాను" అని రావుగారు తనని తనే తిట్టుకున్నారు.

ఉల్లిపాయలు తరిగేసరికి నిస్త్రాణ ముంచుకొచ్చింది.

"మినప్పప్పు ఎందులోవుంది? శనగపప్పు?" అంటూ మళ్ళీ భార్యదగ్గర కొచ్చారు.

"డబ్బాల్ని ఆడించి చూడండి. చప్పుడుబట్టి ఏదేదో తెలుస్తుంది" అందావిడ.

ఆడవాళ్ళకి మాత్రమే అర్థమయ్యే పాకశాస్త్రం ఇది అని గొణుక్కుంటూ రావుగారు వంటింటివేపు బయల్దేరారు.

ఏడుగంటలకి వంటింట్లో ప్రవేశించిన రావుగారు పదిగంటలకల్లా వంట పూర్తి చేసేశారు.

రావుగారు వండిన వంటనెదుర్కునే ధైర్యంలేక మాధవ..."నాకు ఆకల్లేదు, భోజనం వద్దు" అనేశాడు.

తమ నలపాకాన్ని ఆతడు రుచి చూడడుకదా అని రావుగారు దిగులు పడ్డారు.

మాధవుడు తప్ప అంతా భోజనానికి కూచ్చున్నారు.

రాజమ్మ వడ్డించసాగారు.

ఉల్లిపాయ పచ్చడి చేతికి తీసుకోగానే అది జిగురులా చేతికంటుకోసాగింది. ఆవిడ రావుగారికి ఉదారంగా, పుష్కలంగా వడ్డించారు.

"కమలా, పచ్చడెలావుంది?" అని కోడల్నడిగింది, రాజమ్మగారు.

"అంతా బాగానేవుంది. మినప్పప్పు, శనగపప్పు, వేయించకుండానే వేసినట్టుంది. జిగురు, పచ్చివాసనాను"

"అన్నీ వేయించాలా?" రావుగారికి ఆశ్చర్యం.

"ఊఁ..."

"ఎక్కడో కొద్దిగా తప్పింది"

అన్నంలో నీళ్ళెక్కువైన వైనం, పప్పు ఉడక్కపోవడం లాంటి తప్పులు నిదానంగా సూచించారు ఆడవాళ్లు.

ఈ ఆడవాళ్లు కావాలని తమ తప్పుల్నెంచి, వాటిని భూతద్దంలో చూపిస్తున్నారనిపించింది. ఆయనకి మాత్రం వంటంతా రుచిగానేవుంది.

"రేపట్నుంచి అన్నీ సరిగ్గా చేస్తాను. అని రావుగారు తమ మనోభిలాషని వ్యక్తం చేసేసరికి కోడళ్ళు ముఖాలు చూసుకున్నారు. భర్త నిర్ణయం విని రాజమ్మగారి చేతిలో గరిట జారి కింద పడింది.

రాత్రి అత్తా కోడళ్ళ సభ చాలాసేపే జరిగింది. రాజమ్మగారు అందరినీ ఓదా



ర్చారు.

పొద్దున్నే రావుగారు హడావుడిగా వంటింటివైపు బయల్దేరుతుంటే రాజమ్మగారు అయన్ని మధ్యలోనే నిలబెట్టి, "చూడండీ... మీరు వంటింట్లోకి రావడం మొదలెడితే కోడళ్ళెవరూ అక్కడికడుగు పెట్టరు. వాళ్ళ గదుల్లో వాళ్ళు విడిగా వండుకు తింటారట. అందుచేత మీరు వంట చేసుకునే మాటుంటే రూమ్‌లో విడిగా ఒక కుంపటి పెట్టుకుని చేసుకుని తినండి" అన్నారు.

"నేను కేశవుడి గదిలో భోంచేస్తాను. మాలతి మాధవుడితోబాటు తింటుందట"

రావుగారు హతాశులైపోయారు. రుచికరమైన వంటలన్నీ చేసి అందరికీ ఆశ్చర్యం కలిగించాలన్న ఆయన కోరిక కోడళ్ళ నిర్ణయంవల్ల మొగ్గలోనే తుంచి వేయబడింది.

ఆరోజునుంచీ రావుగారు వంటింటి జోలికి పోలేదు. నాలుగురోజులు కోడళ్ళ మీద ఆయన ధ్వజమెత్తారు. కాని రుచి రుచిగా భోంచేసేసరికి ఆయన కోపం చల్లారిపోయింది. అసలు ఆయన కోపం చల్లార్చడానికే కోడళ్ళు ప్రత్యేకంగా ఆయనకిష్టమైన వంటలు చేసేవారు. మాధవుడు మళ్ళీఎప్పుడూ రాత్రి భోజనం ఎగగొట్టలేదు.

రావుగారికి సాయం సమయం గడపడం మళ్ళీ ఒక సమస్య అయి కూర్చుంది.

పిల్లలన్నందర్నీ తీసుకుని సాయంకాలపు వాహ్యాళికి ఎందుకు బయల్దేరకూడదు–అన్న ఆలోచన వచ్చిందాయనకి.

రాత్రి భోజనాలయ్యాక ఆయన పిల్లల్ని కూర్చోబెట్టుకుని –

"రేపు సాయంకాలం ఆరుగంటలకి రెడీగా వుండండి. అందరం వాకింగ్‌కి వెళ్దాం" అని చెప్పారు.

వెంటనే గుంపులోంచి వ్యతిరేకత – "బాబిగాడొద్దు...కాస్తదూరం నడిచేసరికల్లా కాలునొప్పి, ఎత్తుకో అనేడుస్తాడు"

"మధుకూడా వొద్దు. అది వున్నట్టుండి వీధి మధ్యలో జింకలా పరిగెడుతుంది"

"సరే ... మిగతావాళ్ళంతా సిద్ధం కండి" అన్నారు.

రావుగారు వాకింగ్‌కి ప్రయత్నాలు బ్రహ్మాండంగా చేశారు. తెల్లటి పంచె గోచీపోసి కట్టారు. దానిమీద తోపురంగు పొడుగుకోటు కోటు. జేబులో గడియారం, దానికి బంగారు గొలుసు అందంగా కనపడేలా ఏర్పాటు. రెండు వేళ్ళ వెడల్పున జరీ వున్న తలపాగా. కాలికి పంప్ షూస్, చేతిలో దంతపు పిడివున్న చేతికర్ర...ఇవన్నీ సిద్ధమయ్యాయి.

"రాజీ" అన్నారు.

"ఏమిటి?" అంటూ రాజమ్మగారు ప్రత్యక్షం అయ్యారు.

"వాకింగ్‌కి బయల్దేరు"

"ఈ వయసులో మీతో వాకింగ్‌కి బయల్దేరనా?"

"వాకింగ్‌కి వెళ్ళడానికి వయసుతో ఏం పని?"

రావుగారు రాజమ్మని బయల్దేరదీశారు. ధర్మవరం పెద్దంచు చీర, అరచేతి వెడల్పు జరీ వున్న రంగు రవికె, తీర్చిదిద్ది జడ అల్లుకుని చుట్టచుట్టుకున్న ముడి – ఇత్యాది అలంకారాలన్నీ చేసుకుని రాజమ్మగారు బయల్దేరారు.

ఇంట్లో వున్న వాళ్ళంతా రావుగార్నీ, రాజమ్మగారిని సాగనంపడానికి గేటుదాకా బయల్దేరారు.

పిల్లలందరూ గోలచేస్తూ నుంచున్నారు.




"సైలెన్స్! అందరూ లైన్లో నుంచోండి" అని రావుగారు గదిమారు. అంతా వరుసగా నుంచున్నారు. రావుగారు తమ చేతికర్రతో ఒక్కొక్కరినీ తాకి-

"ఒకటి, రెండు, మూడు..." అంటూ లెక్కపెడుతున్నారు. రాజమ్మగారు కను బొమలు చిట్లించి, "పిల్లల్ని లెక్కపెట్ట డమా?! నేను రానయితే'' అని అలిగి నుంచున్నారు.

"అదికాదే, లెక్క తప్పకూడదు. వచ్చేటప్పుడు ఇంకోసారి లెక్కపెట్టి చూద్దాం! ఎవరన్నా తప్పిపోతే వెంటనే తెలుస్తుంది"

"మీరు అందరికంటే ఆఖర్ని లెక్క పెట్టినవాడు మనింటి కుర్రాడుకాదు. ఇంక ఏభైమంది మనవలు నాకున్నా ఎవడన్నా అరగంట కనిపించకపోతే నాకు తెలిసి పోతుంది. మీరు లెక్కపెట్టకండి"

పిల్లల్ని లెక్కపెడితే ఆయుస్సు తగ్గి పోతుందని ఆవిడ నమ్మకం.

మొత్తంమీద ఆ పరివారమంతా బయల్దేరారు. శంభు అందరికన్న తుంటరి వాడు. అందరికంటే ముందు అతను త్వరగా నడుస్తున్నాడు.

"విశూ...విశూ .... అంత ముందు పరిగెత్తకు. మాతోనే మెల్లగా నడు" అంటూ రావుగారు పిల్చి చెప్పారు.

"నేనిక్కడే వున్నాను తాతయ్యా! వాడు శంభు" అని ఒక కీచు కంఠం గుంపులోంచి వినిపించింది.

కప్పల్ని తక్కెడలో వేసినట్టుగా అందర్నీ ఒకదారికితెచ్చి నాలుగు ఫర్లాంగుల దూరంలోవున్న పార్కుకి వెళ్ళేసరికి రావుగారికి నీరసం ముంచు కొచ్చింది. చెమటలు కక్కుతూ "ఉ...ష్..." అంటూ అక్కడే వున్న రాతి బెంచీమీద కూర్చున్నారు.

కుర్రాళ్లు ఆడసాగారు.

"ఒసే రమా...నీళ్ళ దగ్గరకెళ్ళద్దు"

"విశూ...సతీషూ...పూలు కొయ్య కండర్రా''

"శంభూ...జారుడు బండ దగ్గర జాగ్రత్త"

సలహాల్ని, జాగ్రత్తల్ని, మంద లింపుల్ని చెప్పి చెప్పి రావుగారు నీరసించి పోయారు.

రావుగారి అదృష్టం బాగోక, వేరు సెనక్కాయల వాడొకడు బస్తా ఒకటి తగిలించుకొని "వేరుసెనక్కాయలో" అని అరుస్తూ పార్కులోకి వచ్చాడు.

పిల్లలంతా "వేరుసెనక్కాయలు కొని పెట్టు తాతయ్యా" అంటూ ఆయన చుట్టూ మూగారు.

తప్పించుకునే దారిలేక ఆయన రెండుశేర్ల వేరుసెనక్కాయలు కొనా ల్సొచ్చింది. జేబులోంచి డబ్బు ఖర్చ యింది కదా అని బాధపడిపోయారు రావుగారు.

రాజమ్మగారు వేరుసెనక్కాయల్ని పిల్లలకి పంచారు.

"రమకెక్కువ కాయలొచ్చాయి. నాకే తక్కువ తాతయ్యా'' మంజుల పితూరి.

"నావన్నీ డొల్లకాయలు" సతీషుడి ఆక్షేపణ.

"శంభూ నా కాయలు ఎగరగొట్టి తినేస్తున్నాడు" విశూ ఏడుపు.

రమ వేరుసెనక్కాయలు తిని నీళ్లు తాగడానికి నీళ్ళ ఫౌంటెన్ దగ్గరకెళ్ళింది.

"ఆ నీళ్ళువొద్దు...అవి మురికినీళ్ళు ఇంటికెళ్ళి తాగుదాం" రాజమ్మ వారి స్తున్నా వినకుండా పరిగెత్తింది. ఆ పరుగు జోరులోనే ఒక మొగ్గవేసి



నీళ్ళల్లోకి పడిపోయింది. పిల్లలందరూ రమ పడిపోయిందని అరిచేసరికి మాలి పరుగెతుకొచ్చాడు. అక్కడ ఫౌంటెన్ తొట్టిలో నీళ్ళెక్కువ లేకపోవడంతో రమ లేచి నుంచుంది. దాని లంగా అంతా తడిసింది. పెద్ద దెబ్బ తగలకపోయినా భయంకొద్దీ ఏడవ సాగింది. దాన్ని వూరుకో పెట్టడానికి మళ్ళీ వేరుసెనక్కాయలు కొనక తప్పలేదు.

"పిల్లల్ని చూసుకోడం చేతకాకపోతే ఇలాంటి చోటికి తీసుకు రాకూడదు" పదముగ్గురు మనవల్నెత్తిన రావుగారికి తోటమాలి హితబోధ చేశాడు.

"మనకీ వయసు మళ్ళింది. పిల్లల్ని చూసుకునే ఓపిక మనకి లేదు. రేపట్నుంచి ఈ వ్యాపకం మనకొద్దు" అని రాజమ్మగారూ అన్నారు.

ఆ పిల్లల గోల, తగువులూ, అవాంతరాలు చూసి రావుగారికి ఇంటికి పోతే చాలురా బాబూ అనిపించిపోయింది. మందని మళ్ళించుకున్నట్టుగా బయల్దేరి ఇల్లు చేరేసరికి రాత్రి ఎనిమిదిన్నరయింది. రావుగారు ఇంటికి వస్తూనే పడక్కుర్చీలో వాలిపోయారు "రామా" అంటూ.

అక్కడితో పిల్లల్ని వాకింగ్‌కి తీసి కెళ్ళే ప్రకరణం పూర్తయింది.

మర్నాడు స్నానం చేసేటప్పుడు రావుగారు ఇకమీద సాయంకాలాలెలా గడపడం అనే ఆలోచనలో తలమునకలవ సాగారు. టవల్ చుట్టుకుని ఆయన బయటకొచ్చేసరికి పిల్లలు ఆయన రాక కోసం ఎదురుచూస్తూ నుంచున్నారు.

రావుగారు సుమారు ఆరడుగుల పొడుగుంటారు. వయసు మళ్ళాక ఆయనకి వంగి పాదాలవరకూ కాళ్ళు తుడుచుకోడం కష్టం కాసాగింది. అందు వల్ల రావుగారు తన దగ్గర్లో వున్న మన వలెవర్నయినా కాళ్ళని తుడవమని అడిగే వారు. అలా తుడిచినవాళ్ళకి ఒక రస్కో, చాక్లెట్టో ఇచ్చేవారు. ఆ ఆశతో కుర్రాళ్ల రావుగారి కాళ్ళని తుడవడానికి పోటీ పడేవారు. రావుగారు నీళ్ళగది తలుపు తియ్యగానే, "నేను తుడుస్తాను తాతయ్యా నేను" అంటూ పిల్లలు తోసుకుని వచ్చారు. తాతగారి చేతిలోవున్న టవల్‌ని లాక్కున్నారు. వాళ్ళ తోపులాటలో రావుగారికి పడబోయినంత పనయింది.

"మీరిలాగే గొడవ చేస్తే నేను రేప ట్నుంచి మాలిచేత కాళ్ళు తుడిపించు కుంటానంతే" అనేశారు.

రావుగారి మాటవిని పిల్లలు అల్లరి మానేశారు.

* * *

"రాజీ...ఇంటికి అందరూ డబ్బు సరిగ్గా ఇస్తున్నారా?"

"ఆఁ...వాళ్ళ జీతాల్లో సగం ఇటు ఇచ్చేస్తారు. బియ్యం, ఇంటి అద్దెలేదు కదా మనకి"

"సరిపోతోందా వాళ్ళిచ్చేది?"

"సరిపెట్టుకుంటాం. వాళ్ళ వాళ్ళ పిల్లల ఫీజులు, మందు-మాకులు, బట్టలు, చిల్లర ఖర్చులు అన్నీ వాళ్ళకి వాళ్ళే చూసుకుంటారు"

"ఇంటి ఖర్చులన్నీ సరిగ్గా లెక్క రాస్తున్నారా?"

"దానికూడా టయిమెక్కడుంటుం దండీ"

రావుగారు భార్యని వ్యాఖ్యానించారు- "లెక్కా పద్ధతిలేని సంసారం అ దేం సంసారం? ఇకనుంచిఉమ్మడి సంసారంలో జమా-లెక్కలు నేనే చూసుకుంటాను. ఇక మీదట ఏ డబ్బువచ్చినా, ఏ ఖర్చులు చేసినా నాకు చెప్పాలి.... తెలిసిందా?" అని.

రావుగారు ఒక లావాటి పుస్తకాన్ని లెక్కలు రాయడానికి తెచ్చారు. పెన్నులో సిరా పోసుకొని సిద్ధంగా వుంచుకున్నారు. పుస్తకం మీద పెద్దపెద్ద అక్షరాలతో 'ఇంటి లెక్కల పుస్తకం' అని రాశారు.

"తాతయ్యా...పిడకలు కొన్నారుట" అని శంభు చెప్పబోతుంటే,

"శుభమా అని మొదలెడుతూ, పిడకలుముందు చెప్తావేమిరాఅవలక్షణం" అని చీకాకుపడ్డారు. శంభు బిక్క మొహం వేసుకుని లోపలికెళ్ళాడు.

"బాబిగాడికి ఒంట్లోబాగోలేదట. మరో అరలీటరుపాలు ఎక్కువ తీసుకున్నారట. తిరుపతి వెళ్ళేవాళ్ళెవరికో ఒక రూపాయి ఇచ్చారట. మాలి అర్ధరూపాయి అవసరం వచ్చి అడిగాడట. ముగ్గుకొన్నారు. ముప్పా వలా. పావలాకి కరివేపాకు. నాలుగురూపా యలకి కిరసనాయిలు. అగ్గిపెట్టెకి ముప్పై పైసలు. సబ్బుకి రెండ్రూపాయలు"

ఒక్కరోజులో రావుగారి పుస్తకంలో మూడు పేజీలు నిండిపోయాయి. అయినా ఖర్చయిన డబ్బుకీ, రాసినలెక్కకీ బొత్తిగా పొందిక కుదరటంలేదు. ఎక్కడో తప్పు

వస్తోంది. లెక్క సరిపోకపోయాక ఆ లెక్క రాసి ఏం లాభం?

అసలే లెక్కలంటే విసుక్కునే రావుగారు జమాఖర్చుల పుస్తకాన్ని వదిలిపెట్టేసారు. రాజమ్మగారు దాన్ని రామకోటి రాసుకుందుకు పనికొస్తుందిలే అని దాచుకున్నారు.

మళ్ళీ సాయంకాలాలు గడపడం ఎలా అన్న సమస్య ఉత్పన్నమయింది.

ఓరోజు రాత్రి అందరూ భోజనానికి కూర్చున్నప్పుడు మొదలెట్టారు.

"సాయంత్రం రామాచారిగారు కనిపించారు"

"ఆయనెవరు?"

"సంగీత విద్వాంసుడు. సంగీతం గురించి పెద్ద ఉపన్యాసం ఇచ్చారు. సంగీతంవల్లే త్యాగరాజు మోక్షం సంపాదించాడట" రావుగారు అదేదో ఇవాళే కొత్తగా పరిశోధించినట్టు చెప్పారు.

"నేనూ ఇకనుంచి సంగీతం నేర్చుకుందామా అనుకుంటున్నాను" అని రావుగారు శుభవార్త తెలిపారు.

అందరూ అదిరిపడ్డారు. ఎవరి నోటి నుంచీ ఒక్కమాటకూడా బయటపడలేదు.

"మీకు నమస్కారం పెట్టి బతిమాలుకుంటాను. అసలే మీ గొంతు ఇబ్బందిగా వుందంటూ బాదంపాలు కలిపించుకుని తాగుతున్నారు. ఇంకా ఇదొకటా?" రాజమ్మగారు భర్తని వ్యతిరేకించారు.

"నేను ఫిడేలు నేర్చుకుందామనుకుంటున్నాను" రావుగారు భార్యకి అభయమిచ్చారు.

రావుగారి చిన్నకొడుకు, "వద్దండీ నాన్నగారూ, ఈ వయసులో మీరు సంగీతంనేర్చుకోవడమేమిటి?" అనడిగాడు.

"సంగీతం నేర్చుకుందుకి వయసేమిటి? చూస్తూండండి నెలకల్లా కచేరీ చేసేటంత సంగీతం నేర్చుకుంటాను" అన్నారు రావుగారు.

రామాచార్యులవారు రోజూ పొద్దున్న, సాయంత్రం వచ్చి రావుగారికి సంగీతంలో ఆసక్తిని కలిగించారు. ఆయన తమ ఇంట్లో పడున్న పనికిరాని, విరిగిన ఫిడేలు తెచ్చి రావుగారికి ఇచ్చి "ముందు దీనితో సాధన చేయండి. తరువాత మంచి ఫిడేలు తీసుకోవచ్చు" అన్నారు.

సాయంకాలం రావుగారి సంగీత పాఠం మొదలయ్యేది. రావుగారి ఫిడేలు ఓంక్రింపులు వినలేక కోడిపుంజులు తోడేలుని చూసిన గొర్రెపిల్లల్లా కకావికలైపోయేవారు.

ఇరుగుపొరుగు ఇళ్ళనుంచి రావుగారికి ఆకాశరామన్న ఉత్తరాలు రావడం మొదలెట్టాయి. ప్రతి ఉత్తరంలోనూ, ఆయన ఫిడేలు వాదన ఆపకపోతే జరగబోయే విపరీతాలకి బాధ్యత రావుగారిదే నన్న బెదిరింపులుండేవి.

అయినా రావుగారు అధైర్యపడకుండా జంటస్వరాలు ప్రారంభించారు. రావుగారు ఫిడేలుతో పట్టే కుస్తీకి రామాచార్యులవారు ప్రేక్షకులయ్యేవారు. ఒక్కోసారి రావుగారి ఫిడేలు సాధన చేస్తుంటే ఇంటిమీద రాళ్ళు కురవడమూ జరిగేది. అయినా రావుగారు పుత్సాహం చల్లారలేదు. రావుగారు ఇంట్లో లేని సమయంలో రాజమ్మ మగపిల్లలతో "మీరంటే సాయంకాలాలు ఇంట్లోవుండరు మరి మా గతేమిటి? ఇలాగే కొన్నాళ్ళు గడిస్తే మాకు పిచ్చిపడుతుంది" అని వాపోయారు.

రావుగారి సంగీత సాధననెలాగైనా ఆపుచెయ్యాలని ఇంట్లో వాళ్ళంతా తీర్మానించారు.

## 4

...రావుగారు గీతా పఠనం మొదలుపెట్టారు. నోరు గీతలోని శ్లోకాల్ని పఠిస్తున్నా ఆయన మనసు చావుని తల్చుకుని తత్తరపడుతోంది. 'ఈ పాడు చావుని దేవుడెందుకు సృష్టించాడో' అని ఆయన మనసులోనే దేవుడిని ఆక్షేపించారు...

ఒకరోజు రావుగారు ఉదయపు వాహ్యాళికి వెళ్ళివస్తుండగా వారి స్నేహితులొకరు కనిపించి, మాటలమధ్యలో, "శ్రీపతిగారు నిన్ననేపోయారు తెలుసా?" అన్నారు.

రావుగారి గుండె దడదడలాడింది. ఆయనకి 'చావు' పేరు వింటే భయం, వణుకూను. వయసు మీదపడేకొద్దీ ఆయనకి చావంటే బెంగ, భయం ఎక్కువయ్యాయి. 'చావు' అనే మాటని వీలైనంతవరకు తమ దగ్గరకిరానీకుండా జాగ్రత్తపడతారాయన. అలాంటి ఆయనకి ఈ వార్తవిని గొంతెండిపోయింది.

"అలాగా?" అన్నారాయన.

"ఊఁ. మీ వయసువాళ్ళలో వున్నదిక మీరే. ఏదో నాలుగేళ్ళు గట్టిగా వుండండి రావుగారూ" అన్నారాయన.

రావుగారికి కోపం వచ్చింది.

"నీకెన్నేళ్ళు?" అనడిగారు.

"అరవై"

రావుగారికి వెన్నులోంచి చలి పుట్టుకొచ్చింది. ఆయన తూలిపోతూ ఎలాగో ఇల్లు చేరారు. ఆరోజు ఆయనకి భోజనం సహించలేదు. భోజనం అయిందనిపించి'

"రాజీ 'గీత' ఎక్కడ?" అనడిగారు.

"ఎందుకు?"

"ఎందుకేమిటి? చదువుకోవాలి." అని కళ్ళజోడు తగిలించుకున్నారు.

ఎక్కడయినా చావువార్తవింటే నాలుగు రోజులు తప్పనిసరిగా సంధ్యావందనం, పరిషేచన, గీతా పారాయణం-ఇలాంటివి శ్రద్ధగా ఆచరించేవారు. ఆ వార్త పాతదయ్యేకొద్దీ ఒక్కొక్కటి మరపున, మరుగునపడేవి.

మళ్ళీ మరోసారి చావు వార్త వినేవరకూ రావుగారు దేవుడు – దెయ్యం అన్నీ మర్చిపోయి హాయిగా వుండేవారు. పారమార్థిక చింతనవైపు మనసు మళ్ళించడానికి తనదింకాచిన్నవయసుఅని ఆయన ఉద్దేశం. అందువల్ల ఆయన భాగవతం, భగవద్గీత అంటూ ఏదైనా అడిగితే రాజమ్మకి తెలిసిపోయేది రావుగారెక్కడో చావు వార్త వినివచ్చుంటారని.

రావుగారు గీత నడగ్గానే ఆయన చేతికి అందిస్తూ-

"ఎవరు పోయారు" అని అడిగారు.

"శ్రీపతిగారు పోయారట"

"అయ్యోపాపం! ఎంత బాగుంటుందో ఆవిడ లక్షణంగా. పండుముత్తైదువ. ప్చ్! ఆవిడకెంత కష్టం వచ్చిందీ" రాజమ్మ బాధపడింది.

రావుగారు గీతాపఠనం మొదలుపెట్టారు. నోరు గీతాశ్లోకాల్ని పఠిస్తున్నా రావుగారి మనసు చావుని తల్చుకుని తత్తరపడుతోంది. "ఈ పాడు చావుని దేవుడెందుకు సృష్టించాడో" అని ఆయన మనసులోనే దేవుణ్ణి ఆక్షేపించారు. దానికి జవాబు అన్నట్టుగా రాజీవుడి స్నేహితుడొకతను చేతిలో కోవా పెట్టి "రావుగారూ, నాకు మగపిల్లాడు పుట్టాడు. మా అబ్బాయిని ఆశీర్వదించాలి మీరు" అన్నాడు.

అతను వెళ్ళగానే రావుగారు మళ్ళీ గీత చేతిలోకి తీసుకున్నారు పారాయణం





చేస్తూ-

వున్నట్టుండి రావుగారు తుళ్ళిపడ్డారు. ఏమిటీ కర్కశధ్వని! యముడి దున్నపోతు అరుచుకుంటూ భూమ్మీదకి దిగివస్తోందా? అడవిపిల్లులు దెబ్బలాడుకుంటున్నాయా? రోడ్డురోలర్ ఇంజన్‌చప్పుడా? ఎక్కడయినా గ్రామఫోన్ రికార్డు అరిగి చెడిపోయిందా?

ఆయన తాళలేక లేచి తన గదిలోకి వచ్చేసారు. అక్కడ కనిపించిన దృశ్యం ఇది.

మనవడు-బాబిగాడు ఆయన ప్రాణప్రదమైన ఫిడేలుని తీసుకుని కమానుతో రుద్దిపారేస్తున్నాడు.

తన ఫిడేలుని ముట్టుకునేటంత ధైర్యం వచ్చిందా వీడికి?

దెబ్బతో భగవద్గీత, మోక్షం, దేవుడు అన్నీ ఎగిరిపోయాయి. రావుగారు కోపంగా...

"బాబీ" అని అరిచారు.

"ఏం తాతయ్యా?"

"నా ఫిడేలుని ముట్టుకోకూడదు"

"ఎందుకు తాతయ్యా?"

"ఈ భయంకరమైన చప్పుళ్ళని నేను వినలేను".

ఎలా వచ్చాడో రాజీవుడు వెంటనే ప్రత్యక్షమయ్యాడు.

"మీరు వాయించేటప్పుడూ మేమిలాగే యమయాతనపడతామన్న సంగతి మర్చిపోవద్దు నాన్నగారూ", అనేసి బాబిగాణ్ణి తీసుకుని వెళ్ళిపోయాడు"

రావుగారి మొహంమీద కొట్టినట్టయింది. నా సంగీతం అంటే వీళ్ళందరికి ఇంత లోకువగావుందా! హుఁ, సరే ... బాగా సంగీతం నేర్చుకుని వీళ్ళ మొహాల్ని నీళ్ల కొడతాను అనుకున్నారు రావుగారు.

బాబిగాడు వాయించిన ఫిడేలు రాగం విన్నాక కూడా రావుగారికి దయ కలుగలేదు.

"మీరు రామాచారిగారింటికెళ్ళి నేర్చుకోండి సంగీతం" అని రాజమ్మ సూచించారు.

"చెరువుగట్టుకిపోకూడదా?" అన్నాడు కేశవుడు.

కాని రావుగారు ఒప్పుకోలేదు. ఆయన ఇంట్లోతప్ప మరెక్కడా పాఠం నేర్చుకోనని పట్టుపట్టారు.

పదిహేను రోజుల తరువాత పనిమనిషి చెన్నమ్మ రావుగారి గది తుడవడానికి వెళ్ళింది. అప్పుడే రావుగారు సాధన పూర్తిచేసి ఫిడేలుని చాపమీదపెట్టి బయటకొచ్చారు. చెన్నమ్మకి కుతూహలమో, కొంటెతనమోగాని ఫిడేలు చేతికి తీసుకుంది.

పసిపాపలా ఇంత సౌమ్యంగా నిద్రపోతున్న ఈ ఫిడేలు రావుగారు చెయ్యి వెయ్యగానే దెయ్యంపట్టిన తుంటరిబిడ్డలాగెందుకవుతుందో దానికర్థంకాలేదు.

రావుగారి ఫిడేలు రాగాన్ని తల్చుకునే సరికి చెన్నమ్మ చెయ్యి వణికింది.

ఫిడేలు దాని చేతిలోంచి జారి కిందపడిముక్కముక్కలయింది.చెన్నమ్మ గాభరాగా వణుకుతూ బయటకొచ్చింది. ఇంటివెనుకనున్న రాజమ్మగారి దగ్గరకి వెళ్ళి...

"అమ్మా నేను గది తుడవడానికని అయ్యగారి గదిలోకి వెళ్ళాను. అక్కడ టంటం పగిలిపోయుంది" అని చెప్పింది.

సంగతి తెలిసిన రావుగారు రుద్రావతారాన్ని దాల్చారు. ఇంట్లోవాళ్ళే కావాలని ఈపని చేసుంటారని రావుగారు అందరిమీద అనుమాన పడ్డారు. నాలుగు

రోజులపాటు అలిగి ఎవరితోనూ మాట్లాడకుండా మౌనకలహాన్ని సాగించారు.

"అంతగా కావాలంటే ఇంకో కొత్త ఫిడేల్ కొనుక్కోండి" అని సలహా ఇచ్చారు రాజమ్మగారు.

తమ ప్రియమయిన పాత ఫిడేలు పగిలిపోయాక రావుగారికి సంగీతం మీదున్న ఆసక్తి కూడా ముక్కలై పోయింది.

ఇప్పుడు సాయంకాలాలు మొదటిలాగే ప్రశాంతంగా సాగుతున్నాయి.

రావుగారి కోపం దారికొచ్చాక రాజమ్మగారు చెన్నమ్మని పిలిచి...

"నిజం చెప్పు చెన్నమ్మా! ఫిడేలు ముందే విరిగిపోయివుందా? లేకపోతే నువ్వే ఎత్తి జార్చేశావా?" అనడిగారు.

"లేదమ్మా ముందే విరిగిపోయింది" అని తడబడుతూ చెప్పింది.

"నిజం చెప్పు" అని గదమాయించా రావిడ.

చెన్నమ్మ భయంతో తడబడుతూ,

"అమ్మా! నన్ను మీకడుపులో దాచుకోండి. నిజం చెప్పేస్తా! నేను కావాలని విరక్కొట్టలేదు. ఎలా వుంటుందా అని చూస్తున్నాను. చెయ్యిజారి పడింది. అయ్యగారికి చెప్పద్దండమ్మా" అని వేడుకుంది.

ఈ మాట చెప్తుంటే దానికి ఏడుపొచ్చేసింది.

"అయ్యో పిచ్చిదానా" అని నవ్వుతూ రాజమ్మగారు లేచి లోపలికెళ్ళి కొంచెం పాతబడ్డ చీరొకటి తెచ్చి దానికి కానుకగా ఇచ్చారు.

చెన్నమ్మ ఆనందంగా కళ్ళు తుడుచుకుంది. ఆశ్చర్యంగా కళ్ళు వెడల్పు చేసింది.

"అయ్యగారి ఫిడేలు పగలగొట్టినందుకు నీకు బహుమతి ఇది. వెళ్ళు, రేపు కట్టుకొచ్చి చూపించు" అన్నారావిడ.

సంగీత సాధనకి భంగం కలిగాక మళ్ళీ సమస్య మొదటికొచ్చింది. ఈసారాయన తమలాగే రిటైర్ అయిన ఐదారు మంది వృద్ధుల్ని తమ జతకి చేర్చుకుని సాయంకాలం ఇంటి వరండాలో పేకాట మొదలెట్టారు. రావుగారి దృష్టిలో మిగతా వాళ్ళు చిరంజీవులు. అందువల్ల సహజంగా యజమాని పదవి రావుగారికే దొరికింది.

సాయంకాలం ఐదు గంటలకల్లా చెన్నమ్మ వరండా శుభ్రంగా తుడిచి ఒక జముఖానా పరచేది. తరువాత రావుగారి స్నేహితులు ఒక్కరొక్కరే అక్కడకి చేరేవారు.

ఓకుకి 5 పైసలచొప్పున పెట్టి ఆడేవారు. మోసం ఆడారనీ, ఒకరికొకరు సైగలు చేసి చెప్పేసుకుంటున్నారనీ తగువులాడుకునేవారు. అప్పుడు అందరికంటే రావుగారి గొంతే గట్టిగా వినిపించేది.

పరీక్షలు దగ్గరపడ్డాయని అనంతుడు ఇప్పుడు సాయంత్రాలు కూడా ఇంట్లో కూర్చుని చదవడం మొదలెట్టాడు. రావుగారి బృందంచేసే గొడవ రోజురోజుకీ ఎక్కువవుతూండటంవల్ల అ నం తు డు చెప్పేశాడు.

"తాతయ్యా, రేపట్నుంచి మీ పేకాట ఇంకెక్కడయినా పెట్టుకోండి. మీ గొడవతో నాకు చదువు పాడవుతోంది"

రావుగారు నిర్ఘాంతపోయారు. మనవడు తాతమీద అధికారం చలాయించడమా?

"ఏమిటి గొడవంటావు, కుర్రాళ్ళలా మేం గొడవచేస్తామా"

"పాపం! కుర్రాళ్ళెవరూ గొడవే చెయ్యరు. మాలి వాళ్ళని కాంపౌండులో





ఆడుకోడానికి కూడా వదలడు. మొక్కలు పాడవుతాయని గొడవపెడతాడు. గడబిడ అంతా మీదే"

అనంతుడి మాటకు బదులు చెప్పే అవకాశంలేదు. తను అనంతుడు చెప్పి నట్టు తల ఆడించే మాటయితే తన పెద్దరికం ఏమయినట్టు? తన అధికారాన్ని వదులుకోవడం రావుగారికిష్టంలేదు. కాని అనంతుడంటే లోపల్లోపల కొద్దిగా భయం కూడా. అతడు తండ్రిలా సౌమ్యస్వభావం కలవాడు కాదు. మాధవుడిలా కొంచెం దుడుకు రకం. అనంతుడి మాటలవల్ల ఆయనకి అసహనంగా అనిపించినా ఒప్పుకోక తప్పని పరిస్థితి.

తరువాత రావుగారు పేకాటను తన స్నేహితుడి ఇంట్లో ఏర్పాటు చేసుకున్నారు.

ఒకరోజు రాత్రి ఎనిమిది గంటలకు పేకాట పూర్తిచేసుకుని ఇంటికొచ్చారు. ఇంటికి వచ్చేసరికి ఇంట్లోవాళ్లు కొంచెం కంగారుగా అటు ఇటు తిరుగుతున్నట్టు అనిపించింది.

"ఏమిటి సంగతి? ఏమయింది?" అంటూ అడిగారాయన.

"నాన్నమ్మని తేలు కుట్టింది" అంది రమ.

"తేలో, పామో సరిగ్గా చూశారా?"

"కొండి వున్న ప్రాణిని తేలు అనే అంటాం మరి" జవాబు అనంతుడు దగ్గర్నుంచి వచ్చింది.

"ఇంకేం గతి? ఆడవాళ్ళ బుద్ధే ఇంత ఎక్కడుంది తేలు"

"బొగ్గుల దబ్బాలో"

"నేను చెప్తే దాని తలకెక్కడెక్కుతుంది? బొగ్గుల్ని చేత్తో ముట్టుకోవద్దని ఎన్నిసార్లో చెప్పాను. అనంతా, గ్రామ ఫోను రికార్డు ముక్కొకటి పట్టుకురా. తమలపాకుల రసం చెవిలో పిండండి"

అంటూ తనకు తోచిన వైద్యం చెప్తూ నిప్పుతొక్కిన కోతిలా అటు-ఇటు తిరగ సాగారు.

రాజమ్మ మెల్లగా మూలుగుతూ పడుకున్నారు. తేలు విషం నిమిష నిమిషానికి పైకెక్కుతోంది. రక్తం నిప్పుల మీదున్నట్టుగా వేడెక్కుతోంది. ఆవిడ రావుగారి చిందులు అరుపులు చూసి తన మంటని కొంచెం మర్చిపోయారు.

మాలి తేలుమంత్రం వేసేవాళ్ళని తీసుకొచ్చాడు. అతడు కాళ్ళు, చేతులు కడుక్కొచ్చి రావుగార్ని "తూర్పు కెదురుగా పీటమీద కూర్చోండి" అని ఆజ్ఞాపించాడు.

చిందులేస్తున్న రావుగారు గబుక్కున ఆగి ఆఁ! అన్నారు.

"పీటమీద కూర్చోండి"

అనంతుడికి నవ్వొచ్చింది.

"తేలు కుట్టింది మా నాన్నమ్మకి, తాతయ్యకి కాదు"

"ఆ మంత్రం వేసే ఆయనకూడా నవ్వేసి మూల్గుతున్న రాజమ్మగారి దగ్గర కొచ్చి మంత్రం వేశారు.

రాజమ్మగారి బాధ కొంచెం తగ్గింది. రాజమ్మగారి ఆదేశం ప్రకారం సుశీల ఒక పళ్ళెంలో ఆకువక్క, కొబ్బరికాయ, దక్షిణ పెట్టి అతడి ఎదురుగా వుంచింది. కాని అతడు...

"ఒద్దుతల్లీ, నేను ప్రతిఫలాన్ని పేక్షిస్తే మంత్ర సిద్ధి దొరకదు" అనేసి వెళ్లిపోయాడు.

రాజమ్మకి బాధ తగ్గాక కూడా రావుగారు అరుస్తూనే వున్నారు.

"చెప్పులు వేసుకుని తిరగమంటే విని

పించుకోరు. నామాటంటే లక్ష్యం లేదు''

"మీరు ఆడవాళ్ళయి పుట్టాల్సింది" అన్నారు రాజమ్మగారాయనతో.

"ఎందుకు?"

"మీరు పురిటి నొప్పులనుభవించేటప్పుడు ఎలా అరుస్తారో చూడాలనుంది. ఇంకశాంతంగావుండండి...నేనొక ఘడియ ప్రశాంతంగా పడుకుంటాను" అన్నారు రాజమ్మగారు.

* * *

రావుగారి డయాబిటిస్‌వల్ల ఆయన కొక పక్కనుంచి సంతోషం, మరో పక్క దుఃఖం రెండూ కలిగాయి. పథ్యం





చెయ్యాలే అన్న బాధ, ఇంట్లో అందరి దృష్టిలోనూ ప్రత్యేక వ్యక్తిగా సేవలు, మర్యాదలుపొందే వైభవాన్ననుభవించచ్చు కదా అని సంతోషం.

చాలాకాలానికి లేకలేకపుట్టిన ఏకైక పుత్రుణ్ణి తల్లి లాలించి పాలించినట్టుగా ఆయన డయాబిటీస్‌ని అరచేతిలో పట్టుకుని ముంజేతితో మూసి పెట్టుకుని కాపాడుకోసాగారు.

ఇంతవరకూ జీవితంలో ధ్యేయం లేనట్టున్న రావుగారికి ఇప్పుడీ రోగాన్ని పోషించి కాపాడుకోడమే ధ్యేయమై కూర్చుంది.

ఆయన డాక్టర్‌కికూడా ఇంకెవరూ రోగు ల్లేరేమో, రోజులో ఎక్కువభాగాన్ని ఈయన సాన్నిధ్యంలోనే గడుపు తున్నాడు. ఆయన్ని చూడగానే రావుగారు అత్యంత ఆదరంగా ఆహ్వానిస్తారు.

"నిన్న రాత్రి నిద్ర బాగా పట్టిందా?" డాక్టరు ప్రశ్న.

"అబ్బే...ఎక్కడ? సగంసగం నిద్ర, పైగా పాడుకలలు"

అక్కడేవున్న శంభు, "తాతకి అస్త మానూ ఈజీ ఛెయిర్‌లో కూర్చున్నప్పు డల్లా కునికిపాట్లే. మంచంమీద పడు కుంటే నిద్రెలా వస్తుంది?" అన్నాడు పుటుక్కున.

"నువ్వు బయటకిపోరా" అని గది మారాయన.

"రాత్రి బాత్‌రూంకి ఎన్నిసార్లు వెళ్ళారు?"

"నాలుగైదుసార్లు వెళ్తాను"

"నీరు ఎక్కువగావుండే కూరలు-అంటే దోసకాయ, సీమవంకాయలాంటివి తినకండి"

గీతామృతసారాన్ని భక్తిగా వింటున్న పాండ్రడిలా కూర్చున్నారు రావుగారు.

"రోజుకి నాలుగు చెంబుల నీళ్ల తాగండి"

"నీరుండే కూరలు తినద్దన్నారుకదా మరి అన్ని నీళ్లు తాగితే ఫరవాలేదా?" శంభు సందేహం.

"వెధవా...పోతావాలేదా?" రావుగారి అదిలింపు.

"వంకాయ తింటే ఒళ్ళు దురద లొస్తాయి. చిక్కుడుకాయ మలబద్దకం. గుమ్మడికాయ, అరటికాయ, బంగాళ దుంపలు వాయువు. కొబ్బరిలో చక్కెర, కొవ్వు రెండూ వుంటాయి. ఉప్పు బిస్కట్లు, జామ్ మాత్రం తినచ్చు"

"తాతయ్యా! నాక్కూడా పెడతావా జామ్? ఏమండీ డాక్టర్‌గారూ! జామ్‌లో పంచదార వెయ్యరా?" శంభు వదలటం లేదు.

"నువ్వు పోరా బాబూ" రావుగారికి ఓపిక నశిస్తోంది.

"కాకరకాయ బాగా తినండి. గోధుమ అన్నం, రాగిజావ మంచిది. నేనిచ్చిన మందు శ్రద్ధగావేసుకోండి. పళ్ళుతినకండి. కాఫీ మానెయ్యండి. కోకో తీసుకోండి"

ఇలా వారి సమాలోచన గంటలకొద్దీ జరిగేది.

మర్నాటినుంచీ రావుగారికి బాలెంత పథ్యం, సేవలు మొదలయ్యాయి. పంచ దారలేని కోకోగ్లాసు ఎదురుగా పెట్టుకుని ఆముదం తాగుతున్నట్టుగా మొహం వికారంగా పెట్టి తాగేవారు.

చిక్కటి గేదెపాలలో పంచదార వేసు కుని తాగే కాఫీకీ, ఈ దిక్కుమాలిన కోకోకి పొంతనెక్కడ?

విషంలా ఆ కోకో తాగి గడియారం మీద దృష్టిపెట్టుకూర్చున్నాక కష్టపడి అరగంట గడిపేవారు. కోకో తరువాత అరగంటకి వేణ్ణీళ్ళతో మందేసుకోవద్దూ?

రోజుకి నాలుగుసార్లు వేడినీళ్ళు కాచి వ్వడం ఇంట్లో ఆడవాళ్ళకి పెద్ద ఉద్యోగ మయిపోయింది.

ఆడవాళ్ళ బాలెంతపథ్యం మూడునెల్ల కయినా పూర్తవుతుంది. రావుగారి బాలెంత తనం పూర్తవడమంటూ లేదు.

ఇంట్లో రెండురకాల వంటలు చేయడం మొదలయింది. కొబ్బరివేసి ఒకటి, వెయ్యకుండా ఒకటి.

రావుగారికి అందరిమీదా అనుమానం, తనకెక్కడ అపథ్యం చేయించేస్తారోనని.




అందువల్ల తమ ఆయుస్సు, ఆరోగ్యం ఎక్కడ పాడవుతాయోనని బెంగ ఆయనకి.

రావుగారి జిహ్వ చాపల్యానికి అడ్డు కట్ట వేసినట్టయింది. తనచేత చప్పిడి తినిపించి ఇంట్లోవాళ్ళంతా రకరకాల వంటలు చేసుకుతింటున్నారని ఆయనకి కడుపులో మంటగా వుండేది.

ఇంటి యజమాని పథ్యం చేస్తుంటే ఇంట్లో వున్నవాళ్ళంతా భారీ భోజనం చెయ్యడం ఏం న్యాయం?

"నెలకి 20 కిలోల పంచదార తెప్పించడం ఎందుకు దండగ? రోజుకి రెండు కొబ్బరికాయలు పాడు చెయ్యకపోతే ఏదేవుడేడ్చాడు?" అని వ్యాఖ్యానించేవారు.

ఎవరన్నా బంధువులో, మిత్రులో కనబడి 'బాగున్నారా?' అని పలకరిస్తే చాలు, పురాణం విప్పేసేవారు. వాళ్లు ఎందుకడిగాంరా బాబూ – అని దిగులు పడేలా పెరిగిపోయేది ఆ రోగపురాణం.

"ఈ మధ్యన బొత్తిగా చిక్కిపోయానా నేను?" అని అడిగేవారు రావుగారు.

"లేదే!"

"మీరు సరిగ్గా గమనించి వుండరు. ఈమధ్య నేను చాలా తగ్గిపోయాను. చూడండి...చేతులెలా ముడతలుపడ్డాయో"

"వస్తాను రావుగారూ ... ఆలస్యమైపోయింది" అని ఆ కుశలమడిగిన మంచి భాగ్యులు మెల్లగా రావుగారి పట్టునుంచి తప్పించుకుని పారిపోయేవారు.

ఒకసారి రావుగారు తన పథ్యం గురించిన పురాణం రాజమ్మ దగ్గిర మొదలెట్టారు. అప్పుడామె అసహనంగా –

"మీరు, మీ పథ్యమూ ఎప్పుడూవున్న గొడవే. మాలతి పెళ్ళిగురించి అసలు ఆలోచించేదేమన్నా వుందా లేదా?"

"ఆఁ! మాలతికి పెళ్ళి వయసొచ్చేసిందా?"

"ఇంకా ఏమిటి? ఇరవైయేళ్ళొస్తోంటే"

"దానికి పెళ్ళిచేసి పంపించేస్తే మనం ఎలాగే వుండేది?"

"బాగుంది. అలాగని కూతురికి పెళ్ళి చెయ్యకుండా ఇంట్లో పెట్టుకూర్చుంటామా?"

రావుగారి ముద్దులకూతురు మాలతి నడిస్తే కాళ్ళు నొప్పెడతాయని, చదివితే కరిగిపోతుందనీ రావుగారు యస్.యస్.యల్.సి.తో కూతురి చదువు ఆపించేశారు. అప్పుడు మగపిల్లలు తండ్రికి ప్రతిగా మాట్లాడారు.

"మాలతిని కాలేజీలో చేర్పించండి" అన్నాడు మాధవ.

"ఒద్దు. అది కాలేజీకి వెళ్ళి మేడమ్ అవాలా ఏమన్నానా? పిల్ల ఎండకి, గాలికి వాడి అలిసిపోతుంది" అనేశారు రావుగారు.

"అదింట్లో కూర్చునేంచెయ్యాలి?"

"మంచి కుర్రాణ్ణివెతికి పెళ్ళిచేస్తాను"

ఇంట్లోవాళ్ళంతా ఈ విషయంలో ఆయనతో దెబ్బలాడారు. అయినా రావుగారు ఒప్పుకోలేదు. చివరికి మాలతినే స్వయంగా అడిగారు అన్నగార్లు–

"నాన్నగారెలాచెప్తే అలాగే చేస్తాను" అనేసిందాపిల్ల. దానికే ఆసక్తి లేకపోయాక మనమెందుకు తలలు పగలగొట్టుకోడం–అని వాళ్ళంతా వూరుకున్నారు.

మాలతికిపుడు ఇరవైయేళ్ళు. అన్నవదినలు, తల్లిదండ్రులు ప్రేమ కురిపిస్తుంటే వాళ్ళ వాత్సల్యపు నీడలో సుఖంగా పెరుగుతోంది. ప్రపంచజ్ఞానం పూజ్యం. పనీ పాటు చేతకాదు. పిల్లలో

ఆటలాడుతూ కాలక్షేపం చేస్తుంది. అన్న గార్లు చీరెలు, చిన్నా పెద్ద కానుకలు కొనిస్తుంటే కులాసాగా గడిపేస్తోంది.

శివుడు యం.ఎ. చదువుతున్నాడు. సాహిత్య ప్రేమికుడు. గొప్ప రచయిత కావాలని కలలుగంటున్నాడు. తను రాసిన కథ-కావ్యం అన్నీ చెల్లెలికి చదివి వినిపిస్తాడు.

"ఎలా వుంది మాలతీ?"

"బాగుందిరా"

అన్నగారేమన్నా రాస్తే చెల్లెలికి నచ్చకుండా వుంటుందా? ఆమె మాటల్ని నమ్మి శివుడు వాటిని పత్రికలకి పంపేవాడు.

కాని అతని రచనలు అతన్నొదిలిపెట్ట లేక తిరిగి అతని దగ్గరకే వచ్చి చేరేవి. అప్పుడు శివుడు చిన్నబుచ్చుకునేవాడు. మాలతి అతనిని ఓదార్చేది.

"ఇంకొకటి రాసిపంపించు చూద్దాం"

ఆమె మాట ప్రకారం చేసేవాడు. అయినా వాటికీ అదే గతి పట్టేది.

పోనీలే...మాలతికయినా తన రచనలు నచ్చుతాయికదా - అని తృప్తిపడేవాడు శివుడు.

శివుడు, అనంతు, మాధవ-ముగ్గురూ మాలతికి సన్నిహితంగా వుండేవారు. సాధారణంగా కలిసి భోంచేసినా, కలిసి కబుర్లు చెప్పుకున్నా వాళ్లునలుగురే. వాళ్ళ మధ్య ప్రేమతోబాటు సఖ్యత, స్నేహం కూడా పెనవేసుకుంది. ఎప్పుడూవాళ్లుకలిసి తిరుగుతూ బాతాఖానీ కొడుతూ వుండే వారు.

వాళ్ళు మరీ అలా అంటుకుపోయి తిరుగుతుంటే రావుగారికి అసహనంగా వుండేది. దానికి కారణం-మాలతిపట్ల ఆయనకున్న అపారమైన ప్రేమా, మమకారమే.

ఆయనకు పొద్దుపోక బాధపడినప్పుడెప్పుడూ కూడా మాలతి ఆయనకేమన్నా చదివిపెట్టడంలాంటి పనులు చేసేదికాదు. తండ్రి కళ్ళు మసకలుబారినా ఆమె ఏమీ పట్టించుకోలేదు.

ఆయనలా బాధపడుతుంటే మరో పక్క మాలతి, "శివన్నయ్యా! నేనూ నీతో బయటకు వస్తాను .... తీసుకెళ్ళవూ?" అని గారాలు గుడిచేది.

"ప్లీజ్ మాలీ! ఇవాళ నాతో మా ఫ్రెండొకాయన వస్తున్నాడు. రేపు తీసుకెళ్తాగా" అని చెంపలు నిమిరి బతిమాలేవాడు శివుడు.

"ఊం...వూఁ"అనిగునిసేదిమాలతి.

మాలతి ఏ భంగిమలో వున్నా చూసే వారికి ముద్దుగా వుండేది. రావుగారిలా పలుచని పొడవైన శరీరం ఆమెది. రాజమ్మగారి గౌరవర్ణం ఆ పొడవైన విగ్రహానికి లావణ్యాన్ని చేకూర్చింది. విశాలమైన, నిర్మలమైన, ముగ్ధనేత్రాలు, వాటిని భద్రంగా కాపాడే పెద్దపెద్ద కనురెప్పలు, గులాబిమొగ్గలావున్న పెదవులు, తీర్చిదిద్దినట్టున్న కనుబొమలు-ఆమె సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేసేవి.

పసితనం, అమాయకత నిండివుండే ఆమె మొహంచూస్తే అందరూ ఆమెని తమ హృదయంలో దాచుకుని రక్షించాలన్న ధోరణిలోనే చూసేవారు.

మాలతితో దెబ్బలాడే అవకాశం ఎవరికీ వుండదు. ఆమె ఎవరితోనైనాతక్షణం రాజీ పడిపోతుంది. అందువల్ల సాధారణంగా ఎవరైనా ఆమె అన్నదాన్ని కాదనరు. శివుడు, అనంత్, మాధవ-వీళ్ళతో మాట్లాడాల్సొస్తే వాళ్ళ చెయ్యి పట్టుకునో, భుజంమీదో, వీపుమీదో వాలి

పోయో, ఎప్పుడూ గా రా లు పో తూ మాట్లాడుతుంది. వాళ్ళు ఆమె జడ పట్టుకుని మెలి తిప్పుతోనో, బుగ్గలు నిమురుతోనో, భుజంతడుతోనో మాట్లాడ తారు.

ఈవిషయంలో కూతురి పద్ధతిరాజమ్మ గారికి బొత్తిగా నచ్చేదికాదు.

ఒకసారి అనంతుడు కాలేజీ నుంచి వస్తూనే-

"మాలీ" అనిపిలుస్తూ ఇంట్లో కొచ్చాడు.

ఎక్కడో దాక్కున్న మాలతి వెనుక వైపు నుంచిపరుగునవచ్చి అతడి వీపుమీద పడి మెడచుట్టూ చేతులేసింది.

అక్కడే కూర్చున్న రాజమ్మ, సుశీలమ్మ, రాజీవ, రావుగారు చూశారది.

ఏ చాటుకోపోయి వాటేసుకోడానికి వాళ్ళేంప్రేమికులుకారు. మాలతిమనసులో అలాంటి వికారాలుగానీ, అది తప్పఅన్న భావనగాని ఏమీలేవు. అనంతుడు మాలతి దృష్టిలో అనంతుడంతే! మాలతి దృష్టిలో అనంతుడి రూపు, ఆకారం, స్త్రీ -పురుష భేదం వేటికీ ప్రాముఖ్యతలేదు.

కాని, అందరికీ అలా అనిపించదు గదా!

మాలతి పద్ధతిచూసి రాజమ్మగారికి చిరాకేసింది.కూతుర్ని కసురుకున్నారామె! "ఏమిటా మీదపడ్డం...సిగ్గులేకుండా!" అని.

"ఎందుకమ్మా?" మాలతి అమాయక మైన కళ్ళు చూసి సుశీలమ్మకి అయ్యో పాపం అనిపించింది.

"వాడూ ఎదిగిన కుర్రాడు...నువ్వూ పెద్దపిల్లవయ్యావు. ఇంకా కుర్రచేష్టలు బాగుండవమ్మా"

"అదేమిటమ్మా...అలాగంటావు?"

"అవును...వాడు మగపిల్లాడు"

"మగపిల్లాడయితే?"

ఇంతవరకూ వూరుకున్న సుశీల మధ్యలో కలగజేసుకుని, "పోనెండి అత్తయ్యా! మాలతికి అలాంటివేవీ తెలియవు పాపం. మీరు దాని మనసులో లేని ఉద్దేశాన్ని ఎందుకు నాటుతారు?"

"శివుడితోను, మాధవుడితోనూ ఇలాగే గంతులేస్తుంది. ఏం బాగుంటుంది చెప్పు. నాకివన్నీ నచ్చవు"

రాజీవుడు నవ్వేసి,

"అదొక పసిపిల్ల. దానికిలాంటివన్నీ అర్థంకావు. దానికర్థంకాని విషయాల్ని దాని తల్లోకెందుకు దూరుస్తారు? పోనీయమ్మా ... ఇదేమంత పెద్ద విషయం?" అనేశాడు.

రాజమ్మగారు అప్పటికి వూరుకున్నారు గాని, కూతుర్ని సరిదిద్దే ప్రయత్నం మటుకు మానలేదు. తల్లి ఉపదేశం ఇంకా పచ్చిగా వున్నంతకాలం మాలతి శివుడు, మాధవుడు, అనంతు వస్తే దూరంగా నుంచుని మాట్లాడేది. రోజులు గడిచేకొద్దీ తల్లి మాటలు మరపునపడి, మాధవుడు 'మాలీ' అని పిలిచేసరికి ఛెంగున వెళ్ళి చెయ్యిపట్టుకునేది. పెళ్ళికెదిగిన పిల్ల గురించి ఎవరు ఏమనుకుంటారోనని రాజమ్మగారికి బెంగ.

రావుగారికేమో మాలతిని చేపట్టే అర్హతున్న పుణ్యాశాలి ఈ భూమ్మీద లేడనే నమ్మకం.

"దానికేం తక్కువరాజీ! ఎవరయినా గాని కాళ్ళమీదపడి బతిమాలి పెళ్ళి చేసుకుంటారు. అంతటి అదృష్టం వున్న వారు ఎవడున్నాడూ అంట?" రావుగారు గర్వంగా మాలతివేపు చూశారు.

"పోండి నాన్నా ..." సిగ్గుపడింది

మాలతి.

"మాలిని పెళ్ళాడేవాడికి వంటా వార్పు, పిల్లల్ని పెంచడం అన్నీ చేతనయి వుండాలి. అప్పుడు మన ఇంట్లోని సోఫాసెట్టులా మొగుడింటికి అలంకారంగా వర్ధిల్లుతుంది'' మాధవుడు రెచ్చగొట్టాలని చూశాడు.

"ష్... అన్నయ్యా! కమలొదిన ఇక్కడికి వచ్చినపుడు ఏంవచ్చు ఆమెకి?''

"భోంచెయ్యడం'' మాధవుడి దాడి భార్యవేపు తిరిగింది.

అత్తగారు, మామగారు ఎదురుగా వుండటంతో మాధవుడిని ఏమీ అనలేక వూరుకుంది కమల. మాలతి మాత్రం గట్టిగా నవ్వేసి –

"అలాగే నేనూ! ఇప్పుడు కమల వదినకి రానిపనంటూ లేదు. కేక్స్, బిస్కట్లు, ఐస్‌క్రీంతోసహా అన్నీ ఎంతో బాగా చేస్తుంది" అని మాలతి వదినని పొగిడింది.

ఆమె మాట అబద్ధంకాదు. మాధవుడు నేవీలో పనిచేసే తన మిత్రుల సహాయంతో ఫ్రిజ్, వోవెన్ – ఇలాంటి వస్తువులు కొన్నాక అపురూపమైన పదార్థాలన్నీ ఇంట్లోనే చేయడం నేర్చుకుంది కమల.

కమలొదిన కేక్ అంటే మాలతికి ప్రాణం.

"ఒదినా... కేక్ చెయ్యవూ?" అనడిగిందంటే–ఇంక ఆరోజు ఇంట్లో అందరి నోళ్ళు తీయబడ్డట్టే.

"పొగిడి పనులు జరిపించుకోడానికి నీతరువాతే, ఇంకెవరయినా" అన్నాడు మాధవుడు.

"వదిన బాగా చేస్తుందని ఒప్పుకో అయితే" మాలతి వేధించింది.

"ఫరవాలేదు. తినబుల్‌గానే చేస్తుంది" అన్నాడు కమలనేడిపించాలని.

"పనికిరాని బాతాఖానీమాని అసలు విషయం మాట్లాడండి'' అని మందలించారు రాజమ్మగారు.




ఒకటి రెండు నెలల్లో సుమారు ముప్పయి జాతకాలు సంపాదించారు రావుగారు. పురోహితుడికి జాతకాలు చూపిస్తే వాటిల్లో నాలుగు బాగున్నాయనే అభిప్రాయం వెలిబుచ్చాడు. అందరూ కూర్చుని సమాలోచన చేశారు. మాలతి వాళ్ళ మధ్యనుంచి వెళ్ళిపోయి పిల్లల్తో కలసి ఆటల్లోకి చేరింది మెల్లగా. కాని ఆమె ధ్యాసంతా పెద్దవాళ్ళ మాటల మీదే వుంది.

వాదోపవాదాలు, చర్చలు అయ్యాక అంతాకలసి ఒకకుర్రాడు వయసు, విద్య, ఐశ్వర్యం అన్ని విషయాల్లో మాలతికి తగినవాడని నిర్ణయించారు.

"మాలతినొక మాటడుగుదాం'' అన్నాడు మాధవుడు.

"అవసరంలేదు'' అన్నారు రావుగారు.

చిన్నపిల్ల ... దానికేం తెలుసన్న ధోరణి ఆయనది.

"ఛ ... అలాగంటే ఎలా? అడిగి చూడండి" అన్నాడు కేశవుడు.

"మమ్మల్నెవరడిగారు పెళ్ళికి

ముందు?''

"ఆ కాలానికి ఈ కాలానికి తేడావుంది నాన్నగారూ" అన్నాడు రాజీవుడు.

''సరేలెండి" అని ఇష్టం లేకుండానే మాలతిని పిలిచారు రావుగారు.

మాలతి అడుగులో అడుగేసుకుంటూ, కళ్ళు దించుకుని వచ్చింది. హాలునిండా అన్నయ్యలు, తల్లి తండ్రి, కూర్చున్నారు.

"మాలతీ! మేమంతా కలిసి ఒక కుర్రాడి జాతకం, వయసు, విద్య, ఐశ్వర్యం చూసి నీకోసం అతన్ని చూద్దామని నిర్ణయించుకున్నాం. నువ్వు ఒప్పుకుంటే నేను వెళ్లి కుర్రాడి తండ్రితో మాట్లాడి, ఆ కుర్రాణ్ణి చూసొస్తాను. కుర్రాడు నాకు నచ్చితే ఇక్కడకి పిలిపిద్దాం. తరువాత మీరంతా చూడచ్చు" అన్నారు రావుగారు.

మాలతి మాట్లాడలేదు.

"అబ్బాయిపేరు మహేష్. వయసు ఇరవై నాలుగు. బి.ఎస్‌సి పూర్తిచేసి, బి.ఇ. ఆఖరి సంవత్సరం చదువుతున్నాడు. ఇంకా చదువుతున్న కుర్రాడయితే నువ్వు పెళ్ళయ్యాక కూడా ఒక ఏడాదిపాటు ఇక్కడే వుండచ్చుకదా. కుర్రాడి తండ్రికి ఇద్దరు మగపిల్లలు. వకీలుగా పేరు, డబ్బు రెండూ బాగా సంపాదించారు''

రావుగారి మాట పూర్తయ్యేలోపున మాలతి, ''మీకెలా ఇష్టమయితే అలా చెయ్యండి నాన్నగారూ'' అని పారిపోయింది.

రావుగారు మైసూరువెళ్ళి కుర్రాణ్ని చూసి, తండ్రితో మాట్లాడి రావాలని నిశ్చయమయింది.

రావుగారు ఎప్పుడు ఏ ట్రెయిన్‌కి వెళ్ళాలో ఇంకా అనుకోలేదు. ఏ సంగతి తేలాక పెళ్లికొడుకు తండ్రికి ఉత్తరం రాయాలనుకున్నారు. కుర్రాడి తండ్రి సుబ్రహ్మణ్యం రావుగారికి పరిచితులే.

రాత్రి రైల్లో ఫస్టుక్లాసులో ప్రయాణం చేసి, పొద్దున్నే మైసూరు చేరడం. ఆ పగలల్లా పని చూసుకొని తిరిగి రాత్రికి రైలెక్కి బెంగుళూరికి రావడం-ఈ పద్ధతి కేశవుడు సూచించాడు. రావుగారికి నచ్చింది. రావుగారు రైల్లో రాత్రి సుఖంగా నిద్రపోవచ్చులే అనుకున్నారు.

నాలుగు వేళ్ళ వెడల్పున జరీ వున్న పంచె, కోటు, అందమైన తలపాగా – ఇవన్నీ ఉతికించి ఇస్త్రీ చేయించారు. బూట్లకి పాలిష్ చేయించారు.

పసి పిల్లల్తో ప్రయాణం చేస్తే పాల సీసా, పంచదార, మంచినీళ్లు, గిలకలు- అన్నీ పెట్టుకున్నట్టుగా, రావుగారు లెదర్ సూట్‌కేస్‌లో స్రాకిన్, మాత్రలు, ఒక ఫ్లాస్క్ వగైరా అన్నీ పెట్టుకుని బయల్దేరారు. రావుగారు దిగబోయే ఇంధువులింటికి ఉత్తరం రాస్తూ గోధుమ అన్నం, కొబ్బరిలేని కూరలు చెయ్యమని తెలియజేశారు.

రావుగారికి వీడ్కోలివ్వడానికి మగపిల్లలంతా స్టేషన్‌కెళ్ళారు. కేశవ, రాజీవ్ కంపార్ట్‌మెంటులోకి వెళ్ళి బెర్త్‌మీద ఆయనకి పక్క పరిచారు.

కేశవుడు, "జాగ్రత్తగా వెళ్ళిరండి ! వాళ్ళింటి వ్యవహారాలన్నీ జాగ్రత్తగా గమనించండి. కుర్రాడి గుణ స్వభావాలు సరిగాఅడిగి తెలుసుకుని రండి'' అని చెప్పాడు.

రావుగారు అన్నింటికీ "సరే"నన్నారు.

రావుగారి డాక్టరు, ''మందులు జాగ్రత్తగా తీసుకోండి" అని చెప్పారు.

రావుగారి ఆయురారోగ్యాలే తన జీవితాదారమని ఆయన అభిప్రాయం.





"నిద్రమాత్రలు పెట్టుకున్నారు కదా" అనడిగాడు వైద్యుడు.

"ఆఁ..."

రైలు కూత పెట్టింది. అంతా కిందకి దిగారు.

రైలు బయల్దేరింది. రావుగారు తల పొగాతీసి జాగ్రత్తగా వంకీకి తగిలించారు. ఫ్లాస్కులోంచి వేణ్ణీళ్ళు తీసుకుని మందు వేసుకున్నారు. అద్దంలో మొహం చూసుకుని ముసలి రూపు వచ్చేస్తోందని ఒకసారి చింతించారు.

కంపార్ట్‌మెంట్‌లో ఇంకెవరూ లేరు. మరో బెర్త్ ఖాళీగా వుంది.

లైటార్పి పడుకున్నారు రావుగారు. రైలుచప్పుడు చేసుకుంటూ సాగిపోతోంది. ఆ చప్పుడు తప్ప ఇంకే శబ్దమూ లేదు. అటు ఇటు దొర్లారు. కళ్ళు మూసుకుంటే నిద్రపట్టలేదు. ఆకలేస్తే ఏం చెయ్యాలన్న ఆలోచనలొచ్చాయి. బిసి బేళెబాత్, పంచదార వేసిన పాలు సేవిస్తే ఎలా వుంటుంది – అన్న ఆలోచన వచ్చింది. నోట్లో నీరూరింది. రావుగారి కళ్ళముందు బియ్యంతో చేసే వంటలు, తీపి పదార్థాలు నాట్యమాడాయి.

ఏం చేసినా నిద్రరాలేదు. రావుగారు అటు ఇటు దొర్లుతూ తను తినకూడని పదార్థాల గురించి ఆలోచిస్తూ కాలం గడపడం చాలా కష్టంగా వుంది.

రావుగారు లేచి లైటేసుకుని డాక్ట రిచ్చిన నిద్రమాత్ర మింగి పడుకున్నారు.

వాంగీ బాత్, జిలేబి తిన్నట్టు కలలొస్తే బాగుండుననుకుంటూ నిద్రపోయారు.

ఆయనెంతసేపు నిద్రపోయారోతెలీదు. ఏదో స్టేషన్‌లో కాఫీ, కాఫీ అన్న అరుపు లకి మెలకువ వచ్చింది. కళ్ళు తెరిచిచూస్తే బాగా వెలుగు వచ్చివుంది. ఒళ్ళు విరుచు కుని ఆవలించారు. ఆయనకింకా నిద్ర ముంచుకొస్తోంది. కష్టపడి కళ్ళు విప్పార్చి చూశారు. ఎదుటి సీట్లో ఎవరో ప్రయా ణికుడు వున్నాడు.

"ఏవూరొచ్చిందండి" రావుగారు భార కంఠంతో అడిగారు.

"మండ్య"

అయితే ఇంకాసేపు నిద్రపోవచ్చులే అనుకుని మళ్ళీ ఒంటిమీదకి శాలువ లాక్కుని నిద్రలో మునిగారు.

కాసేపటికి వున్నట్టుండి నిద్రమత్తు వదిలిపోయి చటుక్కునలేచికూర్చున్నారు. పూర్తిగా మెలకువ వచ్చేసింది. ఎదుటి ప్రయాణీకుణ్ణి మళ్ళీ అడిగారు-

"ఏ వూరు?"

"చెన్నపట్నం"

"చెన్నపట్నమా ... శ్రీరంగ పట్నమా?"

"చెన్నపట్నం"

"మీకు సరిగ్గా తెలుసా?"

"అదేమిటండీ...అలాగడుగుతారు?"

రావుగారి నోటమాటరాలేదు. ఆయన ప్రతిమలా కూర్చుండిపోయారు. ఆయన్ని చూసి ఎదుటి మనిషికి జాలేసింది.

"ఏవూరు వెళ్ళాలి మీరు?" అనడి గారు.

"మైసూరుకి"

"ఈ రైలు బెంగుళూరు వెళ్తుంది. పొద్దున్నే మైసూర్నించి బయల్దేరింది..."

రావుగారు తమ కథంతా ఆయనకి చెప్పారు. నిద్రమాత్రలిచ్చిన డాక్టర్ని మనసులోనే శపించుకున్నారు.

"బెంగళూరి నుంచి వచ్చిన రైలే మళ్ళీ పొద్దున్నే బయల్దేరి బెంగళూరు వెళ్తుంది. మీకు మైసూరు చేరినపుడు మెలకువ రాలేదనుకుంటా. అయినా వయసు పైబడ్డాక ఒంటరిగా ప్రయాణాలు చేయ కూడదండీ"

వయసు...వయసు ఈ మాట విని విసుగెత్తిపోయారు రావుగారు. ఏం మహా వయసయిందనితనకి. తన వయసువాళ్ళు ఇంకా రెండో పెళ్ళిళ్ళు చేసుకుంటు న్నారు.

"అది సరే...ఇప్పుడేం చెయ్యడం?"

"ఏం చెయ్యకండి...బెంగళూరు వెళ్ళి మళ్ళీ ఇంకెప్పుడయినా ఎవర్నన్నా తోడు తీసుకుని బయల్దేరండి. అంత అర్జెంట్ పనిమీలేదుకదా మైసూర్లో''

"లేదు"

"అయితే అలాగే చెయ్యండి" అన్నా రాయన.

అయినా రావుగారి మనసు సమా ధానపడలేదు. ఏదో శుభమా అని బయ ల్దేరితే ఇలా ఇబ్బందిరావడం ఆయనకి చాలాబాధగా, చికాగ్గా అనిపించింది. రావు గారు ముళ్ళమీద కూర్చున్నట్టుగా బాధ పడ్డారు.

బెంగుళూరు వచ్చింది. రావుగారు తల వంచుకుని ఒక ఆటో చూసుకొని ఇంటికి వెళ్ళిపోయారు.





వరండాలో కూర్చుని విమలతో పచ్చీసు ఆడుతున్న మాలతి రావుగార్ని చూసింది. ఆమె కళ్ళు ఆశ్చర్యంతో పెద్ద వయ్యాయి. విమల మామగార్ని చూసి లేచి లోపలకి వెళ్ళింది.

అలసిపోయిన రావుగారు తన రూమ్ లోకి వెళ్ళిపోయారు. రాజమ్మగారు భర్త వెంటే వెళ్ళింది.

"ఎందుకొచ్చేశారు? ఒంట్లో బాగుందా లేదా?"

రావుగారు కుర్చీలో కూలబడ్డారు. తమ ఘనకార్యం భార్యకి చెప్పుకోడానికి పరువు తక్కువగా అనిపించింది.

కూతురికి పెళ్ళికొడుకుని వెతకడానికి వెళ్ళిన తండ్రి ఇంత నిర్లక్ష్యంగా వుండచ్చా? ఒక్కొరక్కుండా నిద్రపోవ డమా? ఈ పనిమీద వెళ్ళినప్పుడే ఇలా అవ్వాలా?

రావుగారి మనసు ముడుచుకు పోయింది. వాడిపోయిన ఆయన ముఖాన్ని చూసి రాజమ్మగారు మళ్ళీ అడిగారు-

"ఏమండీ...ఒంట్లో బాగుందా?"

"ఊఁ...మైసూర్ స్టేషన్‌లో దిగు తుండగానే సుబ్రహ్మణ్యంగారి స్నేహితు లొకరు కనిపించి - సుబ్రహ్మణ్యంగారు వూళ్ళోలేరని చెప్పారు. అందుకని ఇంకో సారి వెళ్ళి చూడొచ్చులే అనుకుని మళ్ళీ అదే రైలెక్కి వచ్చేశాను"

రిటైర్డ్ లాయర్‌గారికి అబద్ధాలు చెప్పడం ఎవరైనా ప్రత్యేకం నేర్పాలా?

"ఆయనకి మీరు వస్తానని వుత్తరం రాశారుకదా?" అందావిడ.

"ఆయన అర్జంట్ పనిమీద తప్పని సరిగా వెళ్ళాల్సొచ్చిందట"

రాజమ్మగారు చిరాగ్గా-

"మీరెన్నయినా చెప్పండి! మగపిల్లల తండ్రులకి కొంచెం గర్వం ఎక్కు వుంటుంది. మీరొస్తారని తెలిసి కూడా ఆయన వూరొదిలి వెళ్ళడమేమిటి?"

"మనుషులన్నాక కష్టం సుఖం, ఇబ్బంది,అవసరంవుండకుండావుంటాయా రాజీ" అని రావుగారు వియ్యంకుడి పక్షం వహించారు.

మళ్ళీ మంచిరోజు చూసుకుని, ఈసారి రావుగారు, రాజమ్మ ఇద్దరూ బయల్దేరారు. క్రితంసారిలా రావుగారు రైల్లో సుఖంగా ప్రయాణంచేసే ఉద్దేశం పెట్టుకోలేదు. మద్దూరులో దిగి కాఫీ తాగారు. కాఫీ తాగ మని భార్యకి మర్యాదలు చేశారు. నలుగురి ఎదురుగా భర్తనేమీ అనడానికి లేదు.

"నేనెప్పుడయినా హోటల్ కాఫీ తాగానాండీ?" అని చూపుల్తోనే తమ ఆక్షేపణని వ్యక్తంచేశారు రాజమ్మగారు.

రావుగారు కాఫీ తాగి, "ప్చ్! పంచ దార వేసేశాడు" అని వేపనూనె తాగి నట్టు మొహం పెట్టారు.

"హోటల్‌వాళ్ళు మీకోసం స్క్రాకిస్ వేస్తారని అనుకున్నారా?" రాజమ్మగారి కామెంట్.

మైసూరు వచ్చింది.రావుగారు రాజమ్మ తమ బంధువుల ఇంటికివెళ్ళారు. గోషుష అన్నంలాంటి జాగ్రత్తలు తీసుకోబడ్డాయి. సాయంత్రం ముహూర్తం బాగుందని ఆ దంపతులుసుబ్రహ్మణ్యంగారింటికివెళ్లారు.

"క్రితంసారి నేను మైసూరు వచ్చిన సంగతి అక్కడ ప్రస్తావించకు" రావు గారు భార్యకి ముందే సూచన ఇచ్చారు.

సుబ్రహ్మణ్యంగారింటి దగ్గర దిగగానే అగరొత్తుల పరిమళం స్వాగతంపలికింది. వరండాలో వున్న సుబ్రహ్మణ్యంగారు ఎదురొచ్చి ఆహ్వానించారు. ఆయనకొద్దిగా పొట్టిగా బొద్దుగా వున్నారు. ఎరుపురంగు,

గుండ్రటిమొహం, దట్టమైన క్రాపు, విశాలమైన కళ్ళు, చిన్నమీసం—ఈ ఆకారాన్ని చూసి, ఈయనకు పెళ్ళికెదిగిన కొడుకు వున్నాడా అని ఆశ్చర్యపోతారంతా.

ఆయన భార్య ఇందిరమ్మ భర్తకి వ్యతిరేకంగా వున్నారు చూడ్డానికి. సన్నగా, పొడుగ్గా, చామనఛాయ, పలుచబడ్డ వెంట్రుకలు ఆమెని వృద్ధవర్గానికి దగ్గరగాచేర్చాయి. కన్నది ఇద్దరు పిల్లల్నే అయినా కొంచెం ముసలిరూపం వచ్చేసింది.

తండ్రి రెండుసార్లు పిలిచేటప్పటికి మహేష్ బయటకొచ్చాడు. తండ్రి రూపు, తల్లి విగ్రహం పుణికిపుచ్చుకొన్న ఆ కుర్రాణ్ణి చూసి రాజమ్మగారు సంతోషం పట్టలేకపోయారు.

'కుర్రాడు మన్మథుడిలా వున్నాడు' అనుకున్నారావిడ. దువ్వీదువ్వనట్టున్న క్రాపు, పెద్ద పెద్ద కళ్లు, చిన్నమీసం, చక్కనిపలువరుస, తండ్రిఛాయ, విశాల వక్షస్థలం,చిరునవ్వు చిందబోతున్నట్లున్న పెదవులు—ఇవన్నీ చూసి రావుగారు తృప్తి పడి మనసులోనే, 'మాలతికి సరియైన జోడీ'—అనుకున్నారు.

రాజమ్మకీ, రావుగారికీ మర్యాదలు జరిగాయి. లోకాభిరామాయణం అయింది. సుబ్రహ్మణ్యంగారు తన రెండవ కొడుకుని కూడా పిల్చి పరిచయం చేశారు.

"మంచిరోజు చూసి మీరంతా మా ఇంటికి దయచేయండి" అని వారిని ఆహ్వానించారు రావుగారు.

'హమ్మయ్య వచ్చినపనయింద'ని రావుగారు రాత్రి రైలుకి భార్యాసమేతంగా బెంగుళూరికి బయల్దేరారు. ఈసారిఆయన నిద్రమాత్రని పొరపాటునకూడా తెచ్చుకోలేదు. ఒక వేళ నిద్రపట్టినాకూడా రాజమ్మగారున్నారు గనుక భయంలేదు.

రావుగారు, రాజమ్మగారు ఇంటికి వెళ్ళగానే ఇంట్లోవాళ్ళంతా వాళ్ళ చుట్టూ చేరారు. మాలతి దూరంగా వుండిపోయినా ఆమె మనసంతా ఇక్కడే వుంది.

మహేష్‌ని వర్ణించి రావుగారు అలసిపోయారు.

అయినా, అలాచూడబోతే మనమాలతి అతనిముందు అంతబాగోనట్టేలెక్క—అని రాజమ్మగారు అనగానే కొట్టినంత పని చేశారు రావుగారు.

ఇంక పిల్ల, పిల్లాడు ఒకర్నొకరు చూసుకోడమే ఆలస్యం. ఆదివారంనాడు బెంగుళూరు వస్తామని తెలియజేసారు సుబ్రహ్మణ్యంగారు. ఆదివారం కాలేజీ వుండదుకాబట్టి మహేష్‌కూడా కాదనలేదు. అయినా అతనికి చదువు పూర్తయ్యాకే పెళ్ళి చేసుకుంటే బాగుండుననిపించింది. కాని ఆ సమస్యని రావుగారు మొదటిసారి వెళ్ళినప్పుడే పరిహరించారు.

"కుర్రాడు చదువు పూర్తి చేసి పనిలో చేరేవరకూ అమ్మాయి మా ఇంట్లోనే వుంటుంది''

అందువల్ల సంసార భారంకూడా ఇప్పుడే అతని మీద వుండదు.

రావుగారింట్లో సుబ్రహ్మణ్యంగారికి ఘనస్వాగతం లభించింది. కేశవుడందర్నీ ఆహ్వానించి, తమ్ముళ్ళని మహేష్‌కి పరిచయం చేశాడు. మాధవుడికి మహేష్ రూపం, చిరునవ్వు చాలా నచ్చాయి.

రాజోపచారాలు జరిగాక అడుగులో అడుగేసుకుంటూ, సిగ్గుతో ఎర్రబడ్డ మొహాన్ని దించుకుని లోపలికి వచ్చింది మాలతి. మహేష్‌కి సరిగా కనబడేలా కూర్చోపెట్టారు.

ఇందిరమ్మ వధూ పరీక్ష మొదలెట్టారు.

"ఏం చదివావమ్మా?"

"ఎస్.ఎస్.ఎల్.సి'' కూతురి బదులు రావుగారి జవాబు.

"వంటా వార్పు వచ్చా?"

''ఇంతవరకు ఏమీనేర్చుకోలేదు. ఇక ముందు నేర్పిస్తాం'' మళ్ళీ రావుగారిదే జవాబు.

రావుగారు సత్యహరిశ్చంద్రుడిలా జవాబులివ్వడం చూసి రాజమ్మగారికి చిరాకేసింది. వెయ్యి అబద్ధాలు చెప్పి ఒక పెళ్ళి చెయ్యమంటారు. అలాంటిది ఈయన సత్యసంధుడిలా వంటావార్పు రాదనిచెప్పి కుదిరే పెళ్ళికూడా చెడగొట్టేలా వున్నారు.

"సంగీతం?"

"రాదు"

"కుట్లు, అల్లికలు?"

"రావు''

రాజమ్మగారు కూర్చున్న చోటనే ఇబ్బందిగా కదులుతున్నారు. మహేష్ మాలతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ తల్లికీ, రావుగారికిమధ్య జరిగే వాగ్వాదాన్ని చిరునవ్వుతో వింటున్నాడు.

"అయితే మీ అమ్మాయికేమి వచ్చు?" ఇందిరమ్మ ఓపిక నశించి అడిగారు.

''ఏమీరాదు. ఒక్కతే కూతురని చాలా ముద్దుగా పెంచుకున్నాము. ఏదయినా ఇక ముందు నేర్చుకోవల్సిందే"

మహేష్ మాలతి మాయలో పడ్డాడని అతడు మాలతివేపు చూసే పద్ధతిలోనే కనిపెట్టేశాడు మాధవుడు.

ప్రశ్నోత్తరాలయ్యాయి. అంతా తన ప్రతిభేనని మురిసిపోతున్నారు రావుగారు.

కాబోయే వియ్యాలవారు వెళ్ళగానే రాజమ్మగారు రావుగారిని పట్టించారు.

"వాళ్ళేమడిగినా లేదు, రాదు అని మొదలుపెట్టారు...ఏమనుకుంటారువాళ్ళు?" అని దబాయింపు మొదలుపెట్టారు.

"ఇంకేం చెయ్యాలి? అబద్ధాలు చెప్పాలా?" అని అడిగారు రావుగారు.

ఆయనమీద కోపంతోనే, రావుగారి స్నేహితులింట్లో పెళ్ళి రిసెప్షన్‌వుంటే రాను పొమ్మందావిడ.

రావుగారు మాత్రం పెళ్ళికొడుకులా అలంకరించుకుని బయల్దేరారు.

మామూలుగా ఆయనకి ఇంట్లోవుంటే బట్టల విషయంలో పెద్ద శ్రద్ధలేదు. ముతక పంచె, షర్టు వేసుకుని కాలక్షేపంచేసేస్తారు. లేకపోతే ఒక్కోనాడు రోజల్లా తుండు గుడ్డతో వుండిపోతారు. కుర్రాళ్ళు దాన్ని 'బికినీ' అని హాస్యంచేస్తుంటారు.

బయటకెళితే మాత్రం వున్న రెండు వెంట్రుకలకీ వాసన నూనెరాసి, కచ్చపోసి జరీపంచె, చేతిలో వాకింగ్ స్టిక్ పట్టుకుని నడుస్తుంటే చూసినవాళ్ళంతా ఇంకోసారి తిరిగిచూస్తారు.

లక్షణంగా అలంకరించుకుని మెల్లగా భార్య దగ్గరకెళ్ళి, "వస్తావా పెళ్ళికి" అన్నారు.

"రాను'' అన్నారావిడ.

రావుగారొక్కరే వెళ్ళిపోయారు. భోజనాలవేళకి మాధవుడు, కేశవుడు పెళ్ళివారింటికి వెళ్లారు. అక్కడ కనిపించిన దృశ్యంచూసి మతిపోయింది వాళ్ళకి.

రావుగారి కాలంలో వకీలుగా వుండిన సంపత్తయ్యంగార్ పక్కనే కూర్చుని అత్యంత స్నేహంగా, ఆత్మీయంగా మాట్లాడుతున్నారు రావుగారు. పందిట్లో ఒక మూలగా కూర్చున్నారు వాళ్లిద్దరూ.

వాళ్ళు వృత్తిలో వుండిన రోజుల్లో ఒకరంటే ఒకరికి పడేదికాదు. ఇద్దరూ ఒకరికొకరు వ్యతిరేకంగా వాదనకి నిలబడే వారు. ఆ వాదనలో మాటకి మాట పెరిగి

పోయి తగవులయ్యేవి. అప్పుడు మూడో వాళ్ళెవరయినా వచ్చి సర్దిచెప్పాల్సొచ్చేది. రిటైరయ్యేవరకుకూడా వాళ్లిద్దరూ బద్ధ శత్రువుల్లాగే మెలిగారు-ఈ సంగతులన్నీ కేశవుడికి తెలుసు. అతడు తన కళ్ళని నమ్మలేకపోయాడు. ఏదో మాట్లాడుతూ గబుక్కున విరగబడి నవ్వి సంపత్తయ్యంగార్ భుజంమీద ఓ చరుపు చరిచారు. రావుగారిని చూస్తున్న కేశవుడు నివ్వెరపోయాడు. వాళ్లిద్దరూ మళ్ళీ ఫ్రెండ్స్ ఎలా అయ్యారన్న ఆలోచన వేధించ సాగిందతడిని.

పెళ్ళి భోజనం అయింది. అందరూ పెళ్ళికూతురి తల్లిదండ్రులకి చెప్పి బయల్దేరారు. రావుగారు, కేశవుడు, మాధవుడు మెల్లగాఅడుగులువేస్తున్నారు.

ఉన్నట్టుండి రావుగారు కేశవుణ్ణి అడిగారు-

''కేశవా! పందిట్లో కూర్చుని నాతో అంతసేపు కబుర్లు చెప్పారే, ఆయనెవరు? అతన్నెక్కడో చూసినట్టుంది. కాని పేరు మర్చిపోయాను''

రావుగారి ప్రశ్నలో కేశవుడి సందేహానికి జవాబు దొరికింది.

"మరి అంతసేపు ఆయన్తో ఏం మాట్లాడారు?"

"కాంగ్రెస్ గవర్నమెంట్,డయాబెటీస్ ఇలా ఏవేవో మాట్లాడాను. కాని అతడెవరన్నది తెలియలేదు''

"మరి మాటెలా కలిసింది?"

"ఆయన 'జ్ఞాపకమున్నానా' అని పలకరించారు. నేను లేదనడం ఎలా చెప్పు" అన్నారు రావుగారు.

వాళ్ళు ఇల్లు చేరేసరికి రాత్రి పదకొండు దాటింది. రాజమ్మ వాళ్ళకోసమే ఎదురుచూస్తున్నారు. రావుగారు బట్టలు విప్పుతూ...

"పెళ్ళిలో బ్రహ్మాండమయిన భోజనం పెట్టారు కాని బాదంఖీర్‌లో పంచదార వేసేశారు" అన్నారు.

"పెళ్ళివారింట్లో సాక్రిన్ వేసిన బాదం ఖీర్ చేస్తారా మీకోసం? సర్వంగా భోంచేసే మాటయితేనే అలాంటిచోట్లకి వెళ్ళాలి. పంచదారొద్దు, కొబ్బరివేసిన వంటొద్దు అనేమాటయితే మర్యాదగా ఇంట్లో కూర్చోవాలి"

"సర్లే ... నేను వేరే పాలు తెప్పించుకున్నాననుకో''

"పెళ్ళికూతురెలాంటి చీర కట్టుకుంది?" రాజమ్మ కుతూహలంగా అడిగారు.

''పట్టుచీరకాబోలు"

"పట్టుచీర కాకపోతే నేతచీర కట్టిస్తారేమిటి? ధర్మవరం చీరా? టిష్యూచీరా?"

"అదేం చీరోమరి...తళతళ మెరుస్తోంది"

"అయితే టిష్యూచీరయి వుంటుంది. రంగు?''

ప్చ్! పాపం రావుగారు ఏరంగని చెప్తారు?

''నీలం అనుకుంటా''

"ఛీ! లలితకి నీలంరంగంటేఅసహ్యం. నీలం అయ్యుండదు''

"అయితే నలుపేమో"

"ఛ ఛ! పెళ్ళికి నల్లచీరేమిటండీ?"

''ఆకుపచ్చయినా కావచ్చు"

''ఆకుపచ్చా?''

"అయితే ఎరుపేమో?"

రావుగారు రంగుల వలలో భార్యని దింపి, తనూ చిక్కుకున్నారు.

"అక్కడికన్ని రంగులూ పూర్తయ్యాయి"

''ఏదో ఒక రంగులెద్దూ'' అని

రావుగారు తప్పించుకున్నారు.

"పెళ్ళికొడుకెలా వున్నాడు?"

"మన మహేషంత బాగాలేడు. రేపయినా నువ్వు తప్పకుండా అక్కడికి రావాలని చెప్పారు"

"సర్లెండి" అన్నారు రాజమ్మ.

పెళ్ళి భోజనంవల్ల నోఏమో మర్నాడు అజీర్ణంచేసి కొంచెం ఒళ్ళు వెచ్చబడింది. అప్పుడు రాజమ్మగారింట్లోలేరు. నాగవల్లి వేడుక చూడ్డానికి పెళ్ళివారింటికి వెళ్ళారు.

రావుగారు గట్టిగా మూలుగుతూ, "సుశీలమ్మా" అని పిలిచారు. సుశీలమ్మ వచ్చి ఎదురుగా నుంచుంది.

"ఇప్పుడే ఎవర్నన్నా పంపి రాజీవుణ్ణి పిలిపించు. నా ప్రాణంపోయేలా వుంది" అని థర్మామీటర్ నోట్లో పెట్టుకున్నారు.

తోటమాలి పక్కపరిచాడు. రావుగారు థర్మామీటర్ తీసిచూసి ఒక పాయింట్ జ్వరం మాత్రం వుందని చూసుకుని చాలా నిరాశపడ్డారు.

"థర్మామీటర్ పాడయినట్టుంది. ఒంటిమీద వడ్లగింజవేస్తే పేలగింజయ్యేలా వుంది. అబ్బబ్బ ... చలిచలి" అంటూ రావుగారు తోటమాలిని తమ వైద్యుడి దగ్గరకి పరిగెత్తించారు.

"రామా...కృష్ణా...ఏమికష్టం వచ్చి పడిందిరా బాబూ..."అంటూ ఇంకాసే పట్లో రావుగారు పాటలుకూడా మొదలె ట్టారు.మధ్యలో పాటలాపిడాక్టరొచ్చాడా' అనడిగి మళ్ళీ పాటందుకుంటున్నారు.

తోటమాలి హడావుడిచూసి ఇంకేముంది రావుగారు కొనవూపిరితో వుండుంటారనీ, ఈసరికే కళ్ళు తేలేసివుంటారనీ అనుకున్నారు రావుగారి డాక్టరు.

తీరావచ్చి అక్కడ దృశ్యంచూస్తే- ఆయన తన మూలుగుతో, పాటలతో ఇంటిని అదరగొడుతున్నారు. జ్వరంతో రావుగారు మంచంమీదపడి మల్లయుద్ధం చేస్తున్నారు. రావుగార్ని చూసి డాక్టర్‌కి నవ్వొచ్చింది. ఆయన రావుగారి నాడి చూసి...

"ఈ కాస్తకే ఎందుకంత హడావుడి చేశారు?" అన్నారు.

వయసయ్యేకొద్దీ రావుగారికి రోగమన్నా, చావన్నా భయం పెరిగిపోతోంది. దగ్గొస్తే క్షయ, జలుబుచేస్తే న్యుమోనియా అనే ఆయన అభిప్రాయం. ఒకవేళ తను పోతే ఈ ఇంటినీ, ఇంత సంసారాన్ని ఎవరు చూసుకుంటారు - అన్నది ఆయన భయం. తన కోడి కుయ్యకపోతే తెల్లవారదనే ఆయన అభిప్రాయం.

ఇంకా తనకి మంచి భవిష్యత్తుందని, తనింకా ఏదో ఉద్ధరిస్తానని ఆయన నమ్మకం. అందువల్ల తమ లావాదేవీల గురించి పిల్లలకి ఏమాత్రం తెలియనియ్యలేదు.

రావుగారు మరణించాక పిల్లలు ఆయన పెట్టె పగలగొట్టి కాగితాల్నీ, పత్రాల్నీ చూసి ఎవరికెంత ఇచ్చారో తెలుసుకోవల్సిందే.

"మీ కాలంలో ... మీ కాలానికి..." ఇలాంటి మాటలువింటే రావుగారికి బలే కోపం వచ్చేది.

ఏభైయేళ్ళ కొడుకుని ఎదురుగా పెట్టుకుని, 'ఇదింకా నా కాలమే, మీకాలం తరువాతొస్తుంది' అనేసేవారు.

ఎలాగైనా పోనీ మనకెందుకు ఆ లావాదేవీల విషయం గురించింక కలగజేసుకోకూడదనుకున్నారు కొడుకులు.

"రామేగౌడముసలాడయిపోయాడుకదా! ఎప్పుడు పోతానో ఏమో అని అన్నీ

కొడుకు పేరిట రాసేశాడు పాపం" అన్నారు అక్కడికి తనింకా యవ్వనంలో వున్నట్టు. తనకీ, ఆ రామేగౌడకీ వయసొకటే అన్న సంగతి ఆయనకి గుర్తు రాదు. శివభక్తుడయినా ఆత్మలింగాన్ని అశ్రద్ధ చేస్తాడేమోగాని రావుగారు



మాత్రం పొరపాటునయినా తమ ఆరోగ్యాన్ని ఏమాత్రమూ నిర్లక్ష్యంచెయ్యరు. ఆరోగ్యానికి మంచిదని ఎవరేమి చెప్పినా చేసితీరవల్సిందే. ఆయన చేయదల్చుకున్నది చేసేదాకా మంచినీళ్లుకూడా ముట్టుకోరు.

రాజమ్మ పెళ్ళివారింటినుంచి వచ్చేసరికి రావుగారు మూల్గుతూ పడుకున్నారు. భయంకరమైన ఆ మూల్గుల మధ్య పాటలు! రావుగారి ధోరణి తెలిసిన రాజమ్మగారు ఆయన మూలుగులుచూసి బెదరలేదు. నుదుటిమీద చెయ్యివేసి జ్వరంలేదు, ఏంలేదు అనేశారు. భార్య కంటబడ్డాక మూలుగెక్కువయింది. అతి కష్టంమీద కళ్ళుతెరచి "ఎ..వ..రు?" అనడిగారు.



"నేను"

రావుగారు కళ్ళు చికిలించి-

"నేను అంటే ఎవరు?" అనడిగారు.

"నేను అంటే రాజమ్మని" అనేసి ఆవిడ బయటకెళ్ళిపోయారు. తన సంభాషణ ప్రేలాపనచూసి రాజమ్మగారు ఏడ్చి, మొత్తుకుని హడావుడి చేస్తారని అనుకుంటే, ఆవిడ అలా మాట్లాడకుండా బయటకి వెళ్ళిపోడంతో ఆయనకి చాలా నిరాశకలిగింది. రావుగారువేసే ఇలాంటి నాటకాల్ని లెక్కలేనన్ని చూసిన రాజమ్మ కొద్దిగానయినా బాధపడలేదు, భయపడలేదు.

ఆయన రాత్రి మూలుగులు, రాగాలు మొదలుపెట్టారు. పాటల మధ్యలో "మాలతి పెళ్లొక్కటి చేసేసి నేనేమయిపోయినా ఫరవాలేదు" అంటూ మొదలెట్టారు.

"ఏమీ ఫరవాలేదు. మాలతి పెళ్ళి నిక్షేపంలా మీ చేతుల్తోనే చేస్తారు" అని రాజమ్మగారు ధృవీకరించారు.

రావుగారి ఆర్భాటానికి అబ్బురానికి జ్వరం బెదిరి పారిపోయింది. జ్వరం తగ్గి పదిహేను రోజులయినా ఆయన ఒంటిమీద చెంబుడు నీళ్ళు పోసుకోలేదు. మంచం దిగలేదు. పచ్చిబాలింతరాలిలాగ మంచం మీదే సకల రాజోపచారాలూ స్వీకరించారు. ఆయన పడుకుంటే అందరూ ఆయన సేవలు చేయాలని అభిలషించే రావుగారు, ఇంట్లో ఇంకెవరికయినా ఒంట్లో బాగోకపోతే దూరం నుంచే యోగక్షేమాలు విచారించి మెల్లగా తప్పుకునేవారు.

రావుగారు కోలుకున్నాను అని స్వయంగా అభిప్రాయపడ్డాక మాలతి పెళ్ళికి ముహూర్తం పెట్టించారు. పెళ్ళి బట్టలు, నగలు, సామానులు అంటూ ఒకటికి నాలుగుసార్లు బజారుకు తిరిగేవారు.

రావుగారు ఆడపిల్ల పెళ్ళి చేయడం ఇదే మొదటిసారి. వచ్చిపడ్డ ఖర్చులు చూస్తుంటే ఆయనకి కంగారుగా వుంది. ఇంతవరకు మగపిల్లల తల్లిదండ్రులుగా మర్యాదలు పొందారేగాని, మగపెళ్ళివారికి మర్యాదలు చెయ్యాల్సిన అవసరం రాలేదు. ఎలా చెయ్యాలో తెలుసుకోనూ లేదు.

"రాజీ! బంగారం ధర మండిపోతోంది. ఎలాగే నగలు చేయించడం?" అంటూ ఆయన వాపోయేవారు.

"అలాగని మాలతికి చెయ్యవల్సిన దాంట్లో ఏదీ తగ్గడానికి వీల్లేదు" ఖచ్చితంగా చెప్పేశారు రాజమ్మగారు.

"అయితే నీకివ్వాల్సిన పాకెట్ మనీ ఇవ్వడం మానేస్తాను" అంటూ బేరం పెట్టారు రావుగారు.

ప్రతినెలా భార్యకి 'ఇంత' అని స్వంత ఖర్చుకి ఇచ్చేవారు రావుగారు. అదీ ఎంత అందంగా ఇస్తారంటే వేలకొద్దీ రూపాయలు ఎవరికో ఉదారంగా దానం చేస్తున్నట్టుగా గొప్పగా ఇచ్చేవారు.

ఆవిడకిచ్చే పది రూపాయల సొమ్మని ఇవ్వడం ఆపేసి ఈ నగల ఖర్చుని రాబట్టాలని ఆయన తాపత్రయం. మరెన్ని నగలు చేయించగలరో ఆ డబ్బులో.

రాజమ్మగారు ముక్కి మూలిగి రావుగారి ప్రతిపాదనకి ఒప్పుకున్నారు. కాని ఆవిడ తన తెలివితేటల్ని మరో విధంగా చూపించారు. తను కొన్న ప్రతి వస్తువుకీ బిల్లుని రావుగారి దగ్గరకి పంపించేవారు. మూరెడు పూలు కొనుక్కున్నా, నాలుగు గాజులు కొనుక్కున్నా ఆ అమ్మినవాళ్ళని





డబ్బులు అయ్యగారి దగ్గర తీసుకోమని పంపించేవారు. పది రూపాయలివ్వడానికి మొహం చూసుకున్న రావుగారికి ఇంకా నష్టం అయిందేగాని లాభం ఏమీ దొరక లేదు.

మాలతి పెళ్ళితో ఇంట్లో ఉత్సాహం, సంబరం నిండి ఇల్లు కళకళలాడుతోంది. వంటింటి పెత్తనం అంతా కోడళ్ళకి అప్ప చెప్పి రాజమ్మగారు బజారు పనులు చూసుకోసాగారు. పెళ్ళి బట్టలు కొన డానికి మాలతిని కూడా తీసుకెళ్ళారు. దుకాణాల్లో అందరికీ మాలతిని పరిచయం చేసి...

"ఈ అమ్మాయే మాలతి! నా ఒక్కగానొక్క కూతురు. ఇప్పుడు పెళ్ళి కుదిరింది ఈ అమ్మాయికే" అని రావు గారు గర్వంగా చెప్తుంటే మాలతి సిగ్గ పడింది.

పెళ్ళి దగ్గరపడేకొద్దీ రావుగారి హడా వుడి చెప్పనలవికాదు. ఊరికే ఏ పండగో పబ్బమో వస్తేనే ఇంట్లో హడావుడి పెట్టేసి మతి తోచకుండా చేసేస్తారు. ఇంక కూతురు పెళ్ళంటే తక్కువ హడావుడి చేస్తారా? పసుపు దంపడం దగ్గర్నుంచీ, నగల తయారీ వరకూ ఆయన పెత్తనం వుండాల్సిందే. ఆయన ఏకఛత్రాధి పత్యంగా ఏలేస్తుంటే రాజమ్మగారికి కొంచెం స్థిమితం దొరికినట్టేవుంది.

"చారుపొడి పదిసేర్లెందుకు? నాలుగు సేర్లు చాలు" అంటూ పొదుపు బోధించ బోయారు.

"మీరు వంటింటి విషయాల్లో కలగ జేసుకోకండి" అని రాజమ్మగారు నిక్క చ్చిగా చెప్పేశారు.

కూరలు, సామాన్లు ఏవేవి ఎన్నెన్ని కావాలో లిస్టు తయారు చేస్తుంటే రావు గారు ఇదింతెందుకు, అది అంతెందుకు అంటూ వంకలు మొదలెట్టబోయారుగాని, భార్య దగ్గర వారి పప్పులుడకలేదు. ఈ సందట్లో కూడా ఆయన గోధుమ అన్నం సాక్రిఫైస్ మర్చిపోలేదు.

రావుగారు కూతురి పెళ్ళిలో ధరించి తిరగడానికి తనకి కావల్సిన బట్టలవీ కొనుక్కున్నారు గాని, భార్యకి కొనడం గాని, నీకేమన్నా కావాలా? అని అడగ డంగాని పొరపాటు నయినా చెయ్యలేదు. కూతురి పెళ్ళి చిమంతలోపం కూడా లేకుండా చెయ్యాలనే సంభ్రమంలో వున్న రాజమ్మగారు దాన్ని గురించి పెద్దగా అనుకోలేదు. అయినా తనకి ఇలాంటి చీర తేలేదు, అలాంటి బట్టలు కొనలేదు అని అనుకోడానికి తనేమన్నా చిన్నపిల్లా? అని తనలో తనే సమాధాన పడ్డారావిడ.

రాజమ్మ తమ్ముడు పుట్టింటి చీర ఒకటి అక్కగారికోసం తెచ్చాడు.

పెళ్ళి ఇంట్లోనే చేద్దామనుకున్నారు. విశాలమైన ఇల్లు. ఏసత్రమూ దానికి సరిపోలదు. ఇంటిముందు పెద్ద పందిరి వేశారు. దీపాలమాలలు, తోరణాలు అన్నీ రావుగారు స్వయంగా దగ్గరుండి అలంక రింపజేశారు.

పెళ్ళికి రెండ్రోజుల ముందు, కలకత్తా నుంచి సుందరం, భార్య వచ్చారు.

సుందరం తండ్రి ఇంటికి వచ్చి సుమారు రెండేళ్ళపైగా అయింది. అందువల్ల ఈమధ్య అసలు మాలతిని చూడలేదనే చెప్పచ్చు. సుందరన్నయ్య వచ్చాడని తెలియగానే మాలతి బయట కొచ్చింది.

చెల్లెల్ని చూసి సుందర్ ఆశ్చర్య పోయాడు.

లావణ్యం, సౌందర్యం తొణికిస

లాడుతున్న మాలతిని చూసి "మాలతి ఎంత అందంగా తయారైంది" అనుకున్నాడు.

మామూలుగానే మాలతి బాగుంటుంది. ఇప్పుడు పెళ్ళికూతురికి అలంకారమైన నునుసిగ్గు ఆమె సౌందర్యాన్ని రెట్టింపు చేసింది.

శుభముహూర్తంలో సాలంకృత కన్య మాలతి మహేష్ భార్యగా మారింది. పెళ్ళిలో గంగా జలంతోటి మాలతిని మహేష్‌కి ధార పోస్తున్నప్పుడు రాజమ్మగారి కళ్ళల్లోంచి నీళ్ళూరాయి.

తమ శక్తికి మించి పెళ్ళి వేడుకలు జరిపించారు రావుగారు. ఇంట్లో అందరికీ మాలతి ఇంకా ఏడాదిపాటు ఇక్కడుంటుంది కదా అన్న సంతృప్తి ఉంది.

వియ్యాలవారు బయల్దేరే ప్రయత్నంలో వున్నారు. అప్పుడు మాలతి అన్నయ్య శివుడు మెల్లగా మహేష్‌ని అడిగాడు

"వెళ్ళేముందు మాలతితో మాట్లాడవా?" అని

మహేష్ తల వూపాడు. శివుడి రాయబారం ఫలించింది. మహేష్ మాలతి కోసం గదిలో ఎదురు చూస్తూ కూర్చున్నాడు. మాలతి సిగ్గుగా గదిలోకి వచ్చి నుంచుంది. మగ పిల్లలతో ఆటలాడుతూ, తిరుగుతూ బాతాఖానీ కొడుతూ వుండే మాలతికి సిగ్గు! ఆమె ఆడపిల్లలతోకంటే మగ పిల్లల సహవాసంలోనే ఎక్కువగా తిరిగింది. అన్నగార్లతో, అనంతంతో వాళ్ళని రెచ్చగొట్టి సరసాలాడే మాలతి మహేష్‌ని తల ఎత్తి చూడలేకుండా వుంది.

మగ రాయుడని పేరు తెచ్చుకున్న మాలతి మహేష్ ఎదురుగా అసలు సిసలు ఆడపిల్లలా నుంచుంది. మాలతిలాగే మహేష్‌కీ మొహమాటంగానే వుంది గాని, ఆ పిల్లని పలకరించాలన్న కోరిక అంత కంటే ఎక్కువగా వుంది.

"మాలతీ"

"......"

"మాలతీ వూరికి వెళ్ళొస్తాను. ఉత్తరం రాస్తాను, జవాబు రాస్తావు కదూ"

"......"

"నీకిష్టం లేకపోతే రాయనులే పోనీ"

మాలతి మృదువుగా అంది

"రాయండి"

మహేష్‌లో ఆనందం వుప్పొంగింది.

"జవాబు రాస్తావా?"

"ఊఁ..."

"మాలతీ...నువ్వెంతో బాగుంటావు. ఎందుకింత అందం నీకు?"

"మా అమ్మ నడగండి" అంది మాలతి మొగ్గవిచ్చినట్టుగా నవ్వి.

మహేష్ గట్టిగా నవ్వేశాడు.

"ఫరవాలేదే. నేనింకా నీకు మాటలు రావేమోననుకున్నా! సరేగాని మాలతీ..."

"ఏమిటి?"

"చిన్న పర్మిషనిస్తావా?"

"దేనికి?"

"ఒక చిన్న ముద్దివ్వడానికి"

మాలతిని అదేదో అందమైన స్వప్న లోకంలోకి తీసుకెళ్ళిపోయిందా ముద్దు! స్వప్నంలోంచి మెలకువలోకి వచ్చేసరికి మహేష్ అక్కడలేడు. మాలతి కళ్ళలో నీటి చలమలు.

ఏమిటీ చిత్రం! ఎప్పుడూ చూడనైనా చూడని పురుషుడిమీద ఈ కాస్త సమయంలో, ఈ కాస్త సాన్నిహిత్యంలో అమితమైన ప్రేమాభిమానాలు పుట్టుకు రావడం ఎలా సాధ్యం? ఎంత చిత్రం!

తల్లిదండ్రులు, అన్నగార్లకంటే ఇత డింతఎక్కువగా దగ్గరివాడైపోయాడేమిటి?

అన్నగార్లు లెక్కలేనన్ని కానుక లిచ్చేవారు. కాని ఈ అబ్బాయిచ్చిన చిన్న 'ముద్దు'కి ఇలా వశమైపోయిం దేమిటి తన మనసు!

అన్నదమ్ములు, వదినలు హాస్యం చేస్తున్నా లెక్కచెయ్యకుండా కన్నీళ్ళు నింపుకుంది మాలతి. ఆతర్వాత పెళ్ళికి వచ్చిన బంధువులతో కబుర్లు చెబుతూ తన విరహాన్ని మర్చిపోడానికి ప్రయ త్నించింది.

ఇన్నాళ్ళు చిన్నపిల్లల్తో కలిసిపోయి బాధ్యతారహితంగా తిరిగిన మాలతి ఇప్పుడు తల్లివెనుక, వదినెల వెనుక తిరు గుతూ కుంపటి అంటించడం దగ్గర్నుంచి ఊరగాయలకి ఉప్పుకారాలు ఎలా వెయ్యాలో వరకూ అన్నీ తెలుసుకుంది.

మాలతి శ్రద్ధచూసి వదినగార్లు ఆట పట్టించసాగారు, "మహేష్ రెండు చేతు లోనూ భోంచెయ్యటం నేర్చుకోవాలేమో" అని ఒకరంటే.

"మామగారు పిల్లకేపనీ చేతకాదని అన్నివిధాలా చెప్పినా మహేష్ ఎలా చేసు కున్నాడో మాలతిని" అని మరొకరు.

"బహుశా మాలతి కళ్ళుచూసి బుట్టలో పడిపోయుంటాడు"

"కాదు...రంగు చూసేమో"

"అబ్బే...ఆ వాలుజడచూసిఅందులో చిక్కడిపోయాడు చిన్నవాడు"

ఇలా సాగిపోయేవి చతురోక్తులు.

మహేష్ దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిం దంటే మాలతిని ఏడిపించో, లంచం అడిగోగాని అది ఆమె చేతికివ్వరు.

సరే...ఇక ఉత్తరం చేతికిస్తే ఆ అమ్మాయిని చదువుకోనీకుండా చుట్టూ చేరి పీక్కుతినేవారు.

"ఏం రాశాడు?"

"ఎప్పుడొస్తాడట?"

"వదిలిపెట్టి వుండలేకపోతున్నాడా?"

"నిన్నేమని వర్ణించాడు?" ఇలా కళ కళ్ళాడేది ఇల్లు.

## 6

...ఒంటరిగా పెరిగిన మంజు ఆ పిల్లల గుంపులో కలిసిపో లేకపోయాడు. వాడికి వారి కేకలు, గంతులు, దెబ్బలా టలు, కథలు–అన్నీ కొత్తే. వారి ఆటపాటల్ని నోరు తెరచుకుని చూసేవాడు. తనవంతు తిను బండారాలు వెంటనే తినేవాడు కాదు...

మెరుపు వెనుక వచ్చిన పిడుగులా వచ్చి పడింది రాజమ్మ చావు. అందర్నీ దుఃఖ సాగరంలో ముంచి అకస్మాత్తుగా పోయింది ఆవిడ.

కూతురి పెళ్ళి కోసమే బతికుందేమో అన్నట్లుగా, పెళ్ళయిన మూడు నెలల లోపునే బంధుకోటికి దూరమయింది రాజమ్మ.

ఆవిడ ఒక్కనాడయినా మూలగలేదు. మంచమెక్కలేదు. మరి అంతఆరోగ్యంగా తిరుగుతూ వుండిన రాజమ్మగారు మరణి స్తారని ఎవరూ అనుకోలేదు.

ఒకరోజు రాత్రి భోజనాలయ్యాక విశ్రాంతి తీసుకుంటూ రాజమ్మగారు పెద్ద కోడలిని, "సుశీలా! ఒకగ్లాసెడు నీళ్లతెచ్చి పెట్టు. కడుపులో అదోలా వుంది" అన్నారు.

సుశీల మంచినీళ్ళు తేడానికి వెళ్ళింది. అంతలో ఆవిడ అలా వెనక్కి ఒరిగి

పోతుంటే చూసిన మాధవుడు గబుక్కున వెళ్ళి పట్టుకున్నాడు. రాజమ్మగారు నోటి చివర్నుంచి నురగరావడం చూసి అతడు గదిలోకి పరుగెత్తాడు. ఇంజక్షన్ తెస్తుంటే ఆవిడ చిన్నగా నవ్వి ఒద్దు అన్నట్టుగా సైగచేశారు. ఆవిడ కనులు మూస్తుండగా కేశవుడు నీళ్ళు తాగించాడు.

అంతే!

తల్లిని పోగొట్టుకున్న మాలతి వ్యధ చెప్పనలవికాదు. అందరికంటే ఆఖరి సంతానం కావడంతో ఎన్నేళ్ళొచ్చినా ఆవిడ దగ్గర చిన్నపిల్లలా పెరిగింది మాలతి. తల్లిలేకుండా ఆఇంట్లో వుండటం దుర్భరంగా వుందిప్పుడు. ఆ దుఃఖపు తుఫానులో మెరుపులీగలా మహేష్ జ్ఞాపకం వచ్చి కొద్దిగా దుఃఖభారం తగ్గింది.

వియ్యాలవారికి టెలిగ్రాం ఇచ్చారు. పసుపు కుంకుమలతో ముత్తైదువగా మరణించిన వియ్యపురాలిని చివరిసారి చూడ్డానికి కొడుకుతో సహా వచ్చారువారు. మహేష్ మాలతికి కళ్ళతోటే ధైర్యం చెప్పాడు.

రావుగారు కన్నీళ్ళుకార్చే బంధువులకి ధైర్యం చెప్పారు.

"ఇంకా ఎన్నాళ్ళు బతుకుతుంది? చంటిపిల్లా ఏమన్నానా? అరవై రెండేళ్ళు రాలేదూ! ఎవరిచేతా చేయించుకునే స్థితి రాకుండా సుఖంగా వెళ్ళిపోయింది. అంతకన్నా ఏం కావాలట?"

ఆయన మాటలు, ధైర్యంచూసి అంతా ఆశ్చర్యపోయారు. ఆయన ధైర్యమంతా భార్య దేహాన్ని సాగనంపేటప్పుడు గాలికెగిరిపోయింది.చంటిపిల్లాడిలావెక్కివెక్కి ఏడ్చారు.

కేశవుడు రాజమ్మగారి నగలన్నీ తెచ్చి రావుగారి చేతిలో పెట్టాడు. అవి చూసి ఆయన దుఃఖం పెరిగింది.

రావుగారు స్వభావతః ఏఖర్చుకీ ఇష్టపడని మనిషి. ఏనాడూ నగానాణ్యం ఆయనే స్వయంగా చేయించిన పాపాన పోలేదు. ఆవిడే, ఇంత పెద్ద లాయరుగారి పెళ్ళాం ఒంటిమీద కాసంత బంగారమైనా లేకుండా తిరగడమేమిటని నానా గోల చేసి, పట్టుబట్టి ఒక్కొక్కటి చేయించుకున్నారు.

ఆయన డబ్బు దండగ అని మూలిగినా, ఆవిడ ఏడ్చి, మొత్తుకుని అన్నీ చేయించుకున్నా అన్నీ ఆయనకే మిగిల్చిపోయారావిడ.

భార్య మరణం అనే పెనుగాలివల్ల రేగిన వైరాగ్యపు ధూళి మెల్లగా కరిగి మాయమవసాగింది.

రావుగారి వేదాంత గ్రంథాలన్నీ మూలకిచేరి, మళ్ళీ 'డయాబిటిస్' 'కన్ను-దాని సంరక్షణ', 'వృద్ధాప్యాన్ని నిరోధించడం ఎలా?' పుస్తకాలు ఆయన చేతుల నలంకరించాయి.

కొత్తిమీర బేరం చేయడం దగ్గర్నుంచీ కట్టెలు కొట్టించడం వరకూ ఆయన కలగచేసుకోవడం మొదలయింది.

రాజమ్మగారి నగలు కూతురికీ, కోడళ్ళకీసమానంగాపంచి ఇచ్చెయ్యాలన్న ఆలోచన మారిపోయి, వాటిని అమ్మేసి ఆ డబ్బుని వడ్డీకి తిప్పాలన్న వ్యాపార ధోరణి వచ్చేసింది. ఆ పనే చేశారు కూడా. నగలమ్మిన డబ్బు చూసుకుని ఆయన సంతోషం ఇంతా అంతాకాదు.

రావుగారు చేసినపని తెలిసి కోడళ్ళకి కోపం వచ్చింది. మాధవుడి భార్య కొంచెం దురుసు. ఏదయినా మొహంమీద అనేస్తుంది.

"నగలు అమ్ముకోవల్సినంత దరిద్రం




ఏమొచ్చింది? ఇంట్లో ఇంతమంది ఆడ పిల్లల్ని పెట్టుకొని నగలమ్ముకుంటారా ఎవరన్నా? అసలు చెయ్యేలా వచ్చిందని? మళ్ళీ బంగారం కొనాలంటే మాటలా?"

కమల మాటలు విని రావుగారు బిత్తర పోయారు. తను ఇంటికి పెద్ద, సర్వాధికారి. తన మాటకి, చేతికి ఎదురుండదని ఆయన గాఢనమ్మకం.

"నా భార్య నగల్ని అమ్ముకునే అధికారం నాకులేదా?"

"లేదు" కోడళ్ళంతా ఏకగ్రీవంగా తీర్మానించారు.

"వాటిని జాగ్రత్తగా ఎవరు చూసుకో గలరులే అని అమ్మేశాను" అన్నారు నంగినంగిగా.

"ఇంతమంది పిల్లలున్నాం ఆమాత్రం బంగారాన్ని జాగ్రత్త చేసుకోలేమా?" అని ప్రతిఘటించింది కమల.

"కావాలంటే కొనుక్కోవచ్చులే" ఈ సంభాషణ ఎలాగో అలా ముగిస్తే చాలని అన్నారాయన.

"బంగారం కొనడం నోటితో చెప్పి నంత సులువు కాదు" అనేసి వెళ్ళి పోయింది కమల.

కమల మాటలకి రెండురోజులు బాధపడ్డా మూడవనాటినుంచి, రావుగారిని మిగతా విషయాలేమీ బాధించలేదు.

తల్లిపోయాక ఆ ఇంట్లో వుండటం ఎలా అనుకున్న మాలతిని అన్నగార్లు, వదినగార్లు చూపించే వాత్సల్యం, ప్రీతి ఏ కొరత లేకుండా కాపాడాయి. తల్లిని తల్చు కుని అప్పుడప్పుడు దుఃఖంలో మునిగి పోయేది. అప్పుడు పదిమంది సహృద యంతో ఆమెని ఓదార్చేవారు. అందరూ మాలతి మనసుని తల్లివేపునుంచి మహేష్ వేపు తిప్పడానికి ప్రయత్నించేవారు.

రావుగారు మాలతి యోగక్షేమాలు తరచు కనుక్కునేవారు.

"మాలతీ...భోంచేశావా? మహేష్ ఉత్తరం రాశాడా? ఎందుకలా చిక్కిపోతు న్నావు?" అని కూతురి యోగక్షేమాలు కనుక్కుని, తృప్తికరమైన జవాబు వచ్చాక వూరుకునేవారు.

మహేష్‌నుండి ఉత్తరం రావటం ఒక్క రోజు ఆలస్యమయినా, రావుగారు కూడా మాలతిలాగే బెంగపెట్టుకునేవారు. ఏనాటి కయినా తానా ఇంటి ఆడపడుచు అన్న భావన మాలతికుంది. భర్త ఇంటికి వెళ్ళే వరకూ తానీ ఇంటి అతిథి. అందువల్లే అందరూ తననింత అభిమానంతో చూసు కుంటున్నారన్న అభిప్రాయం ఆమెది. పుట్టింట్లో వుంటూ భర్త ఇంటి గురించి కలలు కనేది.

కొన్ని నెలల అనుభవంతో మాలతి ఇంటిపనులు, వంటా వార్పుల్లో ప్రావీణ్యం సంపాదించింది. కమలక్కకన్నా బాగా కేక్ చేయడం నేర్చుకుంది.

కొత్త సంసారంలో అడుగు పెడు తున్న ఆడపిల్ల నేర్చుకోవాల్సిన పనులు నేర్చుకోవడంతోబాటు మాలతి రావుగారి యోగక్షేమాల బాధ్యత తీసుకుంది.

రావుగారి పథ్యపు భోజనం తయారు చేయటం, ఆయనకు వేళకు సరిగ్గా మందు లివ్వటంలాంటి పనులు మాలతి తీసుకుంది. మాలతిమీద రావుగారు ఎంత ఆధారపడే వారంటే, మాలతి కాపురానికి వెళ్ళిపోతే తనకు రోజులెలా గడుస్తాయి అని బెంగ పెట్టుకునేవారు.

రావుగారి అన్ని ఆలోచనల్నీ పక్కకు నెట్టింది ఓ అపరిచితుడి వుత్తరం.

ఓరోజు రావుగారు ఉదయం కోకో తాగి న్యూస్‌పేపర్ చదువుతూండగా



ఆయన పేరిటున్న ఓ కవర్ను తెచ్చి ఇచ్చాడు పోస్ట్‌మాన్. వియ్యాలవారి ఉత్తరం వచ్చిందేమో అనుకుంటూ విప్పారాయన. ఆ వుత్తరం చదివేసరికి కుతూహలం, ఆశ్చర్యం చోటుచేసుకున్నాయి ఆయనలో. ఆ వుత్తరం మళ్ళీ మళ్ళీ చదివారు ఆయన.

శ్రీ అనంతరావుగారూ,

రాజమ్మగారు పరమపదించిన విషయం తెలిసి చాలా బాధ కలిగింది. భగవంతుడి

నిర్ణయం ముందు మనందరం ఎంతటి వాళ్ళం? మీరు ధైర్యం తెచ్చుకుని మిగిలిన వారికి కూడా ధైర్యం ఇవ్వాలి. సుఖంగా బతికి, సుమంగళిగా చనిపోయిన ఆమె చావుకి విచారిస్తే ఆమె ఆత్మకు శాంతి కలగదు.

ఈ పరామర్శ తర్వాత ఈ విషయం ప్రస్తావిస్తున్నానని మీరు తప్పుగా భావించకండి. నాకు మీ పరిచయం లేకపోయినా, మిమ్మల్ని నేను చాలామార్లు చూశాను. కాలేజీకి వెళ్ళే తోవలో మీరు స్నేహితులతో తిరుగుతూవుండటం నేను చూశాను. మీకు పెళ్ళి చేసుకునే ఉద్దేశం వుంటే, నా పదహారేళ్ళ కూతుర్ని మీకిచ్చి వివాహం చేదామనే ఉద్దేశం నాకుంది. దైవానుగ్రహం



వుంటే అది కార్యరూపంలో పెట్టవచ్చు. మీకు వివాహం చేసుకునే ఆలోచనవుందని నా మిత్రులు తెలిపారు. ఈ కింద తెలిపిన అడ్రసుకు తాము జవాబురాస్తే నేను వచ్చి స్వయంగా మీతో మాట్లాడుతాను.

ఇట్లు, యస్.వి.రావ్".

రావుగారు ముందు కంగారుపడ్డా, తర్వాత తమగురించి గర్వపడ్డారు. తమకు పదహారేళ్ళ పిల్లను ఇవ్వటానికి బయలు దేరినవారెవరు? డబ్బుమీద ఆశకొద్దీ అలా రాశారా? లేదా తమని చూసే ఏ భైవేళ్ళే వుంటాయనిఅనుకున్నారా?-రావుగారికేమీ అర్థంకాలేదు.

లేచి వెళ్ళి నిలువుటద్దం ముందు నిల్చు న్నారు. ఈ కాలం కుర్రాళ్ళకు లేని శరీరధార్ఢ్యం, ఠీవి రావుగారిలో వుంది నిజమే. కళ్ళలో మునుపటి మెరుపులేదు. కాని వాటిలో తీక్షణత ఏమాత్రం తగ్గలేదు. ఎంతోమంది తమవయస్సులోని వారు పెళ్ళి చేసుకుంటారు.

వెంటనే రావుగారు ఉత్తరాన్నితీసి టేబుల్ డ్రాయర్లో పెట్టారు. ఎవరయినా తమను వేళాకోళం చేయటానికి ఉత్తరం రాస్తే ఈ వ్యవహారం ఇక్కడితో ఆగు తుంది. ఒకవేళ వారి మనస్సులో నిజంగా ఆ అమ్మాయినిచ్చి పెళ్ళిచేయాలనే ఉద్దేశం వున్నట్టయితే, మళ్ళీ ఉత్తరం వస్తుంది- అనుకుని రావుగారు వూరుకున్నారు.

రావుగారికి అప్పుడప్పుడూ ఆ ఉత్తరం జ్ఞప్తికొచ్చేది. కాని మళ్ళీ ఉత్తరం రాలేదు. ఆయన దాని గురించి పూర్తిగా మర్చి పోబోతూండగా ఓరోజు ...

అనంతుడు కాలేజీనుండి వస్తూనే, ''మాలీ" అని కేకపెడ్తూ వచ్చాడు. ఏదయినా ప్రత్యేకమైన విషయం వుంటే అలా కేకపెట్టటం అతనికలవాటు.

మాలతి రావుగారికి కంట్లో మందు వేస్తోంది. 'మాలీ' అంటూ అక్కడికే వచ్చాడు. ఏమిటయిందనిఅడిగినమాలతికి, "ఇవాళ భలే తమాషా అయింది తెలుసా?" అంటూ పెద్దగా నవ్వసాగాడు.

"ఏమిటయిందో చెప్పకూడదా ... అలా నవ్వకపోతేనూ?"

"ఇవాళ కాలేజీకి నన్ను వెతుక్కుంటూ వచ్చారెవరో! ఆయనకు పెళ్ళీడుకొచ్చిన అమ్మాయి వుందిట. హ...హ్హా ... ఆయనకెవరో చెప్పారుట నేను పెళ్ళి చేసు కుందామనుకుంటున్నానని. ఆయన రాసిన లెటర్కి జవాబు రాయలేదేమని అడిగారు. మాలీ....నాకు పెళ్ళిట" పక్కలు పట్టు కుని నవ్వుతున్నాడు అనంతుడు.

"దాన్లో ఏముంది? ఎందుకు చేసుకో కూడదు?" అనడిగింది మాలతి.

"మాలీ ... నాకెన్నేళ్ళో తెలుసా? చదువు పూర్తవటానికి ఇంకా ఓ ఏడు వుంది తెలుసా?"

"నువ్వు నాకన్నా అర్నెల్లు పెద్ద వాడివి. ఏడ్నెల్ల క్రితమే నాకు పెళ్లికాలేదా? నువ్వూ చేసుకోవచ్చుగా!"

"అరె, నువ్వు ఆడపిల్లవు. నీ విషయం వేరు. ఇరవైఏళ్ళ కుర్రాడికి పెళ్ళేమిటి?" అని మళ్ళీ నవ్వసాగాడు.

తమకు పెళ్ళీడుకొచ్చిన మనవడు ఉన్నాడు! అయితే తాము నిజంగానే ముసలివారయినట్టేలెక్క-అనుకుని రాత్రి ఆ వుత్తరంతీసి చింపిపారేశారు. అప్పట్లో జవాబు రాయనందుకు చాలా సంతో షించారు. ఒకే పేరున్న వారిద్దరు ఇంట్లో వుంటే ఇదే ప్రమాదం అనుకున్నారు.

ఓ సాయంకాలం మాలతి స్నేహితు రాలింటికి వెళ్దామని అద్దంముందు కూర్చుని తయారవుతూండగా, అద్దంలో




కనిపించిన మొహాన్ని చూసి ఆశ్చర్యంతో వెనుదిరిగింది.

"మీరెప్పుడు వచ్చారు?" అంది.

"ఇప్పుడే" అంటూ ఆమెను దగ్గరకు తీసుకుని ముద్దాడాడు. అతడి కౌగిలినుంచి తీయటపడ్డాక, "ఎవరయినా చూస్తే" అంది తడబడుతూ. కాని మహేష్ తలుపులు దగ్గరకు వేసుకునే జాగ్రత్తపడి వచ్చాడు.

"కాఫీ, టిఫిన్ తెస్తాను" అని బయటకు వెళ్ళబోయిన మాలతిని ఆపి, "నాకిష్టమైన టిఫిన్ తెస్తావా?" అనడిగాడు మహేశుడు.

"ఏమిటది?" కుతూహలంతో అడిగింది మాలతి.

చిలిపిగా నవ్వుతూ మహేష్, "ఆ తియ్యటి టిఫిన్ పేరు మాలతి" అన్నాడు.

"అవునట. దాన్ని 'మహేష్' అనే కారం టిఫిన్‌తో కలిపి తింటే రుచిగా వుంటుందట" అంది మాలతి.

"ఏదీ ... తినిచూస్తాను" అంటూ పట్టుకోబోయిన భర్త చేతినుండి తప్పించుకుని బయటకు వెళ్ళింది మాలతి.

అపురూపంగా వచ్చిన అల్లుడికి సకల మర్యాదలూ చేశారు. మాలతిని షికారుకు తీసికెళ్ళిన మహేశ్ ఆమెకు తానువచ్చిన కారణం చెప్పాడు. తన ముఖ్య స్నేహితుడి పెళ్ళికి మద్రాసువెళ్తూ మాలతిని తనతో తీసుకునివెడితే బాగుంటుందని వెంచి వచ్చాడతను. మాలతికి నచ్చిందతని ఆలోచన. మాలతి అన్నలకేమీ అభ్యంతరం కనిపించలేదు. కాని రావుగారు మాత్రం "మంచిరోజు చూసి పంపుతాను! మొదటిసారి అమ్మాయిని పంపేటప్పుడు వారం వర్జ్యం చూడకుండా ఎలా పంపను?" అనేశారు.

మాలతికీ, మహేశుడికి చాలా నిరాశ కలిగింది. వెళ్ళేముందు నేను మద్రాసు నుండి తిరిగి వెళ్ళేటప్పుడు తప్పకుండా వస్తాననే వాగ్దానం తీసుకుని మహేషన్ని మద్రాసు పంపింది మాలతి.

* * *

అలా మద్రాసుకు వెళ్ళిన మహేశుడు మళ్ళీ వెనక్కిరాలేదు. అతడికోసం ఎంతో ఆతురతతో ఎదురుచూసున్న మాలతి చేతికివచ్చింది మహేశుడి స్నేహితుడిచ్చిన టెలిగ్రాం.

"సముద్రంలో ఈతకు వెళ్ళిన మహేశ్ సముద్రంలో మునిగిపోయాడు"

అది చదివి ఏమీ అర్థంకాక అన్నయ్య చేతిలో పెట్టింది మాలతి "కేశవన్నయ్యా ఇదేమిటిది చూడు" అంటూ. అరగంటలో నందగోకులంలా కళకళలాడుతున్న ఇల్లు శ్మశానంలా తయారయింది. వార్తవిని మూర్ఛపోయిన రావుగారింకా తేరుకోలేదు. కేశవుడు, మాధవ్ వెంటనే మద్రాసు బయలుదేరారు. మాలతి టెలిగ్రాం నమ్మలేదు. అన్నలతో మహేశ్ వెనక్కి వస్తాడనే దృఢంగా నమ్మింది. కాని వారు ఇద్దరే తిరిగి వెనక్కి వచ్చాక ఇంక నమ్మక తప్పిందికాదు. అప్పుడు ఆమె కనిపించింది వొకటే.

"నేను ఆయనతో మద్రాసువెళితే ఈతకు సముద్రంలోకి వెళ్ళనిచ్చేదాన్ని కాదు."

రావుగారికీ అదే అనిపించింది. మాలతిని ఆపి మృత్యువుని అతడికి తోడుగా పంపానే అని విలపించాడు ఆయన.

కొడుకుచావు, కూతురి వైధవ్యం కన్నా మించిన బాధ కన్నవారికి మరోటి లేదు. మనిషిమీద దెబ్బలేయదల్చుకుంటే విధికి ఇంతకన్నా సున్నితమైన చోటు మరోటిలేదు. అన్నేళ్ళు తనతో కాపురం

చేసిన భార్య చనిపోతే ముత్తైదువగా ఆమె చనిపోయిందని తృప్తిచెందిన రావుగారు ఇప్పుడు కూతురిస్థితికి పూర్తిగా చలించి పోయారు. ఇరవైఏళ్ళ ప్రాయంలోనే కూతురు అన్ని సుఖాలకు దూరమై పోయిందన్న ఆలోచననే భరించలేక పోయారు.

జీవితంలో మొట్టమొదటిమారు రావు గారు ధీమా, ధైర్యం కోల్పోయారు.

కన్నీటిపూట ఇగిరిపోయాక మేల్కొంది మాలతి. ప్రేమించే అన్నలు పదిమంది, కొండంత తండ్రీ వున్నా ఆమెకు తాను ఏకాకి, తన వారంటూ ఎవరూ లేరన్న భావన వచ్చింది. అందరి మధ్యలో వుంటూకూడా ఆమె తన దుఃఖసాగరంలో మునిగిపోయింది. కాపు రానికి వెళ్ళాలి, అన్నిపనులూ నేర్చుకో వాలి, అన్న ఉత్సాహంతోవున్న మాలతి ఇప్పుడు, తాను ఏమయినా ఎందుకు నేర్చుకోవాలి, ఎవరైనా ఓ పూట అన్నం పడేస్తే తన రోజులు గడిచిపోతాయి అన్న అభిప్రాయానికి వచ్చింది.

ఆమె దుఃఖభారం కొంచెం తగ్గాక, ఆమెకేదయినా వ్యాపకం కల్పించాలన్న నిర్ణయానికి ఆమె అన్నలు వచ్చారు. ఎవరూ ఆమెను ఒంటరిగా వదిలేవారు కాదు. సినిమా అని షికారని ఆమెను బయలుదేర దీసేవారు. శివుడు తన కవితలుచదివి వినిపించేవాడు. అతడి కవితల్లో మాలతికి ఏలోపమూ కనిపించేది కాదు. కాని ఆమెకు దేనిలోనూ ఆసక్తే వుండేదికాదు. ఒంటరిగా కూర్చుని తన పరిస్థితి గురించి ఆలోచించేది.

ఇంతకీ ఈ ఇంట్లో తన స్థానం ఏమిటి? తలచెడిన కూతురు తండ్రీ, అన్నల ఆశ్రయంలో వుండాల్సిందేకదా? ఇంట్లో పెద్దవారు దయదల్చి నాలుగు మెతుకులు పడేస్తే తన జీవితం గడు స్తుంది. అలా ఎన్ని రోజులు? వారిమీద ఆధారపడిన తనమీద విసుగు పుడితే తన గతేమిటి? మహేశుడులేని అత్తగారింటికి వెళ్ళటం అసంభవం. ఈ ఇంట్లో ఎవరినీ సాధ్యమయినంత వరకూ నొప్పించకూడదని నిశ్చయించుకుంది.

కుంకుమలేని మాలతి మొహం చూడ లేక రావుగారు ఆమెను తప్పించుకు తిరిగేవారు. పైగా మహేశుడిచావుకి తామే కారణమేమోనన్న భావం ఆయన్ను వెంటాడేది. చాటునుండే మాలతి యోగ క్షేమాలు కనుక్కునేవారు.

ఇన్నేళ్ళుగా ఆయన తప్పించుకున్న వృద్ధాప్యం ఇక ఆయనమీద ఒక్కమారే పడిపోయింది. ఒళ్ళంతా ముడతలుపడ సాగింది. పళ్ళుకూడ కదలసాగాయి. అసలే నొప్పికి తట్టుకోలేని రావుగారు చీటికిమాటికి అందరిమీద ఎగరసాగారు. కొడుకులూ, కోడళ్లు, మనవలూ అందరూ ఆయన్ని తప్పించుకుని తిరగసాగారు. ఒక్క మాధవుడు మాత్రం ఆయనతో ధైర్యంగా మాట్లాడేవాడు.

వేసంగి సెలవులయ్యాక మళ్ళీ కాలేజీలు తెరిచే వేళకు మాలతి అన్నయ్యలు ఆమెను మళ్ళీ కాలేజీలో చేర్పిద్దామన్న నిర్ణయానికి వచ్చారు. మాలతి చిన్నపిల్ల. ఇలానే ఇంట్లో నిరాసక్తితో జీవితం గడ పడం మంచిదికాదు. కాలేజీలో చేరి నలుగురితో కలిసిమెలిసి తిరిగితే కాస్త చైతన్యం మళ్ళీ రావచ్చు ఆమెలో-అన్నది వాళ్ళ అంచనా.

కాని పిల్లిమెడలో గంటకట్టేవారెవ్వరు? ఎన్నో విషయాల్లో అత్యాధునికమైన భావాలున్న రావుగారు కొన్ని విషయాల్లో

మొండిపట్టుపట్టేవారు. ఆయనతో వాదిం చాలంటే జంకు ఇంట్లోవారందరికీ. ఆఖరికి మాధవుడు సిద్ధపడ్డాడు. ఓరోజు రాత్రి భోజనాలయ్యాక ఆయన దగ్గరకు వెళ్ళి కూర్చుని ఆమాటా ఈమాటా చెప్తూ, "శివుడూ, అనంతం ఇద్దరి చదువూ పూర్తయింది. అనంతుడు కలకత్తాలో సుందరం పనిచేస్తున్న కంపెనీలోనే ఉద్యోగంకోసంప్రయత్నిస్తానంటున్నాడు. శివుడేం చేస్తాడో తెలీదు"

"సరే" అన్నారు రావుగారు.

"మాలతిని కాలేజీలో చేర్పించాలని మేమందరం నిర్ణయించాం"

"ఏం... మీరింతమంది అన్నలుండి మాలతి ఒక్కదాని బాధ్యతతీసుకోలేరా?" కటువుగా అన్నారు రావుగారు.

"ఏం నాన్నా! మీరు మాట్లాడుతున్నది మాలతిని పోషించలేక మళ్ళీ చదువులకు పంపుతున్నామనా? ఇంట్లో కూర్చుని ఏం చెయ్యాలది? ఏం వ్యాపకమూ లేకపోతే కాలం గడవటం ఎలా?''

"ఏం...ఇప్పుడు పొద్దుపోవటంలేదా? పైగా డిగ్రీ తీసుకుని అదేమైనా ఉద్యోగాలు చెయ్యాలా, ఊళ్ళేలాలా?"

''డిగ్రీ తీసుకున్నాక మాలతి ఏం చెయ్యాలి అన్నది ఇప్పుడు అప్రస్తుతం. ముందు కాలేజీలో చేరి చదువుకోనీ"

''మీకందరికీ అది బరువైతే అలానే చేర్పించండి''

మాధవుడు మరి మాట్లాడలేదు. మాలతి దగ్గర ఆ మాటెత్తితే వెంటనే, ''నాన్నగారేమన్నారు?" అంది.

"ఆయనకేమో నువ్వు చదువుకోవటం ఇష్టంవున్నట్టులేదు''

"ఆయన కిష్టంలేనప్పుడు నేనెలా చదువుకుంటానన్నయ్యా?''

మాధవుడికి చాలా కోపం వచ్చింది.

''మాలీ! నువ్వేం చిన్నపిల్లవుకాదు. నీ పరిస్థితేమిటో నీకు తెలుసు. నీ జీవితం గురించి కొంచెం ఆలోచించు. నాన్న గారిష్టప్రకారం. చేస్తానని అనకు. నీ విషయం నువ్వే నిర్ణయించుకోవాలి"

మాలతి చాలాశాంతంగా, "అన్నయ్యా! ఇకమీదట ఎలాగైనా నేను మీ అందరి మీదా ఆధారపడి జీవించాల్సినదాన్నే. మీరు చెప్పినట్లు నడచుకోవటమే నా కర్తవ్యం'' అంది.

మాలతి మాటలకు నొచ్చుకుని మాధవుడు, ''ఏం మాట్లాడుతున్నావమ్మా నువ్వు? అప్పుడే పరాయిదానివి అయిపోయావా?" అన్నాడు.

అన్నయ్య మనస్సు నొప్పించినందుకు బాధపడుతూ మాలతి, ''తప్పుగా భావించకు మాధవన్నాయ్! నువ్వెలా చెప్తే అలా వింటాను. నేను చదువుకోవటం నీకన్నివిధాలా మంచిదనితోస్తే అలాగే చదువుకుంటాను. కాని అలాగని నాన్నగారి మనస్సు నొప్పించలేను''

మాధవుడు సంతోషంగా, "నాన్న గార్ని వొప్పించే పని నాకొదిలేయి" అన్నాడు.

ఆ రకంగా మాలతి చదువు మళ్ళీ మొదలయింది. ఎస్సెల్సీ అయినప్పటి నుండీ ఇంట్లోనే కూర్చున్న మాలతికి మళ్ళీ కాలేజీకి వెళ్ళాలంటే సిగ్గనిపించింది. అందరూ తన్నే చూస్తున్నారనిపించింది. కాలేజీలో చేరిన కొత్తలో ఎవరితోనూ మాట్లాడేదికాదు. వేళకు సరిగ్గా వెళ్ళటం, క్లాసుల్లో కూర్చుని పాఠాలు విని, తిన్నగా వెనక్కిరావటం-ఇదీ ఆమె దినచర్య.

కాని పదిమంది చేరేచోట మౌనంగా ఎంతకాలం గడపగలదు? పైగా ఆమె

తోటిపిల్లలు మాటకారితనంవున్నవారు. రాయినైనా మాట్లాడించగల సమర్థులు. మాలతిని వదుల్తారా? మాలతి ఎంత వద్దనుకున్నా వారు తమ స్నేహబంధంలోకి, మాటల్లోకి ఆమెను లాగేవారు.

ఏ వాతావరణానికైనా సులభంగా అలవాటుపడే లేత వయసులోవున్న మాలతి చాలా త్వరగా కాలేజీ వాతావరణంలో ఇమిడిపోయింది. ఆమె మళ్ళీ అన్నీ మర్చిపోయి స్వచ్ఛంగా నవ్వసాగింది.

అయినా ఎప్పుడైనా పాతరోజులు గుర్తొస్తే మబ్బు కమ్మిన చంద్రుడిలా కళ తప్పేది ఆమె మొహం. మళ్ళీ మామూలు మనిషి కావటానికి చాలా సమయంపట్టేది. అలాంటప్పుడు, తాను బాగా చదువుకుని తనలా అసహాయులైన స్త్రీలకు సహాయం చేసినట్టు కల కనేది. ఆ కల సహాయంతో మళ్ళీ ఉత్సాహం పుంజుకునేది. దానికి ఆమె అన్నలుకూడా శాయశక్తులా సాయం చేసేవారు.

మాధవుడికి మాలతి తనలాగే వైద్య వృత్తిలోకి చేరాలని కోరికుండేది. శివుడికి ఆమె సాహిత్యంలో డిగ్రీ తీసుకుని తన లాగానే ఉపాధ్యాయురాలు కావాలని వుండేది. కాని ఎవరూ ఆమెమీద తమ అభిప్రాయాన్ని రుద్దేవారుకాదు.

మాలతి కాలేజీలో చేరిన కొత్తలో రావుగారు ధుమ ధుమ లా డు తు న్న మొహంతో నలుగురికీ వినిపించేలా, ''ఈ ఇంట్లో ఎవరికీ నేనంటే లెక్కలేదు. నేనెక్కడికీ పోలేను. కనుక ఇక్కడే మగ్గిపోవాలి'' అని గొణుక్కుంటూ తిరిగారు. ఆమె కాలేజికి వెళ్ళేముందురోజుకూడా-

''మాలతీ! కాలేజీలో చేర్తావామ్మా? ఇంతమంది అన్నలుండీ, నిన్ను పోషించలేక మళ్ళీచదువులో పెడుతున్నారు. నువ్వు చదువుకుని ఉద్యోగంలో చేరటాన్ని చూడటానికే నేను బతికుంటాలామ్మా'' అని అడిగారు దీనంగా. కూతురు అల్లుడితో సుఖంగా కాపురం చేయటాన్ని చూడాలని తహతహలాడిన ఆయనకు ఈనాడు అదే కూతురు మరో దారిలేక ఉద్యోగంచేసే మహిళల్లో ఒకతి అవుతుందన్న ఆలోచన సహించరానిదిగా కనపడింది. మాలతి అప్పటికీ ఆయన్ను ఎంతో ఓదార్చడానికి ప్రయత్నించింది.

''నాన్నా...నన్ను పోషించలేకకాదు వాళ్ళు నేను చదువుకోవాలి అంటున్నది. నా దుఃఖం కొంచెం తగ్గాలన్నదే వారి కోరిక. నువ్వు మరోలా అనుకోకు''

కాలేజిలో చేరిన కొద్దిరోజుల్లోనే మాలతిలో వచ్చిన మార్పు గమనించారాయన. ఎప్పుడూ శూన్యంలోకి చూసే మాలతి కళ్ళు ఇప్పుడు చదువు గురించి మాట్లాడుతూ మెరవటాన్ని గమనించారు. చీరలు కట్టుకోవటంలో, అలంకరించుకోవటంలో మునుపున్న ఉదాసీనత మాయమయి, నలుగురిలో కలిసిపోయి జీవించడానికి ప్రయత్నించేది. జరిగిన దాన్ని తల్చుకుని బాధపడుతూ కూర్చోవటంకన్నా అయిందేదో అయిపోయింది, ఉన్నదానితో తృప్తిపడటం నేర్చుకోవాలి- అన్న అభిప్రాయం ఆమెలో నెలకొనసాగింది. లేత మొలకను ఎక్కడ నాటినా వేళ్ళూనుతుంది.

కాలేజిలో ఆమె రెండేళ్ళు గడిపేసరికి మాలతి నవ్వు ఇంట్లో మళ్ళీ వినిపించసాగింది. పెళ్ళికి ముందు ఆమెలో వున్న ముగ్ధత్వం మాయమయింది. పెళ్ళయిన కొత్తల్లో వున్న నునుసిగ్గుకూడా అదృశ్యమయింది. ఆత్మాభిమానం,ఆత్మవిశ్వాసపు కాంతిలో కొత్త మాలతి జన్మఎత్తింది.




* * *

శివుడు లెక్చరర్‌గా ఉద్యోగంలో చేరాడు. అతడి సాహిత్యోపాసన నిరంతరంగా సాగుతూనే వుంది. అతడి కవితలు అప్పుడప్పుడూ పత్రికలో కనిపిస్తున్నాయి. ఇప్పటికీ అతడి మొదటి విమర్శకురాలు మాలతి. కాకపోతే ఇప్పుడు శివన్న రాసిందంతా బాగుంది అనటంలేదు. అలాకాదు, ఈమాట బాగాలేదక్కడ-అని సరిదిద్దేది. రెండేళ్ళలో మాలతిలో వచ్చిన మార్పు చూసి శివుడు ఆశ్చర్యపోయేవాడు.

మాలతి ప్రోత్సాహంతోనే శివుడు కథలు, నాటకాలు కూడా రాశాడు. కాలేజి వార్షికోత్సవానికోసం ఓ నాటకం రాసి దాన్లో నాయకుడి పాత్ర కూడా వేశాడు.

అప్పుడే అతడికి జయంతి పరిచయమయింది. జయంతి బి.ఎ. విద్యార్థిని. అప్పటికే కొన్ని నాటకాల్లో నటించి పేరు తెచ్చుకున్న ఆమె సహజంగానే ఈ నాటకంలో నాయిక పాత్ర ధరించింది. నాటకం రిహార్సల్స్‌లో తప్పనిసరిగా వారిద్దరి పరిచయం ఎక్కువ అయింది. జయంతి అందానికి, సహృదయానికి, నటనాచాతుర్యానికి శివుడు ఆకర్షితుడయిపోయాడు.

వార్షికోత్సవంనాడు నాటకం చూడటానికి మాలతి వెళ్ళింది. నాయికానాయకుల ప్రణయ దృశ్యాలను అత్యుత్తమమైన నటన అని అందరూ అభినందించారు. కాని మాలతికి మాత్రం అది అభినయమనిపించలేదు.

మర్నాడు శివుడు నాటకం గురించి చర్చ మొదలెట్టి-

"మాలీ! నిన్న మా నాటకం ఎలా వుంది?" అనడిగాడు.

"బాగుంది"

"జయంతి ఎలా నటించింది?"

"ఆమె పాత్ర మంచి పాత్ర"

"మా స్నేహితులంతా మేము చాలా బాగా నటించామని మెచ్చుకున్నారు తెలుసా?" శివుడు గర్వంగా చెప్పుకున్నాడు.

మాలతి చిరునవ్వుతూ, "నాకేమో మీది నటన అనిపించలేదు" అంది కొంటెగా.

శివుడు విస్తుపోయాడు. అతడి మొహం ఎర్రబడి చెమట్లుపట్టాయి.

"మాలీ... నా హృదయంలోని రహస్యం నీకెలా తెలిసింది?"

"నా శివన్నయ్యని నేనివ్వాళ కొత్తగా చూస్తున్నానా?"

"మాలీ! నేనీ విషయం ఇంతవరకూ ఎవరితోనూ చెప్పలేదు. చివరికి జయంతితో కూడా!"

"పాపం... అమాయకురాలు. నువ్వలా చూసినా ఆమెకు ఏ అనుమానమూలేదు కదూ?" అంది వేళాకోళంగా.

"నేనలా చూస్తున్నట్టు తెలిస్తే ఆమె నా రహస్యం కనిపెట్టేస్తుందని నేనెక్కువ మాఌ ఆమెవేపు చూడనే చూడను"

"నీ రహస్యం తెలియడానికి ఎన్ని మాఌ చూడాలేం... ఒక్కమారు చూస్తే తెలియదా?" మాలతి వెక్కిరించింది.

"ఎలా చూస్తాను చెప్పు?"

"భక్తుడుభగవంతుడివేపుచూసేలాగా" అని నవ్వేసింది మాలతి. శివుడు కొంచెంసేపు మౌనంగావుండి చిన్నగా, "మాలీ! నువ్వేమంటావు?" అన్నాడు.

"నాన్నగారికి నీ ఎన్నిక నచ్చదని మాత్రంచెప్పగలను. మాధవన్న, కేశవన్న, రాజీవన్నయ్య, సుందరం - అందరూ నాన్నగారు చూసి చేసిన సంబంధాలే చేసుకున్నారు. అదీకాక వారందరూ



మనవాళ్ళే. నువ్వు ఆయనకు ఇంటిపెద్దగా వున్న గౌరవానికే దెబ్బతీయబోతున్నావు. పైగా జయంతి మనవాళ్ళమ్మాయి కాదు"

శివుడికి మాలతి మాటల్లో నిజంవుందని పించింది. నాన్నగారు తన పనిని సహించకపోయినా అన్నలు తన్ను సమర్థింపవచ్చుకదా!"

"ఇప్పుడేం చేస్తావన్నయ్యా?" శివుడి బెంగను పంచుకుంటూ అడిగింది మాలతి.

"జయంతి అభిప్రాయం ఏమిటో నాకు తెలియదు. ఇప్పట్నించి ఈ విషయం

ఎందుకు పట్టించుకుని బాధపడటం?" అని అక్కణ్నించి లేచాడు శివుడు.

* * *

రావుగారింట్లోవుండే మనవలు చాలదేమోనన్నట్టు వాళ్ళింటికి మరో మూడేళ్ళ పిల్లవాడు వచ్చి చేరాడు.

ప్రసాద్‌కి హిందుస్తాన్ ఏర్‌క్రాఫ్ట్‌లో ఉద్యోగం. అతడు ఇంజనీరుగా అక్కడ కొచ్చి ఏడెనిమిదేళ్ళయింది. చక్కటి భార్య, మంచి ఉద్యోగం, ఓ బాబు. అలాంటిది రెండవసారి గర్భవతి అయిన భార్య ఓరోజు నిర్జీవంగా కనబడింది. డాక్టరు వచ్చి చూసేసరికి కొనవూపిరి తీస్తోంది



లక్ష్మి.

అలా మంజునాథుడు తల్లిని పోగొట్టు కున్న అభాగ్యుడయ్యాడు. ప్రసాద్‌కి మంజునాథుణ్ని ఎలా పెంచాలన్నది ఓ పెద్ద సమస్య అయింది. లక్ష్మి తల్లి దండ్రులు ఉత్తర భారతదేశంలో తమ కొడుకు వద్ద వున్నారు. వారు మంజునా థుణ్ని తీసుకెళ్ళి పెంచుతామన్నా ప్రసాద్ వప్పుకోలేదు. బాబుని అంతంతదూరం పంపి తమ బాంధవ్యాన్ని తెంపుకోవటానికి ఇష్టపడలేదతడు.

మంజుకి ఎక్కడ కాస్త ప్రేమాభిమా నాలు దొరుకుతాయా అని ఆలోచించి తలబద్దలు కొట్టుకున్నాడు ప్రసాద్. అప్పుడతడికి కమలక్క గుర్తుకొచ్చింది.

మాధవుడి భార్య కమలకి ప్రసాద్ పెద్దమ్మ కొడుకు. ఆమెను చూడటానికి అప్పుడప్పుడూ రావుగారింటికి వెళ్ళిన ప్పుడు ఆ ఇంట్లో అన్నదమ్ముల మధ్య నున్న అభిమానం, అంతమంది ఏరకమైన దెబ్బలాటలు లేకుండా అన్యోన్యంగా జీవించగలగడం చూసి ఆశ్చర్యపోయే వాడు అతడు. రాజమ్మగారు చనిపోయి నప్పుడు ప్రసాద్ రావుగారింటికి వెళ్ళిన వాడు మళ్ళీ అటువేపు వెళ్ళలేదు.

కమలక్కకు కూడా ప్రసాదంటే అభిమానమే. రావుగారింట్లో ఆ పిల్లల మధ్యలో మంజుకి స్నేహితులకు లోటేమీ వుండదని ప్రసాద్‌కు నమ్మకమే.

మరుసటిరోజు ప్రసాద్ బాబుని తీసు కుని రావుగారింటికి వచ్చాడు. రావుగారే పలకరించారు.

"లక్ష్మి పోయిందట..తెలిసింది. చాలా బాధపడ్డాం"

ప్రసాద్ తలవంచుకుని నిల్చున్నాడు. రావుగారు సానుభూతి తెలిపాక తాను కూడా మాలతికి వచ్చిన కష్టం గురించి నాలుగు మాటలాడాలనిపించింది. కాని నోట్లోంచి మాట రాలేదు.

"కమలక్క వుందా?"

"ఊఁ! కమలమ్మా... నీ తమ్ముడు వచ్చాడు" అని కేకవేసి చెప్పి, "లోపలకు పోవయ్యా" అన్నారు.

కమల తలనొప్పిగావుందని తలకు బట్ట కట్టుకుని మంచంమీద పడుకుని వుంటే, మాలతి పక్కన కూర్చుని కబుర్లు చెబుతోంది.

ప్రసాద్ రాగానే మాలతి నిల్చుంది. అతడు ఇంటికి వచ్చి రెండేళ్ళపైనే కావటంతో వెంటనే గుర్తుపట్టలేకపోయింది మాలతి.

"కమలక్కా ఎ...వరో వచ్చారు" అని మాలతి అనేసరికి కమల చటుక్కునలేచి కూర్చుంది.

"నేనే కమలక్కా" అంటూ వచ్చి మంచంపక్క నిలబడి, "కమలక్కా! నీకెంతమంది పిల్లలు?" అనడిగాడు.

"అయిదుగురు" అంది కమల నవ్వుతూ.

"ఈరోజునుంచి ఆరుగురనుకో!"

మాలతి వంగి బాబును దగ్గరకు తీసుకుని "ఉంటావా ఇక్కడ?" అంది.

మంజు తల వూపాడు.

"బాబీ, సతీశా... మీతో ఆడటానికి ఇంకో బాబు వచ్చాడు" అంటూ బయటకు వెళ్ళింది.

"కమలక్కా! నువ్విప్పుడు మంజుని చూసుకోలేనంటే ఏదయినా అనాథ శరణాలయంలో పడేయాలి" అన్నాడు ప్రసాద్.

"నువ్వింకో పెళ్ళి చేసుకోకూడదా ప్రసాద్?"




"సవతల్లి కన్నతల్లి అవుతుందా కమలక్కా?"

"నేనెలా చెప్పను?"

"నేను పెళ్ళిచేసుకునే అమ్మాయి మంజుకి కూడా నిజమైన తల్లి అవుతుందన్న నమ్మకం నాకు కలిగేవరకూ నేను పెళ్ళిచేసుకోను. అంతవరకూ వాడు నీ కొడుకు"

"నా మీద అంత నమ్మకంవుందా?"

"అదేంమాటక్కా? నీమీద నమ్మకం లేకపోతే నేనిక్కడకు వచ్చేవాడినే కాదు. నేను ఫాక్టరీకి వెళ్ళేటప్పుడు ఇక్కడ వదిలేసి వెళ్తాను. మళ్ళీ సాయంత్రం వెళ్ళేటప్పుడు తీసుకెళ్తాను. ఏమంటావక్కా?"

"అలాగేకానీ. మేము వాడికోసం ప్రత్యేకంగా చేయాల్సిందేమీలేదు. మా పిల్లలతోటి వాడు ఆడుకుని, భోంచేస్తాడు అంతే!"

దాంతో ప్రసాద్ గుండెలమీద బరువు తీసేసినట్టయింది. "అక్కా! నీ ఋణం ఎప్పటికీ తీర్చుకోలేను" అని చేతులు పట్టుకున్నాడు.

"కానీ కమలక్కా! రావుగారితో ఓ మాట చెప్పవద్దా? ఎంతయినా ఇంటిపెద్ద" అని ప్రసాద్ అనేసరికి కమల నవ్వి, "మామయ్యగారికిమంజు పరాయిపిల్లాడని కూడా తెలీదు. నువ్వేం బెంగపడకు.... నేను చెప్తాలే" అంది.

"రేపట్నించి పొద్దున్నే ఇక్కడ వదిలివెడతాను. మిగిలిన పిల్లల్తో దెబ్బలాడినా చేసినా వాణ్ని కొంచెం గదమాయించో, ఓ దెబ్బవేసో దారిలోకి తీసుకురా... అసలే కొంచెం మొండివాడు"

"నా పిల్లలనే ఇంతవరకూ ఓ దెబ్బ వేసి ఎరగను. ఇంక తల్లిలేని పిల్లవాడిని కొట్టనా? మా బాగా చెప్పావు" అంటూ మంజూ, మంజూ అని పిలిచేసరికి సిగ్గుపడుతున్న మంజుని తీసుకుని మాలతి వచ్చింది.

"మీ అబ్బాయికి చాలా సిగ్గు" అంది మాలతి.

"అవును. ఇంతవరకూ వంటరిగా పెరిగాడుకదా! స్నేహితులంటూ లేరు. వాడూ నలుగురిలో కలిసిపోవటమన్నది మీ చేతుల్లోవుంది" మంజుని గదిలోవదిలి మాలతి బయటకు వెళ్ళింది. ఆమె వెళ్ళాక ప్రసాద్-

"కమలక్కా! ఇంత చిన్నవయస్సులో ఈ అమ్మాయికి ఎంతకష్టం వచ్చిపడింది. రావుగారు నిశ్చింతగా కన్నుమూయడానికి లేదిప్పుడు" అన్నాడు.

"ఏం చేస్తాం చెప్పు? అంతా నుదుటి రాత. మాలతి ఖర్మ ఇలావుందని ఎవ్వరం అనుకోలేదు"

"ఇప్పుడేం చేస్తోంది పాపం?"

"కాలేజిలోచేరి రెండేళ్ళయింది. ఆ పిల్ల కాలేజిలో చేరడం రావుగారికేమాత్రం ఇష్టంలేదు. అన్నయ్యలు గొడవచేసి చేర్పించారు. కాలేజీలో చేరాక ఎంతో నయం"

ప్రసాద్ ఇంకాస్సేపు కూర్చుని వెళ్ళిపోయాడు.

మర్నాటినుండి ప్రసాద్ మంజుని తీసుకొచ్చి వదిలివెళ్ళేవాడు. పిల్లలకు తమతో ఆడుకోవడానికి ఇంకో అబ్బాయి దొరికాడని గంతులేశారు. కాని వంటరిగా పెరిగిన మంజు ఈ పిల్లలగుంపులో కలిసిపోలేకపోయాడు. వాడికి ఈ కేకలు, గంతులు, దెబ్బలాటలు, కథలు అన్నీ కొత్తే. వారి ఆటపాటల్ని నోరుతెరచుకుని చూసేవాడు. వాడివంతు తినుబండారాలు కూడా వెంటనే తినేవాడు కాదు.

కొంటెపిల్లలెవరైనా లాక్కునితింటూంటే చూస్తుండేవాడే కాని, దెబ్బలాడాలని కాని, పెద్దవారితో చెప్పాలని కాని తోచేదికాదు. యోగిలా అందరి ప్రవర్తనకి సాక్షిలా నిలబడేవాడంతే!

ఓరోజు ఆట హడావిడిలో బాబి మంజు తలనిండా ఇసుకపోశాడు. తల వంచుకుని ఇసుక పోయించుకుంటున్న మంజుని వరండాలో నిట్టింగ్ చేస్తూ కూర్చున్న మాలతి వచ్చి విడిపించింది. తలనిండా మట్టి వదిలించడానికి తలంటింది. తమ ఇంటి పిల్లలదే తప్పుకనుక, వాణ్ని శుభ్ర పరచడం తన బాధ్యత అని భావించింది మాలతి.

సాయంత్రం కొడుకుని తీసుకుని వెళ్ళడానికి వచ్చిన ప్రసాద్ మంజు తల మెరుస్తూండటం చూసి, "కమలక్కా! లక్ష్మి పోయాక ఇదే మొదటిమారు వాడికి తలంటుభాగ్యం కలిగింది. నీకెంత థాంక్స్ చెప్పినా చాలదు" అన్నాడు.

అక్కడే నిట్ చేస్తున్న మాలతిని చూపి కమల, "నేనుకాదు తలంటింది, మాలతి" అన్నది. మాలతి తల పైకెత్తకుండానే, "నిజానికి మీరు థాంక్స్ చెప్పాల్సింది బాబిగాడికి. వాడు మంజు తలనిండా మట్టిపోశాడని నేను తలంటాల్సి వచ్చింది. వాళ్ళేంచేసినా మౌనంగా చేయించుకుంటాడు" అంది.

ప్రసాద్ ఇదివరకూ మాలతిని ఎన్నో మార్లు చూశాడు. అందులోనూ మంజుని వదిలిపెట్టి వెళ్ళటం మొదలెట్టాక రోజూ రెండుమార్లు ఆమెను చూస్తూనే వున్నాడు. మాలతికూడా అతనితో ఏవిధమైన సంకోచమూ లేకుండా మాట్లాడేది.

తల మట్టయితే తల దులిపి లేక తుడిచి పూసుకోవచ్చు. కాని తన కొడుక్కు తలంటి, శుభ్రపర్చిన మాలతిని కొత్తగా చూశాడు ప్రసాద్.

తలవంచుకుని నిట్ చేస్తున్న ఆమె వేళ్ళవంకా, వీపంతా పరుచుకున్న నల్లటి జుత్తువంకా తదేకంగా చూశాడు. 'ఎంత బావుంటే అమ్మాయి' అనుకున్నాడు. భార్య పోయాక ఇంతవరకూ ఏ ఆడపిల్ల అందాన్ని ఇలా పరిశీలనగాచూడలేదతడు. 'ఇంత అందమయిన పిల్లకు ఎలాంటి జీవితం'-అనుకున్నాడు మనసులోనే.

ఏదో చెబుదామని తల పైకెత్తిన మాలతికి అతడు తననే తీక్షగా చూడటం కనిపించింది. మాలతి సిగ్గుపడింది. తల మరింత కిందకు దించింది. గుండె దడదడా కొట్టుకుంది.

సిగ్గుతో ఎర్రబడిన మాలతి మొహం మరింత అందంగా కనబడింది. ఓ క్షణం చుట్టూవున్నవారెవరూ గుర్తుకు రాలేదు వారికి. కమల లోపల్నుంచి కాఫీ, టిఫిన్ తెచ్చాక ప్రసాద్ ఈ లోకంలోకి పడ్డాడు. కమల వచ్చాక మాలతికి ఊపిరాడినట్టయింది. స్వేచ్ఛగా మాటలాడ గలిగింది.

"మంజు ఇంకా నలుగురితో కలప లేకుండా వున్నాడు. అందరిలా వాడు అల్లరి చేయాలి... దెబ్బలాడాలి"

"వాడికి రాదు... మీరే నేర్పండి"

"ఆతర్వాత మీరు వాణ్ని పట్టలేరు"

"అప్పుడు మీరే చూసుకుందురుగానీ"

"మళ్ళీ మీరు తప్పుబట్టకూడదు"

అంటూ మాలతి ప్రసాద్‌వేపు చూసింది. అతడు తల అడ్డంగావూపి నవ్వాడు.

మళ్ళీ మాలతి మొహం ఎర్రబడింది. ప్రసాద్ ఆరాధనాదృక్కులు ఆమెను ఆనందపుటుయ్యాలలో వూపింది. అతడి మెప్పు ఆమెలో పులకరింతలు లేపింది.

ఎప్పటిలా అతడితో కన్నెత్తిచూసి మాట్లాడటం కష్టమయింది.

ఈ రకమయిన ఆరాధన మాలతికేమీ కొత్తకాదు. సహజంగానే అందమైన ఆమెను ఆరాధనాపూర్వకంగా చాలామంది చూసేవారు. ఆ ఆకర్షణశక్తి ఆమెకెంత అలవాటయిపోయిందంటే ఆమె అలా తన వంక ఎవరైనా చూస్తున్నారని కూడా గమనించేదికాదు. అలాంటి ఆరాధన ఆమెను పులకరింపజేసేదికాదు.

అందులోనూ ప్రసాద్‌ను రోజూ చూడటంతో అతడూ ఇంట్లో ఒకడికింద అయిపోయి పరాయివ్యక్తి అని అనిపించేదికాదు.

కాని ఇవ్వాళమాత్రం అతడి చూపు ఆమెను అధీనురాల్ని చేసింది. ఇంతవరకూ మంజు తండ్రిమాత్రం అయిన ప్రసాద్ కొత్తవ్యక్తిలా కనిపించాడు.

ప్రసాద్ అందమయిన వ్యక్తికాదు. మంచి పొడుగు, లావువున్నా నలుపు కిందికే వచ్చే రంగు. దువ్వెనకు లొంగని జుత్తు, కంటిమెరుపు తగ్గించిన కళ్ళజోడు, అతని చుట్టూ వచ్చే సిగరెట్ వాసన... రెండేళ్ళ తర్వాత తాను శ్రీ అన్న విషయం గుర్తొచ్చింది మాలతికి.

"వెళ్ళొస్తాను" అని ప్రసాద్ చెప్పేవరకూ అన్యమనస్కంగా వుండిపోయింది మాలతి. ఆరోజింక ఆమె మనసు పుస్తకంమీద నిలపలేకపోయింది. ఎటు చూసినా అతడి చూపు ఆమెను వెన్నాడుతున్నట్టేవుంది.

మర్నాడు ప్రసాద్ కొడుకుని వదిలిపెట్టి వెళ్ళటానికి వచ్చినపుడు కావాలనే మాలతి గదిలోనుండి బయటకు రాలేదు. ఆమెకోసం చూసిచూసి నిరాశ చెందాడు ప్రసాద్. అతను వెళ్ళిపోయాక మంజుని పిలిచింది.

"ఏంటి పిన్నీ" అంటూ వచ్చిన మంజుని దగ్గర కూర్చోబెట్టుకుని-

"నన్ను పిన్నీ అని ఎందుకు పిలుస్తున్నావ్" అనడిగింది. వాడు పిన్నీ అని పిలవటంలో ఏదైనా గూడార్థం వుందేమోనని అనుమానం వచ్చింది.

"నాన్నగారలా పిలవమన్నారు" అని మంజు చెప్పేసరికి మాలతి సిగ్గుపడింది. మాట మార్చి, "చూడు బాబూ! నువ్వు అలా బొమ్మలా నిల్చోకూడదు. అందరు పిల్లలతో సరదాగా ఆటలాడుకోవాలి. కొంచెం పెద్దయ్యాక బడికి వెళ్ళాలి. బాగా చదువుకోవాలి... తెలిసిందా?" అంది.

"ఊ..." అని తలవూపాడు మంజు.

మిగిలిన పిల్లల అల్లరిబారినుండి తనను రక్షించే పిన్ని అంటే వెర్రిప్రేమవాడికి. రోజులు గడిచినకొద్దీ ఆ పిల్లల్లో ఒకడిగా కలిసిపోయి ఆడుకునేవాడు. ఆఖరికిమంజు అల్లరి ఎంతెక్కువ అయిందంటే-మాలతి గట్టిగా గద్దిస్తేకాని తగ్గేవాడుకాదు. ఎప్పుడూ మందకొడిగావుండే పిల్లాడి కళ్ళలో కొంటెతనం చోటు చేసుకుంది.

మాలతి ప్రసాద్ వచ్చేవేళకు గదిలోనే వుండిపోయేది. దాంతో రాపుగారింటికి రోజూ రెండుమార్లు వస్తున్నా అయిదు నెలలుగా మాలతి ప్రసాద్ కంటబడలేదు.

మాలతి పెంపకంలో మంజు బొద్దుగా తయారవటమేకాక బాగా మాటలు కూడా నేర్చాడు. వాడి ప్రశ్నలకు జవాబులు చెప్పలేక విసుగెత్తేది ప్రసాద్‌కి. ఫాక్టరీ నుండి అలసివచ్చి వంటప్రయత్నంలో వుండగా సాయం చేస్తానంటూ వెంటబడి కాలికీ, చేతికీ అడ్డుపడేవాడు. బియ్యం నీళ్ళు పారబోసి, "నాన్నారూ! అన్నం చేయాలంటే నీళ్ళు వేయాలా... అలాగే

అవదా?" అని ముద్దుముద్దుగా అడిగేవాడు. కొట్టాలని ఎత్తిన చేయి దించి ముద్దిచ్చేవాడు.

"నువ్వు చాలా అల్లరివాడివయిపోయావు. ఇలా చేస్తే ఇంట్లోంచి తరిమేస్తాను" అని బెదిరిస్తే, "అయితే నేను పిన్నీవాళ్ళింట్లోనే వుండిపోతాను" అని నవ్వాడు.

## 7

...నాకు మా నాన్నగారిగురించే భయం. నా జీవితం ఇలా అయినప్పటినుంచీ ఆయన చాలా మారిపోయారు. అంతకు ముందు ఎంత సరదాగా వుండేవారో మీకు తెలియదు. ఇపుడు ఆయన్ని చూస్తే జాలివేస్తుంది. నేను ఆయన్ని ఏ రకంగానూ నొప్పించలేను...

మరుసటిరోజు సాయంత్రం కావాలనే తాను రోజు వచ్చేవేళకన్నా ముందే వచ్చాడు ప్రసాద్. అతడనుకున్నట్టే మాలతి బయట వరండాలోనే వుంది. పిల్లల ఆట చూస్తూ నిల్చున్న మాలతి, ప్రసాద్ తీరా దగ్గరకొచ్చేవరకూ గమనించలేదు. అతణ్ని చూశాక మరోదారి లేక "రండి'' అని ఆహ్వానించింది.

"మంజు ఏడి?"

"అదిగో పిల్లల గుంపులో వున్నాడు"

"ఇవాళ మీతో దెబ్బలాడదామనే ముందుగా వచ్చాను'' అన్నాడు ప్రసాద్ ఓటమిని అంగీకరిస్తూ.

ఒక్కమారు ఉలిక్కిపడి మాలతి, "నేనేం చేశాను?" అంది.

"వాణ్ని మీరే పాడుచేశారు. ఇప్పుడు ఓ క్షణం కూడా చూసుకోలేకుండా వున్నాను... ఒకటే అల్లరి''

"పిల్లలు అలా వుంటేనే బాగుంటారు"

"ఏం బాగో. ఒక్క క్షణం కూడా ఏమరుపాటుగా వుండటానికి వీల్లేదు. అలా తయారయ్యాడు"

మాలతి నవ్వి, "ఆరోజు వాడి బాధ్యత నాది. ఏమీ తప్పు పట్టనన్నారు కదా?"

"నేనలా అన్నది నిజమే. కాని ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నా"

మాలతికి ముళ్ళమీద నిల్చున్నట్టుంది. ఇక అక్కడ నిల్చోలేకపోయింది. 'కమలక్కను పిలుస్తాను' అంటూ అక్కణ్నుంచి వెళ్ళబోయిన మాలతిని 'మాలతీ' అన్న ప్రసాద్ మృదువైన పిలుపు నిలబెట్టేసింది. తలుపువరకు వెళ్ళిన మాలతి మెడమట్టుకుతిప్పి ప్రశ్నార్థకంగా చూసింది.

"మాలతీ... నామీదకోపమా?"

లేదన్నట్టు తల అడ్డంగా వూపింది.

"మరయితే నాక్కనిపించకుండా దాక్కుంటున్నారెందుకు?"

మీ చూపులంటే భయం-అని చెప్పాలనిపించింది కాని మౌనంగా నవ్వి లోపలకు వెళ్ళిపోయింది.

ప్రసాద్ నిరాశచెందాడు. ఇంట్లోకి వెళ్ళి అక్కను పలకరించాలనిలేక అలాగే మంజుని తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు. అతనలా వెళ్ళిపోవటాన్ని కిటికీలోంచి చూసిన మాలతి నిట్టూర్చి 'ఇదే మంచిది' అనుకుంది.

ఆతర్వాత ప్రసాద్ రావుగారింట్లోకి రాలేదు. గేటుదగ్గర మంజుని వదిలిపెట్టి వెళ్ళేవాడు. మళ్ళీ సాయంత్రం తను వచ్చేసరికి మంజు గేటుదగ్గర నిలబడాలని ఆజ్ఞాపించాడు.

తననుండి తప్పించుకోవటానికి మాలతయినా ఎందుకంత కష్టపడాలి? తాను

ఇంట్లోకి వెళ్ళకపోతే ఆమెకు శ్రమ తగ్గుతుందికదా?

ప్రసాద్ తనను ఓ కష్టంబారినుండి తప్పించాడనిపించలేదు మాలతికి. మాలతి అందాన్ని చూడాలని అతడికెంత కోరిక వుందో, తన అందాన్ని అతడు చూసి ఆనందించాలన్న ఆత్రుత ఆమెకీ వుంది.

నాలుగయిదు రోజులయ్యేసరికి కమల అతడు గుమ్మం దగ్గర్నుండి లోపలకు రావటంలేదని గమనించింది. ఎందుకు అలా చేస్తున్నదీ, తలబద్దలు కొట్టుకున్నా అర్థంకాలేదు. అతణ్ని ఇంట్లోకి రప్పించాలని పంతం వచ్చింది. మంజుతో గుమ్మం దగ్గర వాళ్ళ నాన్నకోసం ఎదురుచూస్తూ నిలబడవద్దని చెప్పింది.

ఆరోజు ప్రసాద్ వచ్చేసరికి మంజు ఎప్పటిలా కనిపించలేదు. పిల్లలు కూడా మంజు ఎక్కడున్నాడో తెలియదన్నారు. ప్రసాద్ గొంతువిని బయటికొచ్చిన రావుగారు లోపలకు రమ్మనేసరికి మరోమార్గం లేక లోపలకు వెళ్ళాడు. కమలక్క గదిలోకి వెళ్ళిచూస్తే అక్కడ ఇంటికోడళ్ళు, కూతుళ్ళు అందరూ సమావేశమయి వున్నారు. అక్కడ కూర్చోకుండా వెళ్ళిపోతానన్న ప్రసాద్‌ను, "మంజు కావాలంటే కూర్చోవాల్సిందే" అని బెదిరించింది కమల.

"వాడు నాకు వద్దేవద్దు. మీరే వుంచుకోండి" నవ్వుతూ అన్నాడు ప్రసాద్.

విపుల, సుశీల నవ్వాపుకోడానికి ప్రయత్నిస్తున్నారు. మాలతి గంభీరంగా తల దించుకుని కూర్చుంది.

"రేపు ఉగాదిరోజున మీ తండ్రీ కొడుకులిద్దరూ మా ఇంట్లోనే భోంచేయాలి"

"మీకంత ఇబ్బంది..."

"రోజూ నాలుగుశేర్లబియ్యం వాళ్ళే మాకు పండగపూట ఓ గుప్పెడు బియ్యం ఎక్కువవెయ్యటం ఇబ్బందా?" అన్నారు సుశీలమ్మ.

అందరూ బలవంతపెట్టినా మాలతి మౌనమే బలంగా పనిచేసింది.

ఉగాది ఇంకా ఓ వారం వుండగానే రావుగారింటి టైలర్ వచ్చాడు. తల్లులు తమ పిల్లలకోసం పండక్కికొన్న బట్టలు ఎలా కుట్టాలో చెప్పి కొలతలు తీయిస్తున్నారు. మిగిలిన పిల్లలంతా ఉత్సాహంతో గంతులేస్తుంటే మంజు చిన్నబోయిన మొహంతో ఓ మూల నిల్చున్నాడు.

మంజు మొహంలోని బాధను ముందుగా గమనించింది మాలతి. పిల్లాడు వేసుకున్న బట్టలు తండ్రి అతడి బట్టలపట్ల ఏమాత్రం శ్రద్ధ చూపడంలేదని తెలుపుతున్నాయి. ఎంతయినా తల్లివుంటే ఆ దారే వేరు అనుకుంది. టైలర్ని పిల్చి,మంజు కొలతలు తీసుకుని. అతడికి రెండు షర్టులూ, నిక్కర్లు కొంచెం మన్నికొచ్చే బట్టలు కుట్టమని చెప్పింది.

ఉగాదినాడు ఇంట్లో అందరూ తలంటుకునే అలవాటు రావుగారింట్లో. చిన్నపిల్లలకు తలంటి, తానూ నీళ్ళుపోసుకుని తలారబెట్టుకుంటూండగా ప్రసాద్ 'కొత్త సంవత్సరానికి శుభాకాంక్షలు' తెలుపుతూ వచ్చాడు.

మాలతిని చూడగానే 'పిన్నీ' అంటూ దగ్గరకొచ్చాడు మంజు.

"తలంటుకున్నావా మంజూ?" మాలతి అడిగింది.

"ఊఁ..."

"మీరే పోశారా?" మాలతి ప్రసాద్‌ని అడిగింది.

"ఊఁ ... నూనె వదిలిందాలేదా ...



చూడండి'

మాలతి మంజు తలచూసి, "అబ్బే... పదల్లేదు. మళ్ళీ శీతం చేస్తుంది. పద మంజూ....నేనో మారుపోస్తాను'' అంది.

"వద్దు పిన్నీ'' అని బతిమాలు కున్నాడు మంజు.

"వెళ్ళరా! పిన్ని చేత తలంటించుకునే భాగ్యం ఎంతమందికి ఉంటుంది?" అన్న ప్రసాద్ మాటకు మాలతి బుగ్గల్లో కెంపులు పూశాయి. మాట మార్చటానికి "మీరు తలంటుకున్నారా?" అనడిగింది.

"నా గురించెవరు పట్టించుకుంటారు?"

"నేను పట్టించుకునే కదా... అడుగు తున్నది"

"నామీద మీకా మాత్రమయినా జాలి వుంది. నేను ధన్యుడిని. లేదు. నేను తలంటుకోలేదు"

"ఎందుకు?''

"విసుగు"

"ఇక్కడ పోసుకుంటారా?" అనడిగింది మాలతి.

మాలతి సాన్నిధ్యాన్ని వదలుకుని స్నానాలగదిలో ఓ గంట తలుపులేసుకుని కూర్చోవటంలో ఏం సుఖంవుంది?

''వద్దు... నాకా కోరికలేదు''

మాలతి ఎక్కువ బలవంతపెట్టలేదు. ఓ క్షణం పూరుకుని, "నామీద కోపం పోయిందా?" అనడిగింది.

"నేను మిమ్మల్ని అదే ప్రశ్న వేద్దామనుకుంటున్నాను. నిజంచెప్పండి...మీరు నన్ను తప్పించుకుని తిరుగుతున్నారెందుకు?''

మాలతి చుట్టూ చూసింది. బొమ్మల పుస్తకం తిరగేస్తున్న మంజు తప్ప అక్కడింకెవరూ లేరు- ''అబ్బే...లేదే!" అంది.

"నేను మిమ్మల్ని చూసి ఎన్నిరోజులయిందో చెప్పండి?"

"ఈమధ్యే ... వారం కిందట చూశారు"

"అంతకుముందు నెలపైనే కనిపించలేదు"

"దానివల్ల వచ్చిన నష్టమేమిటి?"

"మా ఫాక్టరీలో అడిగి చూడండి! నేను సరిగ్గా పని చేయలేకుండావున్నానట! మిమ్మల్ని ఇబ్బంది పెట్టకూడదనే లోపలకు రావడం మానేశాను. కమలక్క బలవంతపెట్టటంతో రాక తప్పింది కాదు. మిమ్మల్ని బాధపెడితే క్షమించండి"

బదులు చెప్పకుండా చిక్కు తీసుకుంటూ నిల్చుంది మాలతి.

"క్షమించారా?"

"ఉగాదిరోజున మనం దెబ్బలాడుకోవటం దేనికి చెప్పండి?"

"దెబ్బలాటకు తావెక్కడ? యుద్ధానికి ముందే శరణాగతుణ్ణయ్యానుగదా! మీరింతవరకూ నా ఎదురుగా నిల్చుని మాట్లాడటమే మహద్భాగ్యం అనుకుంటున్నానే"





మాలతి ఒత్తైన జుత్తు వెనక్కి తోసుకుంటూ, "మీరూ మా శివణ్ణ బృందంలోకే చేరతారు" అంది.

"అంటే?"

"వాడు బాగా నాటకాలు రాస్తాడు, వేస్తాడు"

"మాలతీ... నాది నటన అనుకుంటున్నారా?"

మాలతి నవ్వుతూ తల పూపింది.

ప్రసాద్ ఆమెకు బాగా దగ్గరగా నిలబడి, "మాలతీ! మీరు వేళాకోళం చేస్తున్నారా?"

"లేదు. నేను నిజంగానే అన్నాను. మీది నటన కాదని ఋజువు చెయ్యండి"

''ఎలా?"

"మీరు సిగరెట్లు మానేస్తే మీది నాటకం కాదని నమ్ముతాను"

ప్రసాద్‌కి వెంటనే ఒప్పుకోవడం చాలా కష్టమయింది.

"మాలతీ... ఇప్పుడు నా ఒక్కగానొక్క నేస్తం సిగరెట్. అదీ మానుకోమ్మంటే ఎలా?"

అతడి సిగరెట్ల వాసన భరించలేక రెండడుగులు వెనక్కివేసి మాలతి- "ఈ కొత్త సంవత్సరంలో మానేయండి. అప్పుడు మీది నటన కాదని నమ్ముతాను" అంది.

ఆమె వెనక్కి తగ్గిన కారణం అర్థమయి, "ఓ రెండు రోజులు నాకు టైమివ్వండి...చెప్తాను" అని బయటకువెళ్ళాడు. మాలతి మంజుని స్నానాలగదికి తీసుకెళ్ళింది.

భోజనాల వేళకు అన్నదమ్ములందరూ కలిసి భోజనానికి కూర్చున్నారు. అన్నలు, వదినలు, పిల్లలు, రావుగారు మధ్యలో వున్న మాలతిని చూసి వీరందరి మధ్య నుండి,.. నేను మాలతినెలా పొందగలను

అని బెంగపెట్టుకున్నాడు ప్రసాద్

మగవారందరి భోజనాలయ్యాక ఆడవాళ్లు కూర్చున్నారు. వారికి శివుడు వడ్డిస్తున్నాడు. మాలతి అన్యమనస్కంగా వుండటాన్ని గమనించి-

"మాలీ! నువ్వు ప్రేమలో పడ్డావు" అన్నాడు. మాలతి ఎంగిలిచేత్తోనే గిల్లి "నోర్మయ్" అంది.

"నేనునోర్మూసుకున్నా నీ హృదయం తెర్చుకుని విగ్రహాన్ని ప్రతిష్ఠాపించింది"

"ఇది నీకొత్త నాటకంలో డైలాగా!"

"కాదు... నిజజీవితంలోది"

"నువ్విక్కణ్నుంచి వెళ్లు. నేను వడ్డించుకోగలను"

''చూడండొదినా! పండగపూట నాతో కయ్యానికి దిగింది" అని ఫిర్యాదు చేశాడు శివుడు.

తన పక్కనే కూర్చున్న శివన్నయ్య చెవిలో గుసగుసలాడింది మాలతి-

"జయంతి ఇంటికి పొద్దున్నే వెళ్ళావా.. ఏమంది?"

"ఉగాది శుభాకాంక్షలకు ప్రతిఫలంగా ఓ మధురమైన చిరునవ్వు, కంటిమెరుపులో ఓ తుంటరి పిలుపు". మాలతి నవ్వేసింది. శివుడు చెప్పాడు, "ఇప్పుడు మేమింకో నాటకం ఆడబోతున్నాం"

"ఎవరు రాసినది"

"నేనే. మేమిద్దరంనాయకానాయికలం. మీరందరూ ప్రేక్షకులు"

అందరూ నవ్వారు శివుడి మాటలువిని. "నాటకం సుఖాంతమయ్యేలా చూడు శివన్నయ్యా" అంది మాలతి. భోజనాలయ్యాక శివుడు తన మనస్సులోని బాధంతా మాలతితో చెప్పుకుని ఏం చెయ్యమంటావని సలహా అడిగాడు. శివుడి బాధ స్వానుభవంతో అర్థం చేసుకున్న మాలతి ఇప్పుడు నవ్వలేదు.

"చేయడానికేముంది? పెద్దల ఆశీర్వాదంతో పెళ్ళిచేసుకుని నాలుగుకాలాలు సుఖంగా వుండండి"

"మేము సుఖంగా వుండటంపట్ల నాకేం అనుమానంలేదు. పెద్దల ఆశీర్వాదం దొరుకుతుందని మాత్రం నాకు నమ్మకంలేదు"

మాలతికి ఇదే భయం. ఇటీవలికాలంలో మహేశుడి మరణం తర్వాత ఇంట్లో అందరికీ ఆయనతో మాట్లాడటం అంటేనే భయం. ఎప్పుడు కోపంతో మండిపడతారో తెలియదు. అలాంటప్పుడు శివుడు వేరేకులం అమ్మాయిని చేసుకుంటాసంటే ఏమవుతుంది?

"చూద్దాం. జయంతిని నీ స్నేహితురాలని తీసుకునివచ్చి పరిచయంచేయి. అన్నలు, వదినలు ఏమంటారో చూసుకుని ముందడుగు వేద్దువుగాని"

ప్రసాద్ రెండ్రోజుల తర్వాత అడిగితే ఏమని చెప్పాలి- అని ఆలోచించి ఆలోచించి మాలతికి పిచ్చెక్కింది. రెండ్రోజుల తర్వాత ఎక్కడ కలుసుకోవాలి అతణ్ని. తన గదిలోకి తీసుకెళ్ళడం బాగుండదే- అని ఆలోచించి ఆఖరికి అతడువచ్చే వేళకి ఊలు నిట్టింగ్ నీడిల్స్ పట్టుకుని తోటలో కూర్చుంది. చుట్టూ పంజు, సతీశుడు, బాబీ ఆడుకుంటున్నారు.

మాలతిని చూసి తిన్నగా అక్కడికే వచ్చాడు. అతడేం చెప్తాడో అని ఎంత ఆత్రుతవున్నా అది కనిపించనియకుండా నవ్వుతూ ఆహ్వానించింది.

"ఎవరికోసం అల్లుతున్నావు స్వెట్టర్" అడిగాడు ప్రసాద్.

"నాన్నగారికోసం"

"మాలతీ... రెండ్రోజులు పగలూ

రాత్రి ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాను. ఇవాళ రాత్రి పన్నెండుగంటల తర్వాత సిగరెట్లు కాల్చాను"

"నిజంగా?"

"ఆఁ... ఇప్పటికయినా నాది నటన కాదని నమ్ముతారా?"

తన మాటలకు అతడు నొచ్చుకున్నా నిపించి తలెత్తింది మాలతి. పాంటు జేబుల్లో చెయ్యిపెట్టుకుని నిల్చున్న అతణ్ని చూస్తే బాగా చిక్కిపోయినట్టూ, అలసినట్టూ అనిపించి జాలేసింది మాలతికి.

"నమ్ముతాను. కాని మీరెప్పటికీ మాట తప్పకూడదు"

ప్రసాద్ వెంటనే మాలతివేపు తిరిగి, "అలాగే. కాని నేను ఎందుకు మాట ఇస్తున్నానో తెలుసా?"

"నాకేం తెలుసు?" అంది బింకంగా మాలతి.

ఎంత బింకం ఈ అమ్మాయికి! తన ఎదురుగానైనా కొంచెం బింకం వదల కూడదా? తన సౌందర్యాన్ని, వయ్యా రాన్ని ఎవరికోసం దాచుకుంటోందో! ఒగించిన ఆ పెదవులను ముద్దు పెట్టుకోవా లనిపించింది.

"నేను చెప్పనా...?"

"చెప్పండి"

"నాకు జీవితంలో సహచారిణి లేదని నికొటిన్ రాణిని ఆశ్రయించాను. ఇప్పుడు ఇంకో నేస్తం దొరుకుతుందనే భరోసా మీద నికొటిన్ రాణిని దూరం చేసుకుం టున్నా" మౌనంగా తలదించుకున్న మాలతిని చూస్తూ, "నేను చెప్పింది అర్థ మయిందా మాలతీ?" అనడిగాడు.

"లేదు"

"ఇంత అందమున్న వారు సరదాకైనా అబద్ధాలాడకూడదే?"

"మీ సలహాకు థాంక్స్"

"విపులంగా, అర్థమయ్యేలాచెప్పనా?"

అప్పుడు భయంవేసింది మాలతికి. 'తాను వూఁ అంటే అతడేమేం చెప్తాడో? ఎవరైనా చూస్తారన్న భయంకూడా వున్నట్టులేదు. ముందూ వెనకా చూడ కుండా తన్ను కౌగిట్లోకి తీసుకుంటే ఏం చేయటం...?తనకూ అలాంటి పిచ్చి ధైర్యంవుంటే ఎంత బాగుండేది' – అని ఊగిసలాడింది ఆమె మనసు.

"వద్దు"

"అయితే నా భావం మీకర్థమయింది. మీరు నన్నెందుకిలాబాధపెడుతున్నారు?"

"నేనేం చెయ్యను?" నిస్సహాయంగా అడిగింది మాలతి.

"మీ హృదయంలో నాకింత చోటి వ్వండి. అప్పుడు నేను మళ్ళీ మనిషిగా జీవిస్తాను"

"నేనివ్వలేదని మీకెలా తెలుసు?"

"నాకు తెలుసు. మీరలా నాక్కాస్త చోటిచ్చివుంటే సిగరెట్ వేడితో కాలివున్న నా పెదవుల దాహాన్ని ఒక్కమారయినా తీర్చేవారు"

మాలతికి తల తిరిగినట్టయింది. అల్లిక వసువులు తీసుకునిలేచినిల్చుంది.ఇక ఆమె లోపలకు వెళ్ళిపోతుందని అర్థమైనప్రసాద్ ఆమెవద్దకు వచ్చిచిన్నగా, "నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను" అన్నాడు. మత్తెక్కించేలా వున్న అతడి మాటలకు శరీరం అదుపు తప్పినట్లయింది. వణుకుతున్న తన శరీరానికి అతడి బాహుబంధంలో సరయిన ఆశ్రయం దొరుకుతుందనిపిం చింది. కాని తలెత్తి అతడివేపు చూసే ధైర్యం చేయలేదు. చూస్తే తన కళ్ళలోని ఆత్మార్పణ భావాన్ని అతడు గుర్తించి ఏ విధమయిన సంకోచం లేకుండా తనను




దగ్గరకు తీసుకుంటాడని తెలుసు ఆమెకు.

"నా ఆశ తీరుతుందా మాలతీ?"

చెట్టునాసరాగా తీసుకుని నిల్చున్న మాలతి జవాబు చెప్పలేదు.

ఎందుకింత సందేహం? అతడిలా తానూ తన మనస్సును అతడికెందుకు చెప్పలేకపోతోంది??

"ఏమయినా చెప్పండి మాలతీ?"

"నాకో రెండ్రోజులు టైమివ్వండి"

"అలాగే"

"మనం ఇక్కడ కలుసుకోవద్దు... బాగుండదు"

"అయితే శుక్రవారం సాయంత్రం లాల్‌బాగ్ దగ్గరకు వస్తారా పోనీ"

మాలతి అంగీకారసూచకంగా తల వూపింది.

ఆ రెండ్రోజుల గడువూ గడిచేసరికి మాలతికి పిచ్చిపట్టినట్టయింది. తన భవిష్యత్తు ఎలా వుండాలో తానే స్వయంగా నిశ్చయించే సమయం వచ్చేసరికి అధీరు రాలయింది ఆమె.

ప్రసాద్‌లో ఏ లోపమూ కనిపించ లేదు మాలతికి. చదువు, ఉద్యోగం, ఈడూ జోడూ-అన్నీ ఆమెకు నచ్చాయి. అతడంటే ఇష్టమే మాలతికి.

ఆ విషయం ప్రసాద్‌కి చెప్పవచ్చు. కాని దాని పరిణామం?

అన్నలు, వదినలూ తన మాట కాదనరన్న నమ్మకం మాలతికి వుంది. కాని రావుగారు? తండ్రితో ఈ మాట ఎత్తాలన్న ఆలోచనకే భయం కలిగింది మాలతికి. ఆయనేమంటారో?

అంతవరకూ వచ్చాక చూద్దాంలే అని ఆ ప్రశ్నని దాటేసింది.

మాలతిలోని అలజడి ఇంట్లోవారుకూడా గమనించి "ఎందుకలావున్నావు మాలతీ?" అనడిగేలా అయింది.

మాలతికి పరీక్షాదినం వచ్చేసింది. అనుకోకుండానే రోజుకన్నా శ్రద్ధగా అలంకరించుకుని కొంచెం మంచి చీర కట్టుకుని కాలేజికి బయలుదేరింది. సహ జంగానే అందగత్తె మాలతి. ఇంకంత ఆకర్షణీయంగా కనిపించడంతో శివుడు "నేను రానా తోడుగా" అనడిగాడు చిలిపిగా.

"ఎందుకు?"

"బాడీగార్డ్‌గా!"

"అదంతా నీ జయంతికి కావాలి" అనేసి వెళ్ళిపోయింది మాలతి.

రోజూ శ్రద్ధగా పాఠంవినే మాలతి ఆరోజు పాఠంమీద ధ్యాస నిలపలేక పోయింది. ఎప్పుడు వెళ్లిపోతుందా అని రాచుకుని వుంది.

మాలతి లాల్‌బాగ్‌కి అయిదున్నరకు వచ్చేసరికి ప్రసాద్ ఎదురుచూస్తున్నాడు. ఇద్దరూ కలిసి టిఫిన్‌రూమ్‌కి వెళ్ళి కాఫీ, టిఫిన్ తీసుకున్నాక-

"కిళ్ళీ కావాలా?" అనడిగాడు ప్రసాద్.

"వద్దు" అన్న మాలతి పెదవులవంకే చూస్తూ, "అవును...దాని అవసరం మీకు లేదు" అన్నాడు. మాట మారుస్తూ మాలతి "వెడదామా?" అంది.

"మా ఇంటికి వెళ్దాం వస్తారా?"

మాలతి ఉలిక్కిపడింది. కంగారుగా-

"ఊహు... నేను రాను" అంది.

"ఎందుకని?"

"ఇక్కడే మాట్లాడకూడదా?"

"ఇక్కడ ఉత్తినే కూర్చుంటే బాగుం డదు. లాల్‌బాగ్‌లో కూర్చుంటే మనల్ని తెలిసినవాళ్లు ఎవరయినా కనిపించవచ్చు. ఏదీ నిశ్చయం కాకుండా మన గురించి

మాట్లాడే అవకాశం ఇవ్వటం నాకిష్టం లేదు. నాగురించికాదు-మీరు అనవసరంగా చెడ్డపేరు తెచ్చుకోకూడదని నా తాపత్రయం"

మాలతి మనస్సు ఊగిసలాడింది. ప్రసాద్ చెప్పింది నిజమేననిపించి ఆఖరికి అతడితో వెళ్ళటానికి ఒప్పుకుంది.

తాళం తీసుకుని లోపలకు వెళ్ళి ఎటు చూసినా అస్తవ్యస్తంగా పడివున్న బట్టలు, పుస్తకాలు, చెత్త- అది గృహిణిలేని ఇల్లు అని చెప్పకనే చెప్తున్నాయి. ఎప్పుడూ ఇల్లు శుభ్రంగా వుండాలని కోరుకునే మాలతి ఆ ఇంటి తీరుచూస్తే చీపురు తీసుకుని ఊడ్చి అంతా సర్దాలనిపించింది.

కాని ప్రసాద్‌మటుకు గాలిలో తేలు తున్నాడు.తన ఇంటికి దేవత దిగివచ్చినట్టే వుందనిపించింది. ఆమెను ఎలా మర్యాద చెయ్యాలో తోచక ఆమె వద్దంటున్నా కాఫీచేసి ఇస్తానని తయారయ్యాడు ప్రసాద్. ఇంటిపనులు చేతకాని మగవాడు తడుముకుంటూ పనిచేస్తూంటే నవ్వుతూ చూస్తూ కూర్చుంది.

కాఫీ కప్పు ఆమె చేతికొకటి ఇచ్చి తానొకటి తీసుకున్నాడు.

"కాఫీ ఎలా వుంది?"

"బాగుంది"

అసలు విషయం ఎత్తడానికి సందేహించాడు ప్రసాద్. కాని ఏదో ఒకరోజున తేల్చుకోవాల్సిన విషయమే కదా!

"సిగరెట్లు మానేయటం కష్టంగా వుందా?"

"అవును. కాని కష్టపడితే ఫలం దక్కుతుంది కదా?"

"అవును. ఇప్పుడు కొంచెం కష్టమయినా ముందు ముందు మీ ఆరోగ్యం బాగుపడుతుంది"

"ఇప్పుడు నా ఆరోగ్యానికేమయింది?" తన దండలు బిగించి గర్వంగా చూసుకున్నాడు.

"ఇప్పుడింకా చిన్నవయస్సు. రక్తం, బలం వున్నాయి. భవిష్యత్తులో ఏమయినా చెడుపు చేయవచ్చు?"

"అతి సుందరమైన ప్రతిఫలం దొరక వచ్చుననే ఆశతో సిగరెట్లను దూరం చేశాను నేను. ఆరోగ్యం గురించికాదు" అని కాఫీతాగిన కప్పులు కడగసాగాడు. మాలతి, "వదలండి...నేను కడుగుతాను" అని ముందుకొచ్చింది.

"ఈరోజు మీరు నా ఇంటి అతిథి. ఇంతకి రెండ్రోజుల వ్యవధి కావాలి ఆలోచించుకోవటానికి అన్నారు... ఏం నిర్ణయించారు?"

మాలతి మాట్లాడలేదు.

"నా ప్రశ్న మిమ్మల్ని నొప్పిస్తే ఇంక ఆ మాట ఎత్తను. నాకు సున్నితంగా మాట్లాడటం రాదు. నా మాటా, చేతాకూడా మొరటే. నన్ను క్షమించండి..."

నీళ్ళు నిండిన కళ్ళతో తలెత్తి చూసింది మాలతి.

''ఎందుకేడుస్తున్నారు మాలతీ?" అంటూ ముందుకు వచ్చాడు ప్రసాద్. ఇంకో క్షణంలో ఆమెను దగ్గరకు తీసుకుని ఓదార్చేవాడే. మాలతి ఒకడుగు వెనక్కి వేసేసరికి ప్రసాద్‌కు తన తొందరపాటు అర్థమయింది.

"చెప్పానుకదా... నామాటా, చేతా కూడా మొరటే" అంటూ తన జేబులోంచి కర్చీఫ్‌తీసి ఆమెకిచ్చాడు.మాలతి కన్నీళ్ళు తుడిచి తలెత్తేసరికి ఎర్రబడిన ఆమె కళ్ళుచూసి,

"ఎర్రబడాల్సింది కళ్ళుకాదు బుగ్గలు'' అన్నాడు. మాలతి నవ్వింది.




"అప్పట్నించీ చూస్తున్నాను. నేనొక్కడినే మాట్లాడుతున్నాను...మీకు మాట్లాడటం వచ్చా?''

''నేను విధవని" చాలా చిన్నగా అంది మాలతి.

ప్రసాద్ పెద్దగా నవ్వి, "మీ పెళ్ళికి నేను వచ్చాను మాలతీ! ఒక్కడినేకాదు లక్ష్మితోసహా. మీకో కానుక కూడా తెచ్చాం" అన్నాడు.

"అలాగా....ఏమిటది?''

''వెండి కుంకుంభరిణ. 'అదదానికి పసుపూకుంకుమలకన్నా మించినదేదీలేదు. కుంకుంభరిణ ఇద్దాం అని' లక్ష్మి అంటే అలా చేశాం''

మాలతి కష్టపడి కన్నీరు ఆపుకుంది.

"నా విషయం తెలిసీ ఇలా అడుగుతున్నారు. ఇది తెలివితక్కువతనమా.... పిచ్చా?''

''పిచ్చి ప్రేమికులను పిచ్చివాళ్ళని అందరూ అంటారు...వినలేదా?''

"మీ నాన్నగారు, అన్నా వదినా అభ్యంతర పెట్టరా?''

"మా నాన్న సంగతి తెలియదు. మా అన్నా వదినా నాగురించి ఏమీ పట్టించుకోరు. పట్టించుకుంటే మంజుని మీ ఇంట్లో వదిలేవాడినా?"

''మీ నాన్నగారి అభిప్రాయం ముఖ్యం కాదా?"

''అవును. కాని ఆయనుంటున్నది కోడలి ఇంట్లో. ఆయన తన స్వంత అభిప్రాయం వ్యక్తపర్చటానికి స్వేచ్ఛ వుందనుకోను. ఆయనను బాధపెట్టకుండా మనం పెళ్ళి చేసుకోవచ్చు"

''మీకున్న ధైర్యం నాకులేదు''

''మనం ఏదయినా చెడ్డపని చేస్తూంటే భయపడాలి. మీరు భయపడాల్సిన అగత్యం ఎంత మాత్రం లేదు. కష్టానికి, సుఖానికి నేను మీకు తోడుగా వుంటాను. అయినా భయమేనా?''

"నాకుమా నాన్నగారి గురించే భయం. నా జీవితమిలా అయినదగ్గర్నుండీ ఆయన చాలా మారిపోయారు. అంతకుముందు ఎంత సరదాగా వుండేవారో మీకు తెలియదు. ఆయన్నిప్పుడు చూస్తే జాలివేస్తుంది. నేను ఆయన్ని ఏరకంగానూ నొప్పించలేను"

''నన్ను చూస్తే జాలికలగదా మీకు? మంజుని చూసి జాలిపడతారు. మీ నాన్నగార్ని చూసి జాలిపడతారు. నేను మాత్రం ఏం అపరాధం చేశాను మీ దృష్టిలో?"

''మంజు చిన్నపిల్లవాడు. నాన్నగారికి వయస్సయింది''

"అయితే నా స్థానం ఎక్కడ?'' ఆత్రుతగా అడిగాడతను.

''ఎక్కడా లేదు" కొంటెగా అంది మాలతి.

"అదే మీ ఆఖరు మాటా?" నిరాశ చెందిన మనస్సుతో అడిగాడు ప్రసాద్.

"అవును"

"పోనీలెండి. ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చారు...కృతజ్ఞుణ్ని" అంటూ బూట్లు వేసుకోసాగాడు.

''ఎక్కడికిప్పుడు?"

''మిమ్మల్ని ఇంట్లోదింపి మంజుని తెచ్చుకుంటాను"

"అలాగే కానివ్వండి"

బయటకు వెళ్ళబోతున్న మాలతిని ఆపుచేసి, తలుపుకి అడ్డంగా నిలబడి,అడిగాడు ప్రసాద్–"ఇంకోమారు చెప్పండి... మీ నాన్నగారి మనసు నొప్పించలేక ఈ నిర్ణయం తీసుకున్నారా... లేదా మీకు

నేనంటే ఇష్టం లేదా?''

"అపార్థం చేసుకోకండి. నేను నాన్నగారిని నొప్పించలేను''

''నన్ను నొప్పించగలరా?"

"నిక్షేపంగా. మీరింకా యువకులు. ఏందెబ్బతగిలినా తేరుకుంటారు"

"నిజం చెప్పండి మాలతీ! నన్ను ప్రేమిస్తున్నారా మీరు?"

అతడి ప్రశ్నకు జవాబు చెప్పలేక మౌనం వహించింది మాలతి.

"నేను సిగరెట్లు కాల్చకూడదని శాసించే అధికారం మీకెలా వచ్చింది?"

"మీరు మంజు తండ్రి గనుక"

"మరి నేను మంజుకోసం మీ ఇంటికి వచ్చినప్పుడు మీరు నాకంటబడకుండా ఎందుకు దాక్కునేవారు? మంజు తండ్రిని చూస్తే సిగ్గా?"

''అలా తినేసేలా చూస్తే మరింకేం చెయ్యను?"

ఆమెనే తదేకంగా చూస్తూ ప్రసాద్, "అయినా మీ అందం ఏ మాత్రం తగ్గలేదు. నా చూపుల తాకిడికి మీ అందం ఇనుమడించింది... మీరు గమనించారో లేదో" అన్నాడు.

మాలతి అతడివేపు చూడకుండా, "వెళ్దామా" అంది.



"ఇంకొకటే ప్రశ్న. మీ నాన్నగారు కాని ఒప్పుకుంటేమీరు ఒప్పుకుంటారా?"

"అది ఈ జన్మలో జరగనిపని''

"మనం జరగనిపని అనుకున్నది ఒక్కొక్కమారు జరుగుతుంది. అలా ఆయన వప్పుకుంటే?''

"నేను వెళ్తాను...దారి ఇవ్వండి" అని మాలతి అన్నప్పుడు ఓటమి ఖాయం అనుకున్న ప్రసాద్‌కి- ఓడిపోయింది మాలతి అని తెలిసింది.

ఎంత బింకం ఈ అమ్మాయికిఓమారు ప్రేమిస్తున్నానని చెప్తే పెదవులు కంది పోతాయని బెంగా? ఒక్కమారు నోటితో ఆమాట చెప్పి తన హృదయ దాహాన్ని తీర్చకూడదా?

"మాలతీ! ఒక్కమారు అమాట చెప్ప కూడదా?"

"ఏమాట?"

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను అని చెప్పండి"

"నేను చెప్పను"

"నావేపు చూడండి"

"చూడను" అంటూ తలవంచుకుంది మాలతి. ప్రసాద్ ఆమె గడ్డం పట్టుకుని మృదువుగా పైకెత్తి, "మాలతీ! సిగరెట్లు మానేశాక నా పెదవులు మళ్ళీ ఎర్రబడుతున్నాయి... చూడండి" అన్నాడు.

"నేను మీ అతిథిని"

"నాఅతిథి సత్కారంలో అదీభాగమే. చూడండి మాలతీ!"

"కృష్ణప్రసాద్‌గారూ...మీ పెదవుల ఎర్రదనాన్ని రాబోయే రాధకోసం దాచి వుంచండి" అంటూ ప్రసాద్ చేతిని మృదువుగా పక్కకు తీసి, "నన్ను వదలండి" అంది.

ప్రసాద్ ఆమెను వదిలి తాళం చేతికి తీసుకునేసరికి,

"మీ అతిథి సత్కారమంతా పూర్తయిందా?" అంది నవ్వుతూ.

"ఆఖరిది నన్ను చెయ్యనివ్వడంలేదు కదా మీరు! నేనేం చెయ్యను? మాలతీ! ఎవరికోసం ఈ అందం, చందం, వయ్యారం?"

"మీకోసం" అంటూ చటుక్కున బయటికొచ్చేసింది మాలతి.

మాలతితో కలిసి నడుస్తుంటే ప్రసాద్‌కు మేఘాలమీద నడుస్తున్నట్టుంది. మాలతిలాంటి అందగత్తె తనకు దక్కుతుందని అతనెన్నడూ అనుకో లేదు.

"మాలతీ!"మీహృదయంఅతికఠినం" అని ప్రసాద్ అనేసరికి మాలతి ఆశ్చర్యంతో తలపైకెత్తి 'ఎందుకు?' అన్నట్టు చూసింది.

"నాది అని మీరు చెప్పిన అందాన్ని చవిచూడటానికి కూడా అవకాశం ఇవ్వలేదు మీరు. కనీసం తనివితీరా చూసుకోనివ్వలేదు... ఎందుకని?"

"నాన్నగారి తీర్మానానికి తిరుగులేదు. గుర్తుంచుకోండి" హెచ్చరించిందిమాలతి.

"నన్నెందుకలా భయపెడతారు? నా భవిష్యత్తుకు మీరేం విలువ ఇవ్వరా? అపార్థం చేసుకోకండి. నా మూలంగా ఇప్పటికే నాన్నగారు చాలా బాధపడుతున్నారు. అదికాక శివుడి పెళ్ళి ఇంట్లో పెద్ద గొడవ తెచ్చిపెట్టేలా వుంది. దాని పరిణామం ఎలా వుంటుందో చూసుకుని మన విషయం నిర్ణయించుకుందాం... సరేనా?"

ప్రసాద్ మొహం నిరాశతో కుంగిపోయింది. వీధి దీపం వెలుగులో చెదిరిన జుత్తును చూసి మాలతి, "ఒక్క-

విషయంలో మాత్రం మీసు మంజు తండ్రి" అంది.

"ఏ విషయంలో?"

"మీ జుత్తు ఏ దువ్వెనకూ లొంగదు"

"కాని నా హృదయం మాత్రం అతి తేలిగ్గా మీకు లొంగిపోయింది" నవ్వుతూ జవాబిచ్చాడు ప్రసాద్.

అప్పుడే ఏదో గుర్తుకు వచ్చినట్టు, "మీ కర్చీఫుకి వేసిన సెంటు పేరేమిటి?"

"దాని పేరు చిలిపిదనం"

''అది లేకుండానే మీరు చాలా అల్లరి చేస్తున్నారు"

...తాను సృష్టించిన పాత్రకు జీవంపోసి, అద్భుతంగా నటించిన ఆమె నటనా చాతుర్యానికి ముగ్ధుడయాడతను. ముందు అతను మెచ్చుకున్నది ఆమె అభినయాన్ని! తర్వాత ఆమె అందాన్ని. ఆమెలోని నటనా సామర్థ్యాన్ని ఆమెనుంచి వేరు చేసి చూడలేకపోయాడు...

రాత్రి భోజనాలయ్యాక తోడికోడళ్ళు ముగ్గురూ పెరట్లో కూచుని తాంబూలం వేసుకుంటున్నారు. మాలతి వచ్చి కూర్చుంది.

''మామయ్యగారు పడుకున్నారా మాలతీ?'' సుశీల అడిగింది.

"లేదు. ఏవో కోర్టు కాగితాలు చదువుతున్నారు"

"నీ చదువయిందా?" అని కమల అడిగింది.

"ఊఁ...కమలొదినా! నేనో విషయం మీతో ఇంతవరకూ చెప్పకుండా దాచాను. అమ్మ లేనప్పుడు అమ్మస్థానంలో మీరందరూ వున్నారు. మీ సలహా తీసుకోకుండా నేనేం చెయ్యదల్చుకోలేదు"

"ఊఁ...చెప్పు. ఏమిటి విషయం?" విమల ప్రోత్సహించింది.

"ఒకవేళ...నేను మళ్ళీ పెళ్ళి చేసుకుంటానంటే మీరేం అంటారు?"

ఓ క్షణం నిర్ఘాంతపోయి చూశారు వదినలందరూ. ముందుగా తేరుకున్న సుశీలమ్మ, "మేమందరం నీకు పెళ్ళి చేయాలని అనుకున్నా ముందుకు వచ్చే ధైర్యం,విశాలహృదయంఎవరికుంటుంది?"

"అదీ నిజమే. ఈరోజుల్లో ఒకపెళ్ళి కావటమేకష్టం. అందులో.."అంది విమల.

''మీ రేమంటారు కమలొదినా?'' మాలతి కమలనడిగింది.

''అలాంటి పెళ్ళికొడుకు దొరికితే సంతోషంగా ఆశీర్వదిస్తాను''

''నిజమే మాలతీ! ఇంతవరకూ మేము ఎవరికీ చెడు చేయలేదు. మంచి జరిగేలా వుంటే అడ్డుపడతామా? నీకు నచ్చిన అబ్బాయి దొరికితే మేమందరం నీకు అండగా నిలుస్తాం" వదినలందరూ వప్పుకునేసరికి అమితమైనసంతోషం కలిగింది మాలతికి.

"మీరెవ్వరూ నా పెళ్ళికి అడ్డు పెట్టరని తెలుసు నాకు''

''ఇంతకీ అబ్బాయి ఎవరు?"

"మంజు తండ్రి''

''ప్రసాదా?"

''అవును''

'రావుగారు ఏమంటారో?' అన్న ఆలోచన అందరికీ వచ్చింది. మాలతికి ప్రసాద్‌తో పెళ్ళి అంటే చాలా సంతోషం కమలకి. ప్రసాద్ ఆమెకు తమ్ముడు. అతడి స్వభావం మంచిది. లక్ష్మి పోయినప్పటినుండి, ప్రసాద్ పెళ్ళిచేసుకుంటే సవతి తల్లి మంజుని ప్రేమగా చూసు

కుంటుందా-అని బెంగపెట్టుకున్న ఆమెకు మాలతి మంజుతల్లి అవుతుందంటే నిశ్చింతగా అనిపించింది. కాని రావుగారో?

"నాకూ నాన్నగారి గురించి బెంగగా వుంది. మీకు విషయం చెప్పాను. అన్నయ్యలకూ, నాన్నగారికీ చెప్పే బాధ్యత మీది. నా పెళ్ళివల్ల ఎవరూ బాధపడకూడదు...అది ముఖ్యం. అదీగాక శివుడు"

"శివుడేం చెయ్యబోతున్నాడు?" ఆత్రుతగా అడిగారు సుశీలమ్మ.

"వేరే కులం అమ్మాయిని చేసుకుందామనుకుంటున్నాడు. ఇవ్వాళో రేపో ఆ అమ్మాయిని ఇంటికి తీసుకొచ్చి పరిచయం చేస్తాడట. ఆ విషయంలో నాన్నగారేమంటారో చూసుకుని నా పెళ్ళి మాట ఎత్తుదాం" అంది మాలతి.

అందరి మొహంలోనూ ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది. అయితే త్వరలో ఇంట్లో సుడిగాలి లేవబోతోందన్న మాట.

* * *

కాని శివణ్ణతోటి ఇంట్లోకి అడుగు పెట్టిన అమ్మాయి సుడిగాలిలాలేదు. చల్లటి మందమారుతంలావుంది. రావుగారికి తప్ప మిగిలినవారందరికీ అసలు సంగతి చెప్పి శివుడు జయంతిని ఇంటికి తీసుకొచ్చాడు.

జయంతి మాలతిలా సన్నగా, పొడుగ్గా లేదు. కొంచెం పొట్టిగా, బొద్దుగావుంది. పెద్ద కళ్లు, ఎప్పుడూ నవ్వే పెదవులు, అందమయిన మొహం, నిరాడంబరంగా అలంకరించుకున్న జయంతి వదినలకందరికీ నచ్చింది.

నాటకాల్లో నటించడంవల్ల మేకప్ ఎక్కువగా చేసుకోవటం అలవాటయినా జయంతి శివుడివదినగార్లకోసం నిరాడంబరంగా అలంకరించుకుంది. పెదవులకు కనిపించీ కనిపించకుండా లిప్‌స్టిక్, కళ్ళకు కాటుక పెట్టుకుంది.

శివుడు అందర్నీ పరిచయంచేశాడు.

జయంతికి కాఫీ టిఫిన్ ఇచ్చారు. కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుతుంటే శివుడు, "మాలీ...జయంతి చక్కగా పాడుతుంది తెలుసా?" అన్నాడు.

"అలాగా?"

"ఊఁ... పెద్దవదినా ఈ అమ్మాయి నాటకాల్లో పాత్రలేస్తుంది. నేను రాసిన నాటకాల్లో నాయిక ఈమే" ఎంతో ఉత్సాహంగా శివుడు చెప్పినమాటవదినల ఉత్సాహాన్ని చప్పగా చల్లార్చేసింది. ఈ పిల్ల నాటకాలాడే పిల్లా అనిపించింది వారికి.

"ఏ నాటకాలు శివూ? నువ్వు రాసిన నాటకాల్లో పాత్రమేనా?" కొంచెం సందేహిస్తూనే అడిగింది కమల.

"లేదు కమలొదినా! ఇప్పుడు జయంతికి ఎంత డిమాండ్ వుందో తెలుసా? నాటకాల్లో మగవాళ్ళు ఆడపాత్రలు వేయటం కష్టం. అందులోనూ నాటకాల్లో బాగా నటించే ఆడవాళ్లు తక్కువ. ఎంత ఎక్కువ డబ్బు డిమాండ్ చేసినా ఇస్తున్నారు. బోలెడన్ని పోటీల్లో కూడా పాల్గొని బహుమతులు గెల్చుకుంది"

"అలాగా?" అన్నారు సుశీలమ్మ.

"జయంతి లలిత సంగీతం, నృత్యం, అభినయం లేకుండా బెంగుళూర్లో ఏ ఫంక్షన్ జరగదు" శివుడి గొంతులో ఎంతో అభిమానం, గర్వం.

కాని... పిరమో జయంతి గుణగానం, కళా ప్రావీణ్యం తెలుసుకుని పాతాళానికి కుంగిపోయారు. వదినలకు షాక్ తగిలిందని మాలతికి అర్థమయింది. మాలతికి ఒక్కదానికి మాత్రం జయంతి విషయం తెలుసు. మాలతి కాలేజిలో కూడా జయంతి డాన్స్‌ప్రోగాం అయింది.

"మొన్న బౌరింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో కూడా జయంతి ప్రోగ్రాం ఇచ్చింది. ఆరోజు అధ్యక్షత వహించిన మంత్రిగారు ఓ బంగారు పతకం ఇచ్చారు. చూపించు జయంతీ..."

జయంతి మెడలో గొలుసుకు వేసిన పతకాన్ని తీసి అందరికీ చూపించింది. "బాగుంది" అన్నది విమల నీరసంగా.

"ఇప్పుడేమైనా నాటకాల్లో వేషం వేస్తున్నావామ్మా?" అనడిగారు సుశీలమ్మ.

"ఊఁ... నాలుగు నాటకాల్లో వేస్తున్నాను"

"పెళ్ళి అయ్యాక వీటన్నిటికీ ఎలా తీరుతుంది?" అన్నారు సుశీలమ్మ.

"మనం తల్చుకుంటే ఏమైనా చేయవచ్చు. నటన నా ఊపిరి. దాన్ని వదులుకోలేను ఎప్పటికీ" జయంతి దృఢ నిశ్చయంతో చెప్పింది.

"అది నిజమైన కళాకారుల లక్షణం" అన్నాడు శివుడు మెచ్చుకోలుగా.

జయంతి, వదినల సమాగమం చూస్తూ కూర్చున్న మాలతికి ఊపిరాడలేదు. ఎక్కడ ఒకరినొకరు నొప్పించే మాటలాడుకుంటారోనని భయం వేసిందామెకు. జయంతి అందం వారికి నచ్చినా ఆమె నటన, నాట్యం వాళ్ళకు నచ్చవని ఆమెకు తెలుసు.

"ఇక రిహార్సల్‌కు టైమైంది వెళదాం" అని జయంతి లేచినపుడు మాలతి నిశ్చింతగా నిట్టూర్చింది.

పసుపూ, కుంకుమ, తాంబూలం ఇచ్చి సాగనంపారు సుశీలమ్మ.

శివూ, జయంతి బయటకు వెళ్ళాక ఇంట్లో పెద్దగా చర్చ జరిగింది.

"అత్తగారి అదృష్టం. చిన్నకొడుకు నాటకాల పిల్లని చేసుకుంటాడని తెలిస్తే ఆమె ఎంత ఉప్పొంగిపోయేవారో"

"కోరికోరి నాటకాల పిల్లనే చేసుకోవాలా శివుడు?"

"వాళ్ళ సాంప్రదాయం ఎలాంటిదో ఏమిటో?"

"మంచి సాంప్రదాయం ఇంటిపిల్ల అయితే నాటకాల్లో వేస్తుందా? డబ్బులు కూడా సంపాదిస్తుందిట నాటకాల్లో. ఇక శివుడు ఉద్యోగం మానేసి ఇంట్లో కూర్చోవచ్చు"

"పెళ్ళిలో పెళ్ళికూతురే డాన్స్ చేయచ్చు"

"ఆతర్వాత కూడా నాటకాలు వదలదట"

ఆ... ఆవిడ నాటకాలాడుతుంది. శివుడు చూస్తాడు... మాబాగా వుంటుంది కాపురం"

ఈ విషయంలో మాత్రం వదినల అభిప్రాయాన్ని సమర్థించలేకపోయింది మాలతి. నటన, నాట్యం మంచి కుటుంబానికి చెందిన అమ్మాయిలు చేయదగ్గ పనికాదని మాలతి ఎప్పుడూ భావించలేదు. కళ అన్నాక ఏ కళ అయినా గౌరవనీయమైనదే అని ఆమె ఉద్దేశం.

జయంతి నాటకాల్లో నటించవచ్చు, నాట్య ప్రదర్శనలివ్వొచ్చు. దానిలో తప్పేమిటి? జయంతి నటన మాలతికి కూడా చాలా నచ్చింది. గ్లిసరిన్ సహాయం లేకుండా కంట నీరు పెట్టగలిగే జయంతి నటనా చాతుర్యం అందర్నీ ఆకర్షించేది. నవరసాలు సునాయాసంగా జయంతి అందమైన మొహం మీద, విశాలమైన కళ్ళలో ప్రతిఫలించేవి.

శివుడు, జయంతి మొదట కలుసుకున్నదే నాటకంలో వేషం వేసినపుడు. తాను సృష్టించిన పాత్రకు ఆమె జీవం పోసి, అద్భుతంగా నటించినపుడు, ఆమె

నటనా చాతుర్యానికి ముగ్ధుడయ్యాడతను. మొదట అతడు మెచ్చుకున్నది ఆమె అభినయాన్ని! ఆ తర్వాత ఆమె అందాన్ని. ఆమె ఉత్తమ కళాకారిణి అని అతడికెంతో గర్వం. జయంతిలోని నటనా సామర్థ్యాన్ని ఆమెనుండి వేరుచేసి చూడ లేకపోయాడు శివుడు. జయంతి పరిచయ మయ్యాక జయంతి అతడి రచనలకు స్ఫూర్తినిచ్చింది. జయంతిని దృష్టిలో పెట్టుకుని అతడు చేసిన రచనలు జయంతి నటన మూలంగానే జనాదరణ పొందాయి.

జయంతి మంచి నటి అనే ఎన్నో నాటక సంస్థలనుండి ఆమెకు పిలుపు వచ్చేది. అందం, నటనా చాతుర్యం. సంగీతం, నాట్యం– అన్నీ కలిసి ఆమెకు మంచి పేరు తెచ్చిపెట్టాయి.

శివుడు జయంతిలోని కళకు మైమరచి పోయాడు. జయంతి శివుడిలో ఏం చూసిందో ఆమెకే తెలియదు. అబ్బాయి లతో చనువుగా మాట్లాడినా, వారితో కలిసి నాటకాల్లో అభినయించినా, వారితో కలిసి తిరిగినా ఎవరిపట్లా ఏరకమైన అను రాగమూ కలగలేదామెకు. ఆమెను పిచ్చిగా ఆరాధించినవారు బోలెడంత మందివున్నా నిర్వికారంగా వారితో మాట్లాడేది జయంతి.

జయంతిని ఇంటికి తీసుకువచ్చిన ఓ వారానికి శివుడు ఇంటివారందర్నీ జయంతి నటించిన ఓ నాటకం చూడటానికి తీసుకుని వెళ్ళాడు. రావుగారికి అసలు విషయం గురించి సూచన ఇవ్వడానికని ఆయన్నీ బయలుదేరదీశాడు బలవంతంగా.

"నేను రాసిన నాటకమది.మీరు చూసి తీరాలి. జయంతి అన్న అమ్మాయి చాలా బాగా నటిస్తుంది'' అని శివ చెప్పినపుడు ఆయన, ''ఆ నాటకం ఇవ్వు...చదువు తాను'' అన్నారు.

ఆయనను నాటకానికి బయలుదేర దీయాలంటే శివుడి తలప్రాణం తోకకు వచ్చింది. మొత్తానికి అన్నయ్యల్ని, వదినల్ని, మాలతిని అందరినీ బయలుదేర దీశాడు.

రావుగారి కుటుంబంకోసం ఓ వరస కుర్చీలను ప్రత్యేకించి వుంచింది జయంతి. తాను పెళ్ళిచేసుకోబోయే అబ్బాయి కుటుంబం వస్తారని ఎంతో ఉత్సాహంగా వుంది జయంతి.

ఆ నాటకంలో జయంతి ఆధునిక విద్యార్థిని పాత్ర వహించింది. ఒక్కొక్క సీన్లో ఒక్కొకరకమయిన దుస్తులు వేసుకుని కనబడినప్పుడల్లా ప్రేక్షకులు ముగ్ధు లయ్యారు.ఆమె సల్వార్,కమీజ్ వేసుకుని స్టేజిమీదకొచ్చినప్పుడు శివుడి వదినలు తలదించుకున్నారు. బొద్దుగా వున్న జయంతి వంటి వొంపులు ఆ బిగుతైన దుస్తుల్లో స్పష్టంగా కనబడుతున్నాయి. భుజంమీదున్న నైలాన్‌చున్నీ మాటి మాటికీ జారిపోతున్నది.

"మంచి కుటుంబంలోని ఆడపిల్లలు ఇలా వేలాదిమంది ప్రేక్షకుల ముందు కనబడతారా ఎక్కడైనా?"అని సుశీలమ్మ పక్కనున్న విమల చెవిలో గుసగుస లాడారు. రావుగారు మొహం చిట్లించి, ''ఆ పిల్ల కనుక మాలతి అయినట్లయితే అక్కడే ముక్కలుముక్కలుచేసేవాణ్ని" అని చిరచిరలాడారు.

ఇంకో దృశ్యంలో జయంతి మోకాలి పైకున్న ఫ్రాకు వేసుకుని కనబడినపుడు మాలతికి కూడా సిగ్గేసింది.

శివుణ్ని పెళ్ళిచేసుకునే అమ్మాయి ఇంకో యువకుడితో ప్రణయదృశ్యాలలో

అభినయించడం వీరిలో ఎవరికీ నచ్చలేదు. అతడు ఆమె చేయిపట్టుకోవడం, భుజం మీద చెయ్యివేసి తనవేపుకు తిప్పుకోవడం, బుగ్గమీదమృదువుగా తట్టడం-రావుగారింటి వారికి జుగుప్స కలగజేసింది.

నాయికానాయకులు సున్నితంగా కౌగిలించుకున్నప్పుడు ప్రేక్షకుల మధ్య నుండి ఈలలు వినవచ్చాయి.

నాటకం ఎప్పుడయిపోతుందానని ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చున్నారు రావుగారు. నాటకమయ్యాక ఆరోజు సమావేశానికి అధ్యక్షత వహించిన మంత్రిగారు జయంతి అభినయాన్ని మెచ్చుకుని వెండికప్పు బహూకరించారు.

శివుడు ఇంటికి వచ్చేసరికి వదినలంతా విషయం తమలోనే చర్చించి ఊసుకున్నారు. రావుగారు కొడుకుని చూడగానే చిరాగ్గా అడిగారు-

"అదేం నాటకంరా నువ్వు రాసింది? నీ రాతా,ఆ పిల్ల ఆటా ఒకదానికొకటిసరిపోయాయి. ఆ అమ్మాయికి అమ్మానాన్నా లేరా?''

''ఎందుకు లేరు....అంతా వున్నారు. వాళ్ళూ మనలాగానే మంచి సాంప్రదాయం గలవారే"

"ఆ పిల్ల తండ్రికి చెప్పు....ఎదిగిన పిల్లను అలా స్వేచ్ఛగా వదలటం మంచి పనికాదని"

శివుడు మాట్లాడకుండా ఇంట్లోకి వెళ్ళి పోయాడు.

తండ్రి తమ పెళ్ళికొప్పుకోరని ఖచ్చితంగా తెలిసిపోయింది. తండ్రితో దురుసుగామాట్లాడి తమ మధ్య విరోధాన్ని సృష్టించటానికి శివుడు సిద్ధంగాలేడు.

తన జీవన సహచరిని ఎన్నుకునే అధికారం శివుడికుందని, అంతా అతడిష్టమేనని అన్నయ్యలు చెప్పేశారు.

"భవిష్యత్తులో కష్టం, సుఖం అనుభవించేవాడివి నువ్వు. నీకు ఆ అమ్మాయి అన్నివిధాలా నచ్చితే మా అభ్యంతరం ఏమీలేదు. మీరు సుఖంగా వుండటమే ముఖ్యం" అన్నాడు కేశవ అన్నలందరి పరంగా.

"నువ్వేం చెప్తావ్ వదినా?" అని శివుడు పెద్ద వదినను అడిగాడు.

ఆమె రెండు నిమిషాలూరుకుని, ''నా స్వంత అభిప్రాయం చెప్పనా? నువ్వు అపార్థం చేసుకోకూడదు" అన్నారు.

"లేదొదినా...చెప్పండి"

"నేనేం చెప్పినా నీ మంచికేనని గుర్తుంచుకో శివా! నాకు నీమీద కాని, జయంతిపైనగాని ద్వేషం లేదు. నువ్వు కాపురం సుఖంగా వుండాలనుకుంటే జయంతిని పెళ్ళిచేసుకోకపోవటం ఉత్తమం''

''ఎందుకొదినా ... జయంతికేం తక్కువ?"

''అమ్మాయి చక్కని చుక్క. అది ఎవరం కాదనలేం. యౌవనపు పొంగులో, ప్రేమ నిషాలో పెళ్ళికిముందు దుర్గుణాలు కూడా సుగుణాలలాగా కనిపిస్తాయి. ఆ తర్వాత దాంపత్యజీవనం పాతబడి,ఒకరిపైనొకరికి ఆసక్తి తగ్గిపోయాక అంతకు ముందు కనిపించని దుర్గుణాలన్నీ కనిపిస్తాయి. అప్పుడు నీకు నువ్విప్పుడు మెచ్చుకుంటున్న నటనంటేనే చిరాకు వేస్తుంది...విమర్శిస్తావు.దానితో మీ ఇద్దరి మధ్యా గొడవలు వస్తాయి. ఆమె ఇంకెవరితోనైనా నటిస్తే, చనువుగా వుంటే నీకు అసూయకలగవచ్చు. అంతా ఆలోచించుకుని పెళ్ళి చేసుకోవటం మంచిది''

''నేను జయంతి కార్యకలాపాలకు



అడ్డురాను. ఈ షరతు పెట్టుకునే మేము పెళ్ళిచేసుకుంటున్నాం''

''పిల్లలుపుడితే ఏం చేస్తారు?"

"ఎవరైనా ఆయాను పెట్టుకుని మా పని మేము చేసుకునిపోతాం. నాటక రంగం తనని వద్దని తోసిపారేసేంతవరకు దాన్ని వదలకూడదనేది జయంతి నిర్ణయం"

"దేవుడు మీకు మేలు చెయ్యాలని కోరుకుంటాము" అని అక్కణ్ణించి లేచారందరూ.

పెళ్ళి ఓ రకంగా నిశ్చయమయ్యాక జయంతి అప్పుడప్పుడూ రావుగారి ఇంటికి రాసాగింది. చిన్నకొడుకు ఎవరో నాటకాల పిల్లతో తిరుగుతున్నాడని రావు గారి చెవినపడింది. కాని జయంతి, కొడుకుల మధ్యగల సంబంధం ఓ రచయితకూ, నటికీ వున్న సంబంధమేనని ఆయన అనుకున్నారు. అయితే జయంతి ఇంటికే వచ్చేసరికి రావుగారికి అనుమానం వచ్చింది.

ఓరోజు రావుగారు సాయంత్రం షికారు వెళ్ళబోతూండగా శివుడు జయంతితో ఇంట్లోకి అడుగుబెట్టాడు.

రావుగారు ముందు గుర్రం తోకలావున్న ఆమె జుత్తుని గుర్రుగా చూశారు.

శివుడు తండ్రికి ఆమెను పరిచయం చేశాడు.

"జయంతీ... మా నాన్నగారు"

రావుగారు జవాబు చెప్పకుండా ఆమె నమస్కారం చేసినప్పుడు గోళ్ళకు వేసిన ఎర్రరంగు చూశారు.

"ఆ గోళ్ళకు రాసిందేమిటమ్మా?" అని రావుగారు కసిరినట్టు అడిగారు.

జయంతి మొహం పాలిపోయింది. అప్పుడప్పుడూ నాటకాల్లో వేషం వేస్తూం డటంవల్ల కాస్త మేకప్‌వస్తువుల అవసరం వుంది. కాని రావుగారు మొహంమీద కొట్టినట్టు అడగవచ్చునని జయంతి కలలో కూడా అనుకోలేదు.

ఆమె శివుడివంక చూసింది. వారి అదృష్టం బాగుంది, ఆదేవేళకు రావుగారి స్నేహితులొకరు ఆయన్ను పిలవటంతో వారు బతికిపోయారు. దాంతో సంభాషణ ప్రకోపానికి దారితీయకుండా ఆగింది. తండ్రికి బదులుగా క్షమాపణ చెప్పు కున్నాడు శివుడు జయంతికి.

కాఫీ, టిఫిన్ ఇస్తూ మాలతి అడిగింది, "ఇప్పుడేం నాటకంలో వేస్తున్నారు జయంతీ?"

"వచ్చే నెల 'రక్తాక్షి' నాటకంవుంది. లింగన్నమంత్రి కూతురు రుద్రాంబ పాత్ర వేస్తున్నాను"

"మాలీ! రుద్రాంబకు పిచ్చెక్కే సీన్లో తన నటన నువ్వు చూసితీరాలి. చేతిలో కత్తిపట్టి, జుత్తు విరబోసుకుని రుద్రాంబ రక్తాక్షి అయినప్పుడు ఆమె అభినయంచూసి ఎవరైనా బెదరాల్సిందే"

"మీరు నాటకానికి తప్పక రావాలి" అని జయంతి మాలతిని ఆహ్వానించింది.

ఆ రాత్రి రావుగారింట్లో యుద్ధభేరి మోగింది. శివుడికి ఎన్నోరకాలుగా నచ్చ జెప్పాలని చూశారాయన.

"శివా! ఆ నాటకాలపిల్లను వదిలేయి. నీకు ఏరకంగానూ సుఖంవుండదు"

"నాకు నచ్చిన అమ్మాయిని నేను పెళ్ళిచేసుకుంటాను"

"నేను బతికుండగా సాధ్యంకాదు. రావుగారి కోడలు నలుగురిలోనూ సిగ్గు లేకుండా గెంతడమా? ఎవడో అపరిచితు డితో చెయ్యీ చెయ్యీ కలిపి అందరి ముందూ నటించడమా...సిగ్గుచేటు"

"అది ఉత్తి నాటకం"

"ఆ తర్వాత నీ ఇంటి ఇల్లాలుగాకూడా నాటకమాడుతుంది. ఆ పిల్ల మన ఇంటి కోడలు కావాలంటే ఆ నాటకాలాడటం మానాలి"

"అలా కుదరదు నాన్నా! నటనకూడా ఓ మంచికళ. జయంతి వదులుతానన్నా నేను ఒప్పుకోను"

"అయితే నీకూ, నాకూ ఏమీసంబంధం వుండదు"

ఓ నిమిషం శివుడి మనస్సు ఊగిస లాడింది. జయంతినిష్టపడినంత మాత్రాన తండ్రినొదులుకోవటం కష్టం. రావుగారు బెదిరిస్తే తాను జయంతిని వదులుకుంటా నని అనుకున్నారేమో!

"నేను జయంతిని వదులుకోలేను నాన్నా!"

"అయితే నా ఆస్తిలో చిల్లిగవ్వకూడా దక్కదు...గుర్తుంచుకో" అని పెద్దగా కేకలేశారు.

తండ్రి ఆస్తిలో వాటావదులుకోవటం శివుడికి కష్టమే! ఆయన తన వృత్తిలో చాలానే సంపాదించారు. ఒక్కో కొడుకుకి ఇల్లు, తోట, పొలం- అన్నీ వచ్చేలా





ఏర్పాటుచేశారు. కాకపోతే ఆస్తంతా ఆయన తన పేరిటే వుంచుకున్నారు. ఆస్తి స్వార్జితం కనుక ఎవరికీ మాట్లాడే హక్కు లేదు.. ఈరోజు దాన్ని ఆయుధం కింద వాడుకుంటున్నారాయన.

రావుగారికి ఆస్తిమీద ఎంత వ్యామోహమంటే-ఏ మనుపాటునకూడా ఇనప్పెట్టె తాళంచెవులు ఎవరిచేతికీ ఇచ్చేవారుకాదు. తనకెంత వంట్లో బాగాలేకపోయినా, అవసరమయినప్పుడల్లా ముక్కుతూ మూలుగుతూ ఆయనే తాళంతీసి కాయితాలు తీసేవారేకాని పెద్దకొడుక్కి బాధ్యత అప్పగించేవారుకాదు.

ప్రభుత్వం ఆస్తిమీద పన్ను వేశాక తప్పనిసరిఅయి ఆస్తిని వాటాలుచేశారు. కాని పెత్తనంమాత్రం ఎవరి చేతికీ ఇచ్చేవారు కాదు. ఆఖరికి ఇంటి అద్దెలు ఆయనే కాలినడకన వెళ్ళి వసూలుచేసుకునేవారు. మహేశుడు పోయాక కలిగిన విరక్తితో అద్దెలు వసూలుచేసే బాధ్యతను కేశవుడికి అప్పగించి, అతడు తెచ్చిన డబ్బుని రెండుమూడుసార్లు లెక్కపెట్టుకుని లోపల పెట్టుకునేవారు. రాజమ్మగారు బతికుండగా మాలతిపేర పసుపూ కుంకుమకోసం కొంచెం పొలం పెట్టమని పోరేవారు. అలాగే అనేవారుకానిఆయనకు తన పేరిటున్న ఆస్తిని ఎవరిపేరిట పెట్టటానికి చేతులు వచ్చేవికావు. ఇకమాలతికి పసుపుకుంకుమలే కరవైపోయాక ఆ ఆలోచన ఆయన మనసులోంచి పూర్తిగా తొలగిపోయింది. అన్నయ్యలున్నారులే, వారే చూసుకుంటారని తనకు తానే నచ్చచెప్పుకుని వూరుకున్నారు.

రావుగారు జీవించి వున్నంతవరకూ ఆయన ఆస్తిని అనుభవించే హక్కు ఆయన పిల్లలెవరికీ లేకపోయినా శివుడికి ఆస్తిని పూర్తిగా పోగొట్టుకోవాలనే సరికి ఓ నిమిషం చాలా కష్టమనిపించింది. తాను జీవితమంతా శ్రమించినా అంత ఆస్తిని సంపాదించలేడేమో!

అయినా జయంతిని వదులుకోలేక పోయాడు. ఆమె కళ్ళలోకి చూస్తూజీవిత కాలమంతా గడిపివేయవచ్చుననిపిస్తుంది. డబ్బుకన్న ప్రేమ ముఖ్యం-అని భావించే వయస్సు అతడిది. ఆస్తిని త్యాగం చేసి అమర ప్రేమికుల జాబితాలోకి చేరుతున్నానన్న భ్రమ అతడిది. పైగా రావుగారిది ఉత్త బెదిరింపే. అలా బెదిరిస్తే కొడుకు పెళ్ళిచేసుకోడన్న నమ్మకం ఆయనది. పెళ్ళి చేసుకుంటే ఆయనే తన తప్పు తెలుసుకుని దారిలోకి వస్తారు. పైగా జయంతి రేపు సినిమారంగంలో పెద్దపేరు తెచ్చుకున్నాక ఆయనే పశ్చాత్తాపపడతారు అన్న ఆశ అతడిది.

శివుడు, జయంతి పెళ్ళి నిశ్చయించుకున్నారన్న విషయం తెలిసి రావుగారు ఓరోజంతా భోజనం చెయ్యలేదు. నిద్రపోలేదు. బోనులో చిక్కిన పులిలా అటూ ఇటూ పచార్లు చేశారు. తమలో తామే పెద్దగామాట్లాడుకునిపిచ్చిగానవ్వసాగారు.

రావుగారి తీరు చూసి కంగారుపడింది మాలతి. ఆమె తండ్రిని, అన్నని గాని తప్పుపట్టలేకపోయింది. సనాతన సాంప్రదాయంలో పుట్టిపెరిగిన రావుగారు ఈకాలంవారి ఆలోచనా విధానాన్ని అర్థం చేసుకోలేకపోవటం సహజమే నన్పించింది ఆమెకు. అలాగే తనకు నచ్చిన పిల్లను పెళ్ళి చేసుకోవాలనుకున్న శివుడి కోరిక సహజమైనదిగా అనిపించింది. కేశవన్నయ్య, మాధవన్నయ్య లాగా నాన్నగారు కూడా తటస్థంగా వుండిపోతే ఎంత బాగుండును- అనిపిం

చింది. రావుగారి మనస్సు ప్రసన్నంగా వుంచటానికి మాలతి చేసిన ప్రయత్నా లేవీ ఫలించలేదు.

వాతావరణం ఇలా వున్నప్పుడు తన పెళ్ళి మాటెత్తడం సబబుగా అన్పించ లేదు. ఇంట్లోవారితోకూడా అదే చెప్పింది. దానితో ప్రసాద్ మామూలుగా ఇంటికి వచ్చినప్పుడు అల్లుడికి జరగాల్సినమర్యాద లన్నీ జరిగేవి.

"మన పెళ్ళిమాట ఎత్తితే రావుగారు ఏంచేసారో?" అన్నాడోరోజు ప్రసాద్.

"నేను ఆయన్ను ఒప్పించటానికి ప్రయత్నిస్తాను. ఆయన ఇష్టపడకపోతే మన పెళ్ళి జరగదు''

"అలా అంటే ఎలా మాలతీ?''

''తప్పదు. నాన్నగారు శివన్నయ్య తన ఇష్టానికి వ్యతిరేకంగా పెళ్ళి చేసుకో బోవటమే పెద్ద దెబ్బ. నేను కూడా అదే పని చేస్తే పిచ్చెక్కుతుంది. పైగా ఆయనకు నేనంటే చాలా ప్రేమ"

"ప్రేమయితే మీ సుఖసంతోషాలకు వారు అడ్డురాకూడదు... అవునా?"

"మీరు ఓ విషయం మర్చిపోతు న్నారు. నాన్నగారికి మూడు పాతికలు దాటింది వయస్సు. సనాతనాచారాలకు అలవాటుపడ్డ ఆయన కొన్ని ఆధునిక భావాల్ని వ్యతిరేకిస్తారు. కులం కారణంగా కాకుండా నాటకాల్లో సిగ్గులేకుండానటించే పిల్ల మన వంశగౌరవానికి తగదు- అన్న కారణం మూలంగా ఈ పెళ్ళి వద్దంటు న్నారు. ఇక ఇంత పేరున్న తమ కుటుం బంలో ఓ విధవ మళ్ళీ పెళ్ళి చేసుకోవ టాన్ని ఆయన ఆమోదించలేరు"

"స్వతంత్ర మనోభావాలున్న యువతీ యువకుల మధ్యనున్నప్పుడు వారికోస మయినా ఆయన పరిస్థితులతో రాజీ పడవద్దా?"

మాలతి బెంగగా, "మొదట శివన్నయ్య పెళ్ళి కానివ్వండి" అంది.

"అంతవరకూ నా పెదవులిలా ఎండి పోవల్సిందేనా?"

"కొంతకాలం ఓపికపట్టండి మరి"

"అంతయినా ఆశ చూపించారు. ధన్యుణ్ని" అన్నాడు ప్రసాద్.

శివుడి పెళ్ళిరోజు దగ్గరపడకొద్దీ ఇంట్లో వాతావరణంఅప్రసన్నంగాతయారయింది. రావుగారు పెళ్ళికి ఇంట్లోవారెవ్వరూ వెళ్ళ కూడదని ఆజ్ఞాపించారు. కాని మాధవుడు,

"భవిష్యత్తులో కష్టసుఖం అనుభ వించేది శివుడు. మీకిష్టం లేకపోతే మీరు రాకండి...మేం వెడతాం'' అనిఖచ్చితంగా చెప్పేశాడు.

ఇంట్లో శివుడి పేరెత్తకూడదని, వాడు బతికున్నా చచ్చిపోయినట్టే లెక్క అని రావుగారనేసరికి నొచ్చుకున్న మాలతి, "అపశకునపు మాటలాడకు నాన్నా!" అంది. రావుగారు కళ్ళెర్రచేసి, "మాలతీ! నీకూ వాడిపై స్నేహం ఎక్కువ. నువ్వు ఏమైనా వాడి పెళ్ళికి వెళ్ళావో నువ్వూ వాడితో బాటే చచ్చావనుకుంటాను" అన్నారు.

మాలతికి బాధగా అన్పించింది.

"అదేం మాట నాన్నా?"

"అదంతే. ఈ ఇంటి యజమానిని నేను. నేను చెప్పినట్టు విని పడుండేలా అయితే ఇక్కడుండండి. లేదా అందరూ ఇంట్లోంచి వెళ్ళిపొండి. నేను ఏదయినా హోటల్లో భోంచేసి కాలక్షేపం చేస్తాను. ఆస్తంతా మఠానికి రాసేస్తాను" అంటూ రంకెలేసి ఇంట్లోంచి బయటకు వెళ్ళి పోయారు.

తండ్రి మాటంటే గౌరవం మూలంగా

కాకపోయినా ఆయన్ను నొప్పించడానికి ఇష్టంలేక శివన్నయ్య పెళ్ళికి వెళ్ళే ఆలోచన మానుకుంది మాలతి.

పెళ్ళి ఇంకా వారం వుంది అనగా- శివుడు ఓ చిన్న ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. ఇద్దరూ కలిసి ఆ ఇంటిని తమకు కావలసినట్టు తీర్చిదిద్దుకున్నారు.

పెళ్ళిముందు రోజు భోజనంచేస్తూ. శివుడు నవ్వుతూ అన్నాడు, "మాలీ! ఇదే ఈ ఇంట్లో నా ఆఖరు భోజనం. ఇవాల్టి నుండి ఈ ఇంటికీ, నాకూ ఏ సంబంధం లేదు"

"అలా అనకు శివన్నయ్యా!" అంది మాలతి. ఆమెకు తెలుసు అతడెంత నవ్వుతూ మాట్లాడినా, అతడి మనసులో పుట్టి పెరిగిన ఇంటిని వదిలివెళ్ళాలంటేఎంత బాధ వుందో! భోజనమయ్యాక అందరి తోనూ చెప్పి రావుగారిపద్దకువచ్చి ఆయన కాళ్ళకు దండంపెట్టి, "మీరెప్పుడు కబురంపించినా రావటానికి నేను సిద్ధం. ఎంతయినా మేము చిన్నవాళ్ళం. మా తప్పుల్ని క్షమించాలి" అని బయటకు వెళ్ళాడు. అప్పుడు కూడా తమ కోపాన్ని, పట్టుదలని వదులుకోని రావుగార్ని చూసి ఈయన 'ఈ జన్మలో మారరు'-అనుకుంది మాలతి.

అయినా పెళ్ళిరోజు ఆఖరు క్షణం వరకూ ఆయన పెళ్ళికి రావచ్చునేమో అన్నఆశ వుండటంతో తానూముస్తాబు అయింది. ఇంట్లోవారందరూ హడావిడిగా తయారయి పెళ్ళికి బయలుదేరినా, ఆయన కనీసం గదిలోంచి బయటకు రాలేదు. అందరూ వెళ్ళాక రావుగారి గదిలోకి వెళ్ళింది మాలతి.

"ఏం నేను చచ్చానా, బతికానా అని చూడటానికి వచ్చావా?" అని గద్దించిన రావుగారు మాలతి ముస్తాబు చూసి-

"ఏం... వాడిపెళ్ళికి బయలుదేరావా? ఛో! ఇంతకీ నన్నెందుకు అడగటం? నేనున్నా లేనట్టే లెక్క మీ అందరికీ" అన్నారు కోపంగా.

మాలతి చిన్నగా, ''లేదు నాన్నా! నేను పెళ్ళికి వెళ్ళటంలేదు" అంది.

ప్రసన్నమైన ఆయన మొహం చూసి కొంచెం ధైర్యం తెచ్చుకుని-

"ఎందుకు నాన్నా...నీకింత పట్టుదల" అనడిగింది.

"మాలతీ... నాకు శివుడంటే ప్రేమ లేకనా? రంగులు పూసుకుని నాటకాలాడే పిల్లతో వాడు సుఖంగా కాపురం చెయ్యలేడు. మనం చూస్తూ వూరుకోవాలా?''

"ముందు ముందు శివుడు సుఖంగా లేకపోతే అది వాడి ఖర్మ. మనం ఎందుకు దెబ్బలాడి మనస్సు పాడుచేసుకోవాలి?"

''వాడు సుఖంగా వుండాలని కోరుకోవడం తప్పా?''

"పెళ్ళి అయ్యాక వాడికీ జయంతికీ పడలేదనుకో. డైవోర్సు తీసుకుంటాడు. ఇప్పుడు పెళ్ళంటే బ్రహ్మముడి అని భయపడాల్సిన అవసరంలేదు''

"మాలతీ.., ఎవరికయినా పెళ్ళి ఒక్కమారే అవుతుంది. ఆ తర్వాత వదిలేసి వేరేవారిని కట్టుకుంటే అది పెళ్ళి కాదు? ఈమాత్రం దానికి పెళ్ళి మాత్రం దేనికి. రోజుకో పిల్లతో హాయిగా తిరగచ్చుగా?"

ఇక మాట పెంచకుండా బయటకు వచ్చింది మాలతి. తన పెళ్ళికి తండ్రి ఆశీర్వాదందొరకదని ఖచ్చితంగాతెలిసింది. వరండాలో కుర్చీలోకూర్చుంది. ఎక్కడో జరుగుతున్న పెళ్ళిగురించి ఆలోచిస్తూంటే ప్రసాద్ వచ్చాడు.

''పెళ్ళికి రాలేదేం? మీరు కనబడక

పోతే ఇక్కడకు వచ్చాను. పెళ్ళికోసం ముస్తాబయ్యి రాలేదేం" అనడిగాడు ప్రసాద్.

"నాన్నగారిని నొప్పించలేక"

ప్రసాద్ మొహం కళ తప్పింది. ఈమె తండ్రి మాటకంత విలువ ఇస్తే ఇహ తమ పెళ్ళయినట్టే అనుకున్నాడు.

"పెళ్ళయిపోయిందా?"

"లేదు ఇంకా ముహూర్తానికి టైముంది. మిమ్మల్ని తీసుకుని వెడదామనేవచ్చాను"

"వద్దు... నేను రాలేను"

"ఈ ముస్తాబంతా వృధా కావాల్సిందేనా? కనీసం నాకో..."

మాలతి గంభీరంగా అంది, "మన పెళ్ళికి నాన్న గారెప్పటికీ ఒప్పుకోరు"

"అలా అయితే ఓపని చేద్దాం!ఇద్దరం పారిపోయి రిజిస్టర్ పెళ్ళి చేసుకుందాం"

"నాన్నగారు ఈరోజున ఓ కొడుకుని పోగొట్టుకున్నారు. ఈ వయస్సులోవున్న ఒక్కకూతుర్నీ పోగొట్టుకోవటం కష్టం. ఆయన ఉన్నంతవరకూ మన పెళ్ళి జరగదు. ఆ తర్వాత చూద్దాం"

"అప్పటికి మనం ముసలివాళ్ళం అయిపోతాం" నిరాశగా నవ్వుతూ అన్నాడు ప్రసాద్.

"ముసలివాళ్ళమయ్యాకనే పెళ్ళి చేసుకుందాం"

"మీరు చాలా చెడ్డవాళ్ళు. నన్నిలా బాధపెట్టడంలో మీకేం సంతోషం కలుగుతుందో తెలియదు"

మాలతి అతడిని ఓదార్చే ప్రయత్నం చేస్తూ, "నాన్నగారి మనసు మార్చటానికి నా ప్రయత్నం నేను చేస్తాను. మీకొక్కరికేనా ఆత్రుత... నాకు లేదా?" అంది.

"నేను మీ మాటలు నమ్మను"

"నమ్మించనా?" అంటూ మాలతి లేచి ముందుకువంగి, సిగరెట్లు మానేయడం వల్ల ఎర్రబడిన పెదవులకు ఒక్కమారు ముద్దుపెట్టి మెరుపులా మాయమయింది.

రాత్రి పదిగంటలయ్యాక పెళ్ళికి వెళ్ళినవాళ్ళు వెనక్కి వచ్చారు. కమల వచ్చి మాలతికి పెళ్ళి విశేషాలు చెప్పారు.

"మాలతీ! ఓ మంచి వార్త. జయంతికి సినిమాల్లో చేరటానికి ఛాన్స్ వచ్చిందిట. 'రక్తాక్షి' నాటకం చూడటానికి ఓ నిర్మాత వచ్చారట. ఆయన ఆమె అభినయం చూసి మెచ్చుకున్నారట"

"అలాగా?"

"వధువుగా జయంతి చాలా అందంగా కనిపిస్తోంది. ఆ నిర్మాత కూడా పెళ్ళికి వచ్చి జయంతికి బంగారు గొలుసు, శివుడికి గడియారం ఇచ్చారు"

"మంచిది"

"పైకి నవ్వుతూనే వున్నా శివుడికి మీరిద్దరూ రాకపోవటంవల్ల చాలా నిరాశ కలిగింది. రావుగారుసరే... నువ్వెందుకు రాలేదు?"

"ఇంత పెద్ద కుటుంబంలో తనపక్షం ఎవరూ లేరని అనుకుంటున్నారు నాన్నగారు. అది తప్పని ఋజువు చెయ్యడంకోసం ఉండిపోయాను"

"పెళ్ళికి ప్రసాద్ వచ్చాడు... చాలా హుషారుగా వున్నాడు"

"మంచిది"

శివుడి పెళ్ళయినవారంలో రావుగారు చిన్నకొడుకు పేరనుంచిన డబ్బు, పొలం, ఇల్లు అంతా తమ పేరుకు మార్చించుకున్నారు. శివుడి పేరు ఇంట్లో ఎవరూ ఎత్తకూడదని శాసించారు.

ఆయిన చర్యలవల్ల ఎక్కువ బాధపడినది మాలతి.

పరీక్షలు దగ్గర పడుతున్న కారణంగా వ్యక్తిగత సమస్యలన్నీ ఓ మూలకు నెట్టి చదువుమీద మనసు కేంద్రీకరించటానికి ప్రయత్నించింది.

శివుడు పెళ్ళయ్యాక మళ్ళీ తండ్రి ఇంటికి రాలేదు. అన్నయ్యలని బయటే కలుసుకుని యోగక్షేమాలు కనుక్కునే వాడు. ఓ రెణ్నెల్లు మాలతి శివన్నయ్యని కలుసుకోలేదు. ఓరోజు రోడ్డుమీద శివుడు కనిపించేసరికి ఎంతో ఉత్సాహంగా అతడిని పలకరించింది. కాలేజీ ఎగ్గొట్టి అతడి వెంట వారి కొత్త సంసారం చూడటానికి వెళ్లింది.

"శివన్నయ్యా! నువ్వు సుఖంగా వున్నావా?" అని మాలతిఅడిగినప్రశ్నకు, "చాలా. జయంతి ఉత్తమ ఇల్లాలు. నేనంటే ఎంత ప్రేమంటే ఒక్కక్షణం కూడా నన్నొదిలి ఉండలేదు" అన్న శివుడి జవాబు విని చాలా సంతోషించింది.

వారిద్దరితో మాటాడుతుంటే చాలా త్వరగా టైం గడిచిపోయింది.

"నీ పెళ్లివిషయం ఏంచేశావుమాలీ?"

"ఈ జన్మలోజరగనిపని శివన్నయ్యా! ముందు చదువుకానీ! తర్వాత చూద్దాం"

"నాన్నగారంటే భయంతో పెళ్ళి మానుకోకు మాలతీ! ఓమారు పెళ్ళయితే అన్నీ సర్దుకుపోతాయి"

"అని నువ్వనుకున్నావు శివన్నయ్యా! నాన్నగారి స్వభావం నీకు తెలీదా? నీ పెళ్ళయినవారంలో నాన్నగారు నీ పేరనున్న ఆస్తి అంతా తన పేరుకు మార్చుకున్నారు తెలుసా?"

మాలతి చెప్పిన వార్త విని శివుడి మొహం పాలిపోయింది. జయంతి అతన్ని ఓదారుస్తూ, "ఆ ఆస్తి మనకక్కర్లేదు. నాకెలాగూ సినిమాల్లో నటించటానికి పిలుపు వచ్చింది. మీరు కథలు, సంభాషణలు రాస్తారు. శెలవుల్లో వెళ్ళి మనపని ముగించుకుని వద్దాం" అంది.

అయినా ఇంకా దిగులుగావున్న శివుణ్ని ఓదారుస్తూ మాలతి, "ఆ డబ్బు ముఖ్యమాశివన్నయ్యా?మనిషికిముఖ్యంగా కావలసినది తృప్తి, సంతోషం. అవి వుంటే చాలు" అంది.

శివుడు మాలతిని ఇంటిదాకా దిగబెట్టాడు. మాలతి మాత్రం తాను అతడింటికి వెళ్ళిన విషయం తండ్రితో పొరబాటున కూడా చెప్పలేదు.

మాలతి పరీక్షల కోసం చాలా కష్టపడి చదివింది. పరీక్షలయ్యాక నిశ్చింతగా నిట్టూర్చింది. మాలతి పరీక్షలయిపోవడం గురించే వేచివున్న ప్రసాద్, ఆరోజు సాయంత్రమే వచ్చి రావుగారితో పెళ్ళి విషయంతాను మాట్లాడుతానని మాలతితో అన్నాడు. కాని మాధవుడి ముందు ఆ మాట ఎత్తటం మంచిదని అతణ్ని వారించింది.

పరీక్షలయిన ఓ నెల తర్వాత ఓరోజు రాత్రి భోజనాలయ్యాక, ఏదో పిచ్చాపాటి మాట్లాడుతున్నప్పుడు మాధవుడు,

"మాలతి పరీక్షలయ్యాయి. ఇంకేం చేద్దాం నాన్నా?" అన్నాడు.

"రిజల్టురానీ"

"పాసవుతుంది. బాగా రాశానని చెప్పింది. ఇంకముందేం చేయాలిమాలతి?"

"అది ఉద్యోగం చేయటం నాకెంత మాత్రం ఇష్టంలేదు. మన ఇంటి ఆడపిల్లలెవరూ ఇంతవరకు ఉద్యోగం చేయలేదు. అలాంటి ఆలోచన నీకేమైనావుంటే వదులుకో. నేను బతికుండగా జరగనిపని అది"

"అయితే ఏం చేయాలి?"

చికాగ్గా అన్నారాయన - "చేసేందుకేముంది? ఉమ్మడి కుటుంబంలో పనికి లోటా? వదినలకు సాయం చెయ్యనీ, పిల్లలకు పాఠాలు చెప్పనీ. ఇక్కడ విసుగనిపిస్తే రెండ్రోజులు అత్తగారింటికి వెళ్ళిరానీ"

"ఏ అత్తగారు?"

"మహేశుడి తల్లిదండ్రులు''

"మహేశుడే లేనప్పుడు వారికీ, మనకీ ఎలాంటి సంబంధం? పైగా మహేశుడి చావుకి మాలతి అడుగుపెట్టిన వేళావిశేషమే కారణమని తిట్టారు. అలాంటి వారింట్లో మాలతి వుండగలదా?"

''సరే...ఇక్కడే వుండనీ"

"ఇంత చిన్న వయసులో మూల నుండే ముసలమ్మలా కృష్ణా రామా అనుకుంటూ ఉండగలదా! అలా ఉండమనడం న్యాయమా?''

తాము సూచించిన పరిష్కారాలన్నింటిలో ఏదో ఒక తప్పు మాధవుడు ఎత్తి చూపుతూండటంతో రావుగారికోపం తారాస్థాయికి చేరుకుంది.

''దానికి రెండోపెళ్లిచేయి" అన్నారు చికాగ్గా.



చాలా శాంతంగా మాధవుడు అన్నాడు - "నా మనసులోని మాటే చెప్పారు"

కొంచెంసేపు రావుగారి నోటిమాట రాలేదు. వచ్చాక-"ఏమన్నావు?" అనడిగారు.

"మాలతికి మళ్ళీ పెళ్ళిచేద్దాం అనుకుంటున్నాను"

"నా కంఠంలో ప్రాణం వుండగా జరగనిపని. ఇది నీ బుర్రలో పుట్టిన ఆలోచనేనా? మాలతి అభిప్రాయమేమిటి?"

"ఇది మా ఇద్దరి అభిప్రాయం''

''మళ్ళీ పెళ్ళిచేసుకోవాలని మాలతి ఆశపడుతోందా? తన నోటినుండి వింటే తప్ప నేన్నమ్మను''

"తప్పేముంది దీన్లో? మాలతి కన్యా విధవ. ఇంకా చిన్న వయస్సులో వుంది. జీవితమంతా ఏ ఆధారం లేకుండా ఎలా జీవించాలి మాలతి?''

"మనవాళ్ళలో ఇంతవరకూ ఎవరూ ఇలాంటి పనిచేయలేదు. ఇప్పుడు మాలతి చేస్తే మనం మనవాళ్ళలో తలెత్తుకు తిరగ్గలమా?''

"ముందుముందు మాలతి కష్టసుఖాలు చూసేది మనమే కాని మనవాళ్ళు కాదు"

రావుగారు గంభీరంగా "మాధవరావ్! మనం ఈ విషయం చర్చించడం అనవసరం. నువ్వు పెళ్ళి చేస్తానన్నా మాలతిని చేసుకునేవాళ్ళెవరు?" అన్నారు.

''మాలతిలాంటి అమ్మాయిని చేసుకోవటానికి చాలామంది సిద్ధంగా వుంటారు. ప్రసాద్‌కిచ్చి ఎందుకు పెళ్ళి చేయకూడదు?''

రావుగారి అభిమానానికి దెబ్బతగిలింది. ప్రసాద్ కొడుకు వంకపెట్టుకుని వచ్చి చేసిన పని ఇదన్నమాట అనుకున్నారు.

''మీరంతా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చి నన్ను అడుగుతున్నారా? మీ ఇష్టంవచ్చినట్టేడవండి. ఓ కొడుకుతో బాటు ఈ కూతురూ పోయిందనుకుని ఊరుకుంటాను" అని లేచి అక్కణ్నించి దూకుడుగా వెళ్ళిపోయారు. ఆ రోజుకి జరిగిన చర్చ చాలునని మాధవుడు కూడా ఊరుకున్నాడు.

పక్క గదిలోనుండి ఆ మాటలు వింటూకూర్చున్న మాలతికి తన కలలన్నీ కరిగిపోయినట్టనిపించింది. రావుగారు మహేశుడికిచ్చి పెళ్ళిచేసినప్పుడు మాలతికి అసంతృప్తి ఏమీ లేదు. అతడలా చనిపోతాడని ఎవరనుకున్నారు.మళ్ళీ ప్రసాద్‌తో ప్రేమలో పడకపోతే మాలతి జీవితాంతం విధవగానే వుండిపోయేదేమో!

రావుగారు ఈ పెళ్ళిని వ్యతిరేకించటానికి కారణం మాలతికి తెలుసు. రావుగారికి వారి కులంలోనే చాలా సాంప్రదాయవాదులన్న పేరుంది.

శివుడు నాటకాల్లో నటించే జయంతిని చేసుకోవడంవల్లనే ఆయన తమ పేరు కెంతో దెబ్బ తగిలిందని భావించారు. అలాంటప్పుడు మాలతి మళ్ళీ పెళ్ళి చేసుకుంటే ఇంక ఆయన తలెత్తి తిరగలేరు. ఆయన ఆలోచనాధోరణి తెలిసిన మాలతికి తన పెళ్ళికి ఆయన ఒప్పుకోలేదని కోపం రాలేదు.

కాని తన, ప్రసాద్ జీవితాల మాటేమిటి?

తాను ప్రసాద్‌ను ఎన్నుకుంటే ఆయన ఇంక తన మొహం చూడరని తెలుసు. ఆయన ఆశీర్వదించని పెళ్ళి చేసుకుంటే తాను మాత్రం సుఖంగా వుండగలదా?

బాగా ఆలోచించి మాలతి తాను

ప్రసాద్‌ను వదులుకోవటమే ఉత్తమం అన్న నిర్ణయానికి వచ్చింది. ఆదేమరునటి రోజు మాధవన్నయ్యతో చెప్పింది.

మాధవుడు, "పెళ్ళంటూ చేసుకుంటే ఆయనే దారికొస్తారు. నీమీదున్న అమిత మైన ప్రేమకొద్దినైనా వచ్చిఆశీర్వదిస్తారు" అని ధైర్యం చెప్పబోయాడు.

"ఎవరిమీద మనకు ఎక్కువ ప్రేమ వుంటుందో వారు మనల్ని ఎక్కువ బాధ పెట్టగలుగుతారుకదూ?"

"మాలతీ...నాన్నగారి కాలం అయి పోయింది. ఆయన యువకుల సంతోషా నికి అడ్డురాకూడదని నా అభిప్రాయం"

"కొత్త అభిప్రాయాలను స్వీకరించ లేనంతగా ఆయన పాత అభిప్రాయాలకు అలవాటుపడ్డారు" రావుగారి పరంగా వాదించి తన నిర్ణయాన్ని చెప్పిందిమాలతి

రావుగారు తమ పిసినారితనం, పట్టు దలల మూలంగా అందర్నీ దూరం చేసు కున్నారు. అయినా మాలతికి మాత్రం ఆయనపట్ల ప్రేమ, జాలివున్నాయి. పైకి శివుడు తమని వదిలివెళ్ళాడన్న బాధ తమకేంలేదని అన్నా, ఓ నాటకాల పిల్లకోసం తమని వదిలివెళ్లాడన్న బాధ ఆయన్ని తినేస్తోంది.

అసలే దెబ్బతినివున్న ఆయన, ఆయన కత్యంతప్రియమైన కూతురు ఆయన్ని వదులుకుంటే ఆయన ప్రాణాలతో వుంటారా-అన్న భయం మాలతికి. ఆ భయంకొద్దీ అన్నయ్యలు ఎంత నచ్చ జెప్పినా వినలేదు.

ఇక ఆమెకు మిగిలిన అతి కష్టమైన పని-తన నిర్ణయాన్ని ప్రసాద్‌కుచెప్పడం రేపు రేపని ఆ పనిని వాయిదా వేసు కుంటూ వచ్చింది. వీలయినంత సున్ని తంగా అతడికి విషయం చెప్పాలన్న కోరిక ఆమెది.

ప్రసాద్ ఇటీవలరావుగారింటికిరావేదు ఈసరికి తమ పెళ్ళి విషయం ఎత్తి వుంటారు. రావుగారి రియాక్షన్ ఎలా వుంటుందో తెలియని ప్రసాద్ అటువేపు వెళ్ళలేదు. వెళ్ళకుండా వుండలేక ఇరకాటంలో పడ్డాడు. అలా వుండగా కమల తమ కొడుకు పుట్టినరోజు నాడు భోజనానికి ప్రసాద్‌ని మంజుని తీసుకు రమ్మని కబురంపారు.

ఆ విషయం తెలిసిన రావుగారు రంకెలు వేశారు.

"మీరంతాకలిసి గూడుపుఠాణి చేశారు. ప్రసాద్‌పైన జాలిపడి ఇంట్లోకి రానిచ్చి నందుకు ఇంటికే ఎసరుపెట్టాడు"

ఆయన కోపంతో ఎగురుతూంటే మాధవుడు శాంతంగాచెప్పాడు-

"ఇప్పుడు మీరు రంకెలేయాల్సినంత ఘోరం ఏంకాలేదు"

"ఇంకా ఏంకావాలిట? నా కాలంలో ఇలాంటి అనాచారాల్ని జరగనివ్వను. మీకాలంలో మీ ఇష్టం వచ్చినట్టు అఘో రించండి" రావుగారు మండిపడ్డారు.

"ఇదింకా ఎవరికాలం అనుకుంటు న్నారు నాన్నా? ఏరోజునైతే మీరు రిటై రయ్యి మేము సంపాదించటం మొద లెట్టామో ఆ రోజునే మీకాలం అయిపోయి మా కాలం మొదలయింది. మీరు బతి కున్నంతకాలం మీఇష్ట ప్రకారమే జరగా లని సాధిస్తే ఎలా? మాకాలంలో వున్న ప్పుడు దాని కనుగుణంగా సర్దుకు పోవాలి"

"పిదపకాలం పిదపబుద్ధులూను. ఇవాళ ప్రసాద్‌నిరానీ...మళ్ళీమన ఇంటిగుమ్మం తొక్కకుండా చేస్తాను" అని బెదిరిం చారు రావుగారు.

"చెయ్యండి. రావుగారు ఎంత బాగా అతిథి మర్యాదలు చేస్తారో అందరికీ తెలుస్తుంది"

"వచ్చిన అతిథి అర్జునుడిలాంటి సన్యాసి అయితే ఏంచేయాలిట?"

"ఏం...అర్జునుడికన్నా మంచి భర్త దొరికేవాడా సుభద్రకు? మీరు ప్రసాద్‌ని అవమానిస్తే మేమందరం మీకు దూర మవుతాం...గుర్తుంచుకోండి'' అని మాధవుడు గొంతు హెచ్చించకుండా, ఖచ్చితంగా చెప్పేసరికి రావుగారు మరోదారి లేక వూరుకున్నారు. ఆరోజంతా గది లోంచి బయటకు రాలేదాయన.

ఆరోజు గదిలోంచి బయటకురాని మరో వ్యక్తి మాలతి.

తండ్రితోవచ్చిన మంజు, మాలతి గది లోకి వెళ్ళి"నాన్నగారు రమ్మంటున్నారు" అని చెప్పినా బయటకు రాలేదామె!

ఆదివారం ఉదయం పదకొండు గంటలకు వచ్చిన ప్రసాద్‌కు సాయంత్రం ఆరుగంటలవరకూ మాలతి దర్శనమివ్వ లేదు. అప్పుడయినా ఓక్షణం మెరుపులా కనిపించి తోటలోకి రమ్మని చెప్పి మాయ మయింది. అక్కడ పనిచేసుకుంటున్న తోటమాలిని చుట్టలు కొనుక్కొమ్మని డబ్బులిచ్చి పంపేసింది.

ఎంతో ఆత్రుతగా అక్కడకు వచ్చిన ప్రసాద్, "ఉదయం వచ్చినవాడికి ఇప్పు డయింది దేవీదర్శనం. ఇంత కఠిన హృద యులైపోయారేమిటి మీరు?" అన్నాడు.

పేలవంగా నవ్వి, ''కూర్చోండి"అంది మాలతి, చూడముచ్చటగావున్న అతన్ని చూస్తూ. ఎర్రటి జరీ అంచుపంచె, తెల్ల చొక్కా, ఉత్తరీయాల్లో ప్రదానం పెళ్ళి కొడుకులావున్నాడతను.

అతడు కూర్చుని, ఇంకా నిల్చునేవున్న మాలతిని చూసి చిలిపిగా–

"కూర్చోండి. మీకేమీ అభ్యంతరం లేకపోతేమీ ఆసనంమీకువుంది"అన్నాడు.

"ఆ ఆసనం నాదికాదు"

"ఏమిటి?" అని నిర్ఘాంతపోయాడు ప్రసాద్.

"అవును. ఈవిషయమై నాన్నగారికీ, మాధవన్నయ్యకీ పెద్ద దెబ్బలాటయి పోయింది. తాను జీవించివున్నంతవరకూ ఈ పెళ్ళి జరగటానికి వీల్లేదని ఖచ్చితంగా చెప్పేశారాయన"

"అయితే ఆయన చనిపోయేవరకూ మనం కాచుకుని వుండాలా?''

"పెళ్ళికి ఇంకొకరి చావుకోసం ఎదురుచూడటంలో అర్థంలేదు. మీరు నన్ను మర్చిపోండి"

"మాలతీ! మీరు రావుగారి కూతురు కనుక మీకు ఆస్తి పోతుందన్న భయం లేదు. అయినా...''

''ఆస్తికోసంకాదు. ఆయన ప్రేమా భిమానాలు కోల్పోవటానికి సిద్ధంగా లేను. ఇప్పటికే శివన్నయ్యని పోగొట్టుకున్నారు. నన్ను పోగొట్టుకుంటే ఆ దుఃఖం భరించ లేరు''

"నా దుఃఖం మీకు లెక్కలేనిదా?'' అన్నాడు కోపంగా ప్రసాద్.

''మీరు వయస్సులో వున్నారు. త్వరగా కోలుకోగలరు"

"వయస్సులో వున్న వారికి హృదయం ఉండదనా మీ అభిప్రాయం?"

"అలాకాదు. దేహానికి కాని, మనసుకు కాని దెబ్బతగిలితే వయస్సులో వున్నవారు కోలుకున్నంత త్వరగా పెద్దవారు కోలు కోరు. కృష్ణప్రసాద్...నన్ను క్షమించండి, మర్చిపోండి''

"మర్చిపోతాను...క్షమించను"

"మీకు తెలియదు ఈ నిర్ణయానికి రావాలంటే నేనెంత బాధపడ్డానో!''

''సరే...నేనింక వెళ్తాను. ఓ నాలుగు రోజులు రంగుల స్వప్నలోకంలో నేను విహరించేలా చేసిన మీకు కృతజ్ఞుణ్ని. నమస్కారం'' అని అతడు చేతులు జోడించినప్పుడు, అత్యంత ఆత్మీయుడు అపరిచితుడయిపోవటంతో భరించలేని దుఃఖం కలిగింది మాలతికి.

''నామీద కోపం తెచ్చుకోకండి'' అని బతిమాలుకుంది మాలతి.

"నాకేం కోపంలేదు''

అతడు వెళ్ళిపోయాక కూడా ఎంతోసేపు చీకట్లో అలానే కూర్చుంది.



## 9

....వయసు పైబడుతున్న కొద్దీ మనసు విశాలం కావాలి. ఈ వయసులో కూడా సంపాదించాలి, కూడబెట్టాలి అని తనకే అన్ని కోరికలుంటే చిన్నపిల్ల మాలతికి మరెన్ని కోరికలుండాలి? అలాంటిది ఆమె ఎంత వైరాగ్యం పెంచుకుంది?...



ఆరాత్రి మళ్ళీ మాలతి పెళ్ళి విషయంలో రావుగారికీ, కొడుకులకీ మధ్య పెద్ద ఘర్షణ జరిగింది. ఎవరెంత చెప్పినా నాకాలంలో జరగనివ్వను-అన్నదే ఆయన జవాబు.

"కొత్త పాత అభిప్రాయాలమధ్య ఘర్షణవల్ల ప్రయోజనం లేదు నాన్నా! రాజీ మార్గం వెతుక్కోవాలి. ప్రవాహానికి ఎదురీతవల్ల లాభం ఏమిటి? ప్రసాద్ మంచివాడు. మాలతి సుఖంగా బతకగలిగే అవకాశం ఇది. మీ మూఢ నమ్మకంతో దాన్ని పాడు చెయ్యకండి. తండ్రిగా మీరు చెయ్యాల్సిన పనికాదు''

"ఇప్పుడు మాలతి సుఖానికేం తక్కువ? మనమేం తక్కువ చేశాం?''

తండ్రీకొడుకుల మధ్య దెబ్బలాట నాపడానికి మాలతి వస్తే మాలతిని గద్దించాడు మాధవన్నయ్య.

"వద్దు మాధవన్నయ్యా! నాకోసం మీరు దెబ్బలాడుకోవద్దు. నేను పెళ్ళి చేసుకోను. అదే ప్రసాద్‌గారికి చెప్పేశాను కూడా.నేను నాన్నగారి మనసు నొప్పించలేను"

రాజీవుడు చికాగ్గా, "నీ సంతోషం నీకక్కర్లేదా మాలీ? ప్రసాద్‌ని వదులుకోవడం అంత సులభమయిందా?"

"సులభమన్నానా నేను. ఎవరో ఒకర్ని వదులుకోవాలి నేను. ఇప్పటికే శివన్నయ్యని వదులుకోవాల్సి వచ్చిందని బాధపడుతున్న నాన్నగారు కూతుర్ని కూడా వదులుకుని బాధపడాలా? నా ఖర్మ నేననుభవిస్తాను. నాకేం కావాలి చెప్పండి? రోజుకి రెండుపూటల అన్నం, సంవత్సరానికి రెండు చీరలు, మీ పిల్లలు మనుమలతో నాకు కాలక్షేపం అయిపోతుంది" అంది బాధగా నవ్వుతూ.

మాధవుడు, రాజీవుడు మరింకేం మాట్లాడలేక అక్కడనుండి వెళ్ళిపోయారు. మాలతికూడా తన గదిలోకి వెళ్ళిపోయింది.

మాలతి నిరాశతో అన్న మాటలు రావుగారి చెవిలో గింగురుమన్నాయి. అంత వైరాగ్యపు మాటలాడాల్సిన వయస్సా మాలతిది? భర్తతో అన్యోన్యంగా కాపురంచేసుకుని ఉండాల్సిన మాలతి ఇప్పుడు అన్నా వదినల ఆశ్రయంలో కాలంగడపాల్సిన ఖర్మ పట్టిపడిందా?

తనకోసం పెళ్ళిచేసుకుని సుఖంగా కాపురం చేసుకునే అవకాశాన్ని కాల

దన్నాలంటే – ఆమెకు తను అంటే, తనకు కూతురంటే వున్న ప్రేమకన్నా ఎక్కువ ప్రేమే వుందన్నమాట! ఏదో సాంప్రదాయానికి కట్టుబడి, సమాజానికి భయపడి కూతురి పెళ్ళి పాడుజేసినా ఆమె తనను నొప్పించడానికి సిద్ధంగా లేదు.

ఆ చిన్నపిల్ల హృదయ వైశాల్యం ముందు సిగ్గుపడి తలవంచుకున్నారాయన.

వయస్సు పైబడుతున్నకొద్దీ మనస్సు విశాలం కావాలి. ఇంత వయస్సయినా- సంపాదించాలి, కూడబెట్టాలి అని తమకే అన్ని కోరికలున్నప్పుడు చిన్నపిల్ల మాలతికి మరెన్ని కోరికలుండాలి? అలాంటిది ఆమె ఎంత వైరాగ్యం పెంచు కుంది?

మాలతిగాని శివన్నయ్య లా. గా ప్రసాద్‌ని పెళ్ళిచేసుకుంటానని పట్టుబట్టి వుంటే రావుగారుకూడా పంతానికోస మయినా మాలతిని వదులుకోవడానికి సిద్ధపడేవారు. కాని మాలతి దెబ్బలాటకు దిగకుండా ఓటమిని వప్పుకునేసరికి రావు గారికి దిక్కుతోచలేదు. ఎంత వీరుడైనా గాలితో దెబ్బలాడలేడుకదా?

సాధారణంగా విధవలకు దొరకని అవకాశం దొరికినపుడు, మాలతి మొండిగా తండ్రి ఇష్టానికే ప్రాముఖ్యత ఇవ్వడం రావుగారి కొడుకులకు ఆశ్చర్యం కలుగజేసింది. దాంతో వారు ఇంట్లో ముభావంగా వుంటున్నారు. రావుగారు చాలా ఆలోచించి మఠం స్వాములవార్ని ఈ విషయంలో సలహా అడగదల్చు కున్నారు. ఓ నెల పూళ్ళోవున్న మఠా ల్లోని పండితులతో చర్చలు జరిపాక ఓ రోజు రావుగారు ప్రయాణానికి సిద్ధ మయ్యారు. ఎక్కడికి ఏమిటి అని అడిగే ధైర్యం ఇంట్లో ఎవరికీ లేదు. మాలతి మాత్రం –

"నేనూ రానా నాన్నగారూతోడుగా?" అనడిగింది భయంగానే.

"వద్దు"

"ఎక్కేటప్పుడు దిగేటప్పుడు జాగ్రత్త నాన్నా!" అని జాగ్రత్తలుచెప్పి ఆయనకు ప్రయాణంలోకి కావాల్సిన మందులు అన్నీ సిద్ధంచేసి పెట్టింది. అది చూసి ఆయన హృదయం కరిగినీరయింది.

అలా వెళ్ళిన రావుగారు ఓ వారం తర్వాత వచ్చారు. ఎంతో అలసిపోయి నట్టు కనిపించినా ఆయన నడకలో ఓ రకమయిన చురుకుదనం వుంది. ఆయన కళ్ళు ఆనందంతో మెరుస్తున్నాయి.

రావుగారు రావటం చూసిన మాలతి ఆయన చేతిలో సంచి అందుకుంది. ఆయన గట్టిగా, "నా స్నానం ఇంకా కాలేదు మాలతీ'' అన్నారు.

రావుగారి గొంతు అలా మాలతి విని నాలుగేళ్ళయింది.

"ఇవాళ వంటేమిటి?" అని రావుగారు అడిగేసరికి ఆశ్చర్యపోయింది మాలతి. మహేశుడుపోయాక ఆయనకు భోజనంలో ఆసక్తి పూర్తిగా పోయింది.

"చిలకదదుంప కూర, బీన్సు సాంబారు"

"చిలకద దుంపలో చక్కెరవుంటుంది. బీన్సు పైత్యం చేస్తుంది. నాకు పడని కూరలే చేస్తారింట్లో''

"ఇవాళ్టికూరుకో నాన్నా! రేపట్నుంచి నీక్కావాల్సిన తోటకూర, క్యారట్ తెప్పిద్దాం''

"మంచి పిల్లవే. ఒక్కరోజు తోట కూర తినకపోయినా కుదరదు నాకు''

రావుగారు స్నానమయ్యాక ఎప్పటిలా బట్టలు కట్టుకుని బయటకు రాలేదు.




తువ్వాలు చుట్టుకుని బయటకువచ్చి, "బాబీ, మంజూ, సతీశా..." అని కేకపెట్టారు.

ఈ నాలుగేళ్ళలో వారంతా బళ్ళో చేరారన్నమాటే మర్చిపోయారు రావు గారు. ఇప్పుడు ఇంట్లో వున్నది మాలతి మాత్రమే.

ఆయన పిలుపువిని బయటకు వచ్చిన మాలతికి ఓక్షణం అర్థం కాలేదు. తర్వాత ఆయన అలవాటు గుర్తొచ్చి, ఆయన చేతిలో తువ్వాలు తీసుకుని కాళ్లుతుడిచింది.

భోజనాల దగ్గరకూడా మాలతితో వంట గురించి వ్యాఖ్యానిస్తూ భోంచేశారు.

"మాలతీ! సుశీలమ్మను రేపు మెంతి దోసెలు వెయ్యమని చెప్పు. రాజీ తర్వాత సుశీలమ్మ బాగా వేస్తుంది"

రావుగారు ఇలా ఏదయినా కావాలని అడిగి చేయించుకుని ఎంతో కాలం అయింది. పైగా భోజనమయ్యాక ఆకూ వక్కా వేసుకుంటానని పట్టుబట్టారు. ఆయనకు పడదని మాలతి చెప్పినా విన లేదు. మాలతి ఆకులు చుట్టిస్తే వేసు కున్నారు. వెంటనే నొప్పితో "అయ్యో" అన్నారు.

"ఏమయింది నాన్నా?"

"ఓ పన్ను కదులుతోంది. అది పక్క నమిలితే తగిలి నొప్పెట్టింది"

ఆ తర్వాత ఓ నాలుగ్గంటలు పసి పాపాయిలా నిద్రపోయారు. ఆయన నిద్రలేచేసరికి ఆయనకిష్టమైన పకోడీలు సిద్ధంగా వున్నాయి.

రాత్రి అందరి భోజనాలూ అయ్యాక రావుగారు మాలతిని పిల్చి-

"మాలతీ..వదినలు అందర్నీ పిల్చుకుని రామ్మా! శారదమ్మవారికి కుంకుమార్చన చేయించుకుని వచ్చాను.అందరికీ కుంకుమ ప్రసాదం ఇస్తాను" అన్నారు.

మాలతి ఆ కబురు వదినలకు చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయింది. అక్కడ తనకేం పని? తను నుదుటిమీద పెట్టుకునే బొట్టు అర్థహీనమైంది. శారదమ్మవారి ప్రసాదమైన కుంకుమ ముట్టుకునే అర్హత తనకెక్కడిది?"

రావుగారు అందరికీ ప్రసాదమిచ్చి చుట్టూ చూశారు. ముద్దులకూతురు మాలతి కనిపించకపోయేసరికి గట్టిగా పిల్చారు.

తలుపుదగ్గరకువచ్చి నిల్చున్న మాలతి వంక గర్వంగా చూశారాయన. తాను కట్టుకున్న తెల్లచీరకన్నా తెల్లగా పాలి పోయిన మొహంతో నిల్చుంది- మాలతి గుమ్మందగ్గరే.

"రామ్మా...వచ్చి కుంకుమ, ప్రసాదం తీసుకో" అంటున్న రావుగారిమాట అర్థం కాలేదామెకు.తెల్లబోయి నిల్చున్న అన్నలు, వదినలవంక నిస్సహాయంగా చూసింది మాలతి.

వణుకుతున్న కంఠంతో, "నాన్నా... అది అమ్మవారి కుంకుమ. గురు పీఠం నుంచి వచ్చిన ప్రసాదం" అంటూ నాలుగడుగులు వెనక్కివేసింది.

"అది నాకూ తెలుసును. పెద్దవాడు చెప్పినమాట చిన్నవాళ్ళు వినాలి"

మాలతి చిన్నగా అడుగులువేస్తూ దగ్గరకొచ్చి చేతులుపట్టింది. కుంకుమ, ప్రసాదం చేతిలో వేసేసరికి, ఆ భారం తట్టుకోలేనట్టు, అక్కడే ఆయన కాళ్ళవద్ద కూలబడింది మాలతి.

ఆమె తలమీద చేయిపెట్టి, గద్గద కంఠంతో, "దీర్ఘ సుమంగళీభవ" అని మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు రావుగారు.





# చతుర కతలు



## కక్కుర్తి!

అది బారుకాని బారు! లైసెన్సు లేకుండా దాన్ని నిర్వహిస్తున్నారు ఓ బ్రాందీషాపుని ఆనుకుని వున్న ఇరుకు గల్లీలో.

ఒక బల్లచుట్టూ కూర్చుని వున్నారు వేర్వేరు ఆఫీసుల్లో పనిచేస్తున్న నలుగురు మిత్రులు. ప్రతి నెలా జీతం అందుకున్నాక వారు చేసే పని- అక్కడ సమావేశమై మందు సేవించడం!

ఒక రౌండ్ అయింది.

మామూలు కబుర్ల మధ్యలో హఠాత్తుగా "ఇవాళేం జరిగిందంటే..." అన్నాడు మాధవ్- సిగరెట్ పొగ వదుల్తూ.

సీసాలోని ద్రవాన్ని నాలుగు గ్లాసుల్లోనూ వంపి, సోడాకలిపి రెండో రౌండ్‌కి ఏర్పాట్లు చేస్తున్న వామనరావు, ఆ పనిని ప్రత్యేక శ్రద్ధతో గమనిస్తున్న శేఖరం, సిగరెట్ పొగను రింగులుగావదిలి వాటిలో తన అభిమాన తార ప్రత్యక్షమైనట్టు వూహించుకుంటున్న సదానందం ప్రశ్నార్థకం మొహాలతో మాధవ్ వైపు చూశారు. రెట్టించిన ఉత్సాహంతో అతను తన కథనం ప్రారంభించాడు.

"ఇవాళ నా దగ్గిర రూపాయిమాత్రమే వుంది. లంచ్ అవర్‌లో ఆఫీసుకు ఎదురుగా వున్న హోటల్‌కి వెళ్ళాను. టీ తాగితే మిగిలే డబ్బుల్తో నా బ్రాండ్ సిగరెట్ ఒక్కటే వస్తుంది. జీతమేమో సాయంత్రానికిగానీ అందదు. అప్పటివరకూ ఒక సిగరెట్టుతో కాలం గడపటం అసాధ్యం! పక్కవాళ్ళనడుగుదామంటే, మా డిపార్టుమెంట్లో అంతా ఆడవాళ్ళేగద! ఆలోచిస్తూ టీ తాగాను. బిల్ చెల్లించడానికి కౌంటర్ దగ్గిరకెళ్ళే అక్కడ బోల్డంత రష్. ప్రొప్రైటర్ డబ్బులు తీసుకోవడంలోనూ, చిల్లర ఇవ్వడంలోనూ చాలా హడావుడిగా వున్నాడు. అంతకంటే చక్కని అవకాశం మరేముందని చల్లగా హోటల్లోంచి బైట పడ్డాను. ఆవిధంగా డబ్బులు మిగుల్చుకుని సిగరెట్లు కొనుక్కోగలిగాను!"

మాధవ్ పూర్తి చేయగానే సదానందం అందుకున్నాడు.

"నాకూ ఇవాళ ఇలాంటి అనుభవమే అయింది గురూ! నెలాఖర్లో నీదగ్గిర కనీసం రూపాయైనా మిగిలింది. నాదగ్గిర అదీ లేదు. మా ఆఫీసులో ఒకణ్ని పట్టుకుని ఎలాగైతేనేం రెండ్రూపాయలు సంపాదించాను. నేను భోజనం లేకపోయినా వుండగలనుగానీ సిగరెట్లు, టీ లేకపోతే చచ్చిపోతానన్న సంగతి మీకూ తెలుసుగా! ఆ రెండ్రూపాయలతో ఓ అర పెట్టె సిగరెట్లు తీసుకుని, ఓ టీ లాగించి సాయంత్రం వరకూ బండిని నెట్టేద్దామనుకున్నాను. పాన్‌షాపులో అర పెట్టె సిగరెట్లు కావాలంటూ రెండ్రూపాయలనోటిస్తే, వాడు సిగరెట్లతోపాటు మూడున్నరిచ్చాడు. అయిదు రూపాయల నోటనుకున్నాడుగామోసు! శుభ్రంగా అందుకుని హోటలుకి వెళ్ళి ఆ డబ్బుల్తో హాయిగా టిఫిన్ కూడా లాగించాను"

సదానందం ఖాళీగ్లాసును బల్లపైవుంచి, "అప్పుడప్పుడూ ఇలాంటి కక్కుర్తిపడని వాడీ భూప్రపంచంలో వుండదేమోనని నా







అనుమానం గురూ! అవసరమే మనచేత అలా కక్కుర్తి పనులు చేయిస్తుంది... ఏమంటారు?" అన్నాడు.

"నిజమే" అన్నట్టు తలలు వూపారు శేఖరం, మాధవ్‌లు.

"నేనొప్పుకోను" అన్నాడు వామనరావు తల అడ్డంగా వూపుతూ.

"ఏం...ఎందుకు వొప్పుకోవు?" మీద పడినట్లుగా అడిగాడు సదానందం.

"అది మీలాంటివాళ్లెవరో చేసే పనేమోగాని,నాలాంటివాళ్లు అలా చెయ్యరు ఆకలికి మాడేందుకైనా సిద్ధపడతారుగాని"

వామనరావు మాటకి ఫెళ్లున నవ్వాడు సదానందం.

"చెప్పకు గురూ! నీకింతవరకూ ఆ అవసరం రాలేదేమో!అవసరమొచ్చినపుడు నువ్వూ చేస్తావ్! కాకపోతే నాబోటి వాళ్లు చెప్పుకుంటారు. నువ్వు గుట్టుచప్పుడు కాకుండా చేస్తావు... తేడా అంతే!"

"అంతే...అంతే" శేఖరం, మాధవ్ సపోర్టు వచ్చారతనికి.

వామనరావు వాదించడం ఇష్టంలేనట్టు వూరుకున్నాడు. అంతటితో ఆటాపిక్ ముగిసి ప్రసంగం మరోవైపు మారింది.

ఆరోజు వంతు ప్రకారం బిల్లు వామనరావుది. కుర్రాడు బిల్ చెల్లించి తెచ్చిన డబ్బుల్లో 3 రూపాయలపైనే టిప్ వదిలి మిగిలిననోట్లు తీసుకున్నాడు వామనరావు.

''ఇక్కడ కూడా అంత టిప్ ఎందుకు?'' అని వారించబోయాడు మాధవ్.

"పోనీ, పాపం కుర్రాడు!'' అన్నాడు వామనరావు.

బైటకు నడుస్తుండగా వామనరావుకి తను చేతిరుమాలు కుర్చీలో మర్చిపోయిన సంగతి గుర్తొచ్చింది.

"వెళ్లి తెచ్చుకో. మేం బైట నిలుచుంటాం" అన్నారు ముగ్గురూ.

చకచకా తాము ఇంతకుముందు కూర్చున్న బల్లవైపునడిచాడువామనరావు. ఇంకా ఎవరూ చేరలేదు దాని దగ్గిర. కుర్చీలో వున్న కర్చీఫ్ తీసుకున్నాడు.

హడావుడిగా తిరుగుతున్న కుర్రాడు ప్లేటులోని టిప్‌ను ఇంకా తీసుకోలేదు.

చుట్టూ చూసి తననెవరూ గమనించటం లేదని నిర్ధారణ చేసుకున్న వామనరావు ప్లేటులో అర్ధరూపాయి మాత్రం వుంచి

మిగిలిన డబ్బులుతీసి జేబులో దోపుకుని, చరచరా నడిచాడు అక్కడి నుంచి!

# సీనియర్!

'స్వయం ఉపాధి పథకం'గా రచనా వ్యాసంగాన్ని చేపడదామా అన్పించింది నిరుద్యోగి సదాశివానికి, హఠాత్తుగా. వెంటనే, "ఛ.ఛ! సాహిత్యాన్ని వ్యాపారంగామార్చడమా?" అనితలచాడు. ఆ వెంటనే అతనికి రచనా వ్యాసంగం ఓ కుటీర పరిశ్రమగా పేరు పొందిన విషయం గుర్తొచ్చింది. అదీ గ్రీన్ సిగ్నల్‌లా తోచి రైటో! అనుకున్నాడు- ముందుకు దూసుకుపోవడానికి!

కాని కాయితం, కలం పట్టుకుని కూచున్నపుడుగాని తెలిసింది కాదు సదాశివానికి, రాయటం ఎంత కష్టమో! అందులోనూ తనలాంటి కొత్తవాడికి! పెన్ను విదిలిస్తే ఇంకు బొట్టు బొట్టుగా రాలి పడుతోందే తప్ప ఒక్క వాక్యమైనా రాయలేకపోయాడు.

అప్పుడు గుర్తొచ్చిందతనికి ఓ సాహిత్య వ్యాసంలో 'కథకు ప్లాటు ముఖ్యం' అని రాయబడిన సంగతి! ప్లాటంటే రచయిత దేనిమీద కథ రాయాలనుకుంటాడో (కాయితం కాదు) అదని తెలుసు! ఆ మాత్రం తెలివి తేటలున్నాయి సదాశివానికి. కాని, ఏ విషయంపై కథ అల్లాలనేది అతనికి వెంటనే తట్టలేదు, సహజంగానే!

అప్పుడే అతనికి ఇటీవల బాగా వ్యాప్తిచెందిన కాపీరాయుళ్ళ సంప్రదాయం గురించి తెలిసింది. ఎంతో పేరు తెచ్చుకుని, ప్రసిద్ధులైనవాళ్ళే చేస్తుండగా నేను దాన్ని అనుసరించడం తప్పేలా అవుతుందనే ధీమాతో కాపీకి తగిన ఆంగ్ల నవల కోసం వేట సాగించాడు. వెదికి వెదికి ఓ నావెల్టీగల పుస్తకం పట్టుకుని శుభ్రంగా దాన్ని తెలుగులో కథగా రాసేశాడు!

ఇంతలో పక్కింటివాళ్ళకి అతిథిగా తన అభిమాన రచయిత విచ్చేసినట్టు తెలిసింది సదాశివానికి. కథ ఆయన చేత చదివించి, ఆశీర్వాదాలందుకుని, పత్రికకి పంపిస్తే తన రచనా వ్యాసంగం మూడు నవలలు, ఆరు కథలుగా వర్ధిల్లవచ్చనే ఆశ కలిగిందతనికి. వెళ్ళి ఆయనకి నమస్కరించి తన గురించి చెప్పుకుని కథ చేతిలో పెట్టాడు.

ఆ రచయిత విసుగు దాచుకుని కథ చదివి ముఖం చిట్లించాడు.

"ఇది ఫలానా ఆంగ్ల నవలను కాపీ కొట్టి రాశారు కదూ?" కొట్టినట్టే అడిగాడు.

సదాశివం బిత్తర పోయాడు.

బుకాయించేంత అనుభవజ్ఞుడు కాదు గనుక వెంటనే తన తప్పు వప్పుకున్నాడు.

"మీకు రాసే శక్తి లేనపుడు చేతులు ముడుచుకుని కూర్చోవాలి. అంతేకాని ఇలా పరభాషలనుంచి కాపీకొట్టి రచయితగా చలామణీ అవాలనుకోవడం చాలా సిగ్గుచేటైన విషయం!"

చివాట్లు తిని నీరసంగాకాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోతున్న సదాశివాన్ని చూస్తే రచయితకి జాలి కలగలేదు సరికదా, పళ్ళు నూరుకున్నాడు.

"నేను కాపీకొట్టి సీరియల్‌గా రాద్దామనుకున్న నవల వీడు ముందే చదవటం నన్నెంత నష్టపరచింది! ఇప్పుడా నవలను కాపీకొట్టే అవకాశం మిస్సయినట్టే గదా!" అనుకున్నాడు కోపంగా.

— జాకీ




## ప్రత్యేక
# అభివందనం

ఉత్తమాభిరుచులుగల పాఠకుల స్వంత పత్రికలుగా విఖ్యాతమైన విపుల, చతురలు 100వ సంచికలను వెలువరించుకున్న సందర్భంగా అపూర్వమైన రీతిలో మేము ప్రకటించిన కథలు-నవలల పోటీని విజయవంతం చేసిన రచయితలకు, రచయిత్రులకు మా ధన్యవాదాలు.

పోటీలకు ఆఖరుతేదీ మే 31నాటికి ముందే వందల సంఖ్యలో నవలలు, వేలసంఖ్యలో తెలుగు, తెలుగేతర భాషాకథలు మహోత్సాహంతో పంపిన సాహితీ స్రష్టలకు మా అభివందనలు.

ఉత్తమ సాహిత్యసృష్టిని గౌరవించి, పట్టంగట్టి, పాఠకులకు విందుచేసే ప్రయత్నంలో ప్రామాణిక పద్ధతులను అనుసరిస్తున్న మా సంస్థ ఈ పోటీ ఫలితాలను వీలయినంత తక్కువ వ్యవధిలోనే ప్రకటించగలదని ఆశిస్తున్నాం.

వివరాలు త్వరలో ఈ పేజీలలోనే...



# KORA INSTITUTE OF MEDICAL/ ENGINEERING ENTRANCE
## NELLORE-3


M.రవిచంద్ర
Med-RANK-2
H.T. No. 6641


K.సునీల్‌బాబు
Med-RANK-34
H.T. No. 18806


A.V.సతీష్‌బాబు
Med-RANK-87
H.T. No. 19497

**1986 EAMCET**
పరీక్షలో రాష్ట్రంలోకెల్లా అత్యుత్తమ ర్యాంకులను అత్యధికశాతం ఫలితాలను (60 మెడికల్ + 140 ఇంజినీరింగ్) సాధించిన మా విద్యార్థినీ విద్యార్థులకు

మా హార్దిక శుభాకాంక్షలు

**1987 ఎంట్రెన్స్ పరీక్షలకు**

**సాంవత్సరిక శిక్షణా తరగతులు**

**త్వరలో ప్రారంభమగును**

**పోస్టలు కోచింగ్ వసతి కలదు**


D.వసంతలక్ష్మి
Med- RANK-28
H.T. No. 18031


C.భాస్కరరెడ్డి
Med- RANK-57
H.T. No. 19603


G.వరప్రసాదరావు
Med- RANK-101
H.T. No. 19287

వివరాలకు:

**KORA**
23/451 Achari Street
Near Z.P. Office
NELLORE-3 Phone : 6054

**B. VINAY BABU**
Tekkemitta
NELLORE-3
Phone : 5542

బాల బాలికలకు విడిగా పరిమిత హాస్టలు వసతి కలదు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

